అపరాధ పరిశోధన అనుబంధం—51

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అవతార పురుషుడు

రచన: కె. బి. ఎస్. కుమార్

## ఏలు నా మా

రచన: యస్. గీతారాణి

## మండూక బిలం

రచన: టి. యం. సత్యనారాయణరెడ్డి

## దోపిడిదొంగ సీతాపతి

రచన: వసుంధర

'శాస్త్రోర' సీరియల్ - 16 వ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—51
మార్చి, 1978
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి
సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

"ఏమిటి హుషారుగా బయటకి వెళ్ళినవాడివి యింత డల్ గా తిరిగొచ్చావ్? ఏమయింది డాడీ!"

"అమ్మా భవానీ! పదహారేళ్ళయింది నువ్వు పుట్టి. అయిదేళ్ళయింది మీ అమ్మని కోల్పోయి. ఈ ఐదేళ్ళుగా తల్లీ-తండ్రి నేనే అయి పెంచాను నిన్ను. రేపు నాకే దయినా అయ్యిందనుకో! ఆ తర్వాత...ఆ తర్వాత నిన్ను ఎవరు చూస్తారమ్మా?" ఆవేదనగా అన్నాడు గోవింద రావు.

"డాడీ! ఏమిటి యివ్వాళ వింతగా మాట్లాడు తున్నావ్?" గాభరాగా అంది భవాని.

"ఇందులో వింతేముందమ్మా! పుట్టిన ప్రతివాడూ చావక తప్పదుకదా! అందుకే దీపముండగానే యిల్లు చక్కదిద్దుకోవాలన్నారు పెద్దలు...

"సాధ్యమైనంత త్వరగా నీకు మేరేజ్ చేసేస్తే మిగిలి వున్న ఆ ఒక్క బాధ్యతా తీరిపోతుంది. నిన్నూ ఈ ఆస్తినీ అల్లుడే కాపాడుకుంటాడు."

"నో...నో డాడీ! అయ్ ఓంట్ అగ్రీ. నా కూతురికి అప్పుడే పెళ్ళిచెయ్యను, బాగా చదివిస్తాను అని అంద రితోనూ చెప్పావు. కనీసం ఎమ్మే అయినా కావాలను కుంటున్నాను. ఆ తర్వాత యు. ఎస్. ఏ. పంపుతానని నువ్వే చెప్పావు. ఇప్పుడింకా బియ్యే ఫస్టియరే! నో— లెట్ మీ స్టడీ!"

" పదిరోజుల్లోగా నువ్వు పెళ్ళిచేసుకోకపోతే నీపెళ్ళి నేనెప్పుడూ చూడలేనమ్మా!" గోవిందరావు కంఠం రుద్ధమయింది.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగింది భవాని.

5

ోతాను గాబట్టి'' నీళ్ళు
ాని, గిరుక్కున తనగది
ాడు గోవిందరావు.
యింది భవాని!

2

సుపుపచ్చని దేహచ్ఛాయ,
ుదులవరకు వ్రేలాడే బిరు
ులాంటి ముక్కు.
కం బొట్టు వినీలాకాశంలో
తెస్తోంది. అందమైన ఆ
లా? అన్పిస్తున్నాయి..."
చెప్పటానికొక్కాదు స్విడ్జర్
ంది..." బుంగమూతితో

దేటు ఫిక్స్ చెయ్యటాని
ఆపుకుంటూ అన్నాడు

నేనే ఫిక్స్ చేస్తానన్లేదు.
.నీతో ఓ విషయంగురించి
భవాని.
ా నా బావమరిది. అంటే
కెళ్ళుంటుంది. అందము,
ా రీభవించిన కుర్రాడు.
వర్శిటీ కంతా ఫస్టుగా
ప్రముఖ చేతి గడియారాల
వేస్తున్నాడు.

సరస్వతమ్మ బ్రతికున్నంతవరకూ తమ్ముణ్ణి కొడుకులా పెంచింది. చనిపోతూ చివరికోరికగా మురళిని, భవానిని దంపతులుగా చెయ్యమని కోరింది.

మురళి అంటే భవానికి ఆపేక్ష. భవాని అంటే మురళికి అభిమానం. వాళ్ళిద్దరూ పెద్దయ్యేసరికి ఆపేక్ష, అభిమానం_రెండూ కల్సిపోయి 'అనురాగం'గా రూపం దాల్చింది. వాళ్ళిద్దరూ కాబోయే దంపతులు!

"ఏమిటో అంత సీరియస్ విషయం?" నవ్వుతూనే సోఫాలో కూర్చున్నాడు మురళి.

భవానికూడా అదే సోఫాలో అతని ప్రక్కనే కూర్చుంది.

"డాడీ, ఎటువంటి వ్యక్తి?"

"ఏం, అలా అడిగావ్?"

"ప్లీజ్ ఆన్సర్ టు ది పాయింట్"

"మంచివాడు."

"యింకా"

"ప్రతి ఒక్కరితోనూ కలుపుగోలుగా మాట్లాడుతాడు."

"యింకా?"

"ఎవర్నీ నొప్పించే స్వభావంకాదు"

"ఊఁ అసలు విషయం రానేలేదు నీ నోట్నుండి" కాస్త అయిష్టంగా అంది భవాని.

"ఎప్పుడూ నవ్వుతూ నవ్వించే స్వభావం గలవాడు"

"అఁ...అదీ పాయింటు. ఇప్పుడు కరక్టుగా చెప్పావ్. బుద్ధి తెలిసినప్పటి నుండీ వుద్యోగం వచ్చేవరకూ డాడీ దగ్గరే వున్నావ్. అవునా?"

అదే విషయం చెప్పాడు మురళి.

"కొంపదీసి నీకు మెసేజ్ యిచ్చి నేను పిలిపించిన విషయం చెప్పావేమిటి?" ఆత్రంగా అంది భవాని.

"లేదు. మెసేజ్ లో అలా చెప్పొద్దని నువ్వే తెలిపావ్ గదా!"

"వెరీగుడ్. యింకో ముఖ్యవిషయం."

"ఏమిటది?"

"గత ఆదివారం...డాడీ తొలిసారిగా విషాదంగా కన్పించినరోజు...నా పెళ్ళి విషయం ఎత్తాడు. నా పెళ్ళి విషయం ఆయనకి పెద్ద సమస్య అయి కూర్చుందిట."

"కారణం అడగలేకపోయావా?"

"అడిగాను. తను పదిరోజుల్లో చనిపోతాడట!!!"

"ఆఁ?!"

"అవును. తను పదిరోజుల్లో చనిపోతాడని తనకి ఎలా తెల్సు? ఎవరు చెప్పారు? ఎవరేనా చంపుతామని బెదిరించి వుంటారా? ఆత్మహత్య చేసుకోవాలని అనుకుంటున్నాడా? కారణం?

"ఈ రోజు ఆదివారం. అంటే ఈ రోజుకి సరిగా వారమైంది ఆయన యిలా వుండబట్టి. ఆయన చెప్పిన ప్రకారం ఇంకా మూడు రోజులుంది గడువు.

"దిగులుతో మనిషి ఈ వారంలోనే సగమైపోయాడు. రోజులు గడిచేకొద్దీ మరీ దిగజారిపోతున్నారే కాని ఆయన ముఖంలో సంతోషచ్ఛాయలు మచ్చుకైనా కాన రావటం లేదు. నాకేమీ తోచటంలేదు. ఈ విపత్తునుండి డాడీని నువ్వే కాపాడాలి మోంమయ్యా!" భవాని కనులు చెమ్మగిల్లాయి. ఆమె కంఠం రుద్ధమైంది.

"నువ్వేం కంగారు పడకు, ఆయన విషయం నెమ్మదిగా నేను రాబడతాను. ఆయనలోని మానసిక రుగ్మతని పోగొట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు మురళి.

# 3

సాయంత్రంవరకూ గోవిందరావుని గమనించి భవాని చెప్పిందాంట్లో అబద్ధం ఏమీ లేదని గ్రహించాడు మురళి.

ఏరోడ్రోమ్ నుండి తనని ఇంటివద్ద డ్రాప్ చేసి రెస్టు తీసుకోమని చెప్పి వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం వచ్చి కుశలంగా యోగక్షేమాలు విచారించి తన గదిలోకి వెళ్ళి పోయాడు.

ఆతర్వాత అన్యమనస్కంగా బయటికి వెళ్ళినవాడు సాయంత్రం ఆరు తర్వాత వచ్చాడు. రాగానే కాఫైనా తీసుకోకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

భవాని చెప్పిన విషయాలన్నీ మరోసారి మననం చేసుకున్నాడు మురళి. తనే గోవిందరావు గదిలోకి నడిచాడు.

కుశలంగా నవ్వి తిరిగి ముభావంగా మారిపోయాడు గోవిందరావు.

ఇలా అయితే లాభంలేదని నేరుగా రంగంలోకే దూకాడు మురళి.

"నీకెలా తెలుసు?" ప్రశ్నించాడు.

"యిలాంటివి ఒకరు చెప్పాల్సిన పనేలేదు బావా! చూడు, ఎలా అయిపోయావో! నాపై నీకు అభిమానం వుంటే అసలు విషయం ఏమిటో చెప్పు" మొదట్లోనే చివరి అస్త్రం వదిలాడు మురళి.

"మురళీ! ఈ రోజు ఏనాటికీ లేదీ! పదో తేదీలోగా మీ ఇద్దరికీ పెళ్ళి చెయ్యాలని అనుకున్నాను. కాని అసలు కారణం చెప్పేవరకూ పెళ్ళిమాటెత్తొద్దని ఖండితంగా చెప్పేసింది బేబీ!"

"భవాని చెప్పేదేమిటి? నేనే చెబుతున్నాను. అసలు విషయం చెప్పేవరకూ మా ఇద్దరి పెళ్ళి జరగదు."

"మురళీ! నువ్వుకూడ .."

"అవునుమరి. నీ బాధ నీదేకాని భవానిని గురించి ఆలోచించావా? పదిరోజుల్లో చనిపోతానని చెప్పావుట. ఆ పిల్ల ఎంత బాధపడిందో తెల్సా? అసలు నేనూ ఓమాట అడగాలనుకుంటోన్నాను."

"నన్నా?"

"అవును."

"అడుగు మురళీ!"

"నేనెప్పుడు చనిపోతాను?"

"మురళీ?!"

"భవానిని పెళ్ళిచేసుకునే ముందు నా ఆయుష్షెంతో తెల్సుకోవాలనుంది."

"ఛ. అవేం మాటలు?

"అవును. ఆ పిల్ల అమాయకురాలు. నేను యింకాచాలా కాలం బ్రతికే పక్షంలోనే పెళ్ళాడుతాను."

"నీ ఆయుష్షెంతో నాకెలా తెలుస్తుంది?"

"నీ ఆయుర్దాయం నీకు తెల్సినప్పుడు నాది మాత్రం ఎందుకు చెప్పలేవు?"

ఏం చెప్పాలో తోచలేదు గోవిందరావుకి.

ఆ సమయాన్ని దుర్వినియోగం చేసుకోలేదు మురళి.

"నువ్విలా నమ్మావ్?"

"నమ్మకపోవటానికి ఆస్కారమే లేదే! నన్ను అతనెప్పుడూ చూళ్ళేదు. మన బేబీని అసలే చూళ్ళేదు. మన బిజినెస్ వ్యవహారాలూ అవీ అతనికెలా తెలిశాయ్? మన బేబీ గడ్డంపై నల్లని చిన్న పుట్టుమచ్చ వుందని వూహించటం సాధ్యమా? అవన్నీ నిజాలు. నేను చని పోవటం మాత్రం అబద్ధమంటావా?"

"నిజంగా అంత మహిమగలవాడా ఆ స్వామి?"

"నమ్మకమనేది చెప్పడు మాటలకి కలగదని నీకు యిది వరకే చెప్పాను. కావాలంటే."

"అయితే నేనోసారి ఆయన్ని చూడాలి."

# 4

అదో పెద్ద బిల్డింగ్. చుట్టూ కాంపౌండ్. ఎన్నో రకాల పూల మొక్కలు కుండీలలో ఎంతో అందంగా వున్నాయి.

అరలుగల పెద్దపెద్ద చెక్క పెట్టెల్లోని పెంపుడు పావురాలు తెల్లగా—గూడిముక్కల్లా. అక్కడ నెలకొన్న కాంతికి చిహ్నాలుగా అందంగా తిరుగాడుతూ ఆడు కుంటోన్నాయి.

"ముక్తిమార్గ" అన్న అందమైన పెద్ద అక్షరాలుగల బోర్డువంక ఓసారి చూసి చెప్పులు బయటే వదలి లోపలి కడుగుపెట్టాడు మురళి.

లోపల పెద్ద హాలులో ఆడా—మగా—భక్తులు కాబోలు! బారులుతీరి కూర్చొని వున్నారు. వారందరి మధ్య ప్రసన్న వదనంతో కళ్ళుమూసుకొని ధ్యానంలో నిమగ్నులై వున్నారు నిత్యానంద స్వామి!!

"సరే. యివన్నీ ప్రతిరోజూ చెబుతోన్నాను. మీరూ వింటోన్నారు. నేనెన్నిసార్లు చెప్పినా మీరెన్నిసార్లు విన్నా నేను కోరేది ఒక్కటే! ఈ లోకం మిథ్య. మన మంతా మిథ్యే! ఆస్తిపాస్తులు, సుఖభోగాలు, కుల గోత్రాలు అన్నీ మిథ్యే!!! తనువు చాలించాక ప్రతి మానవుడూ చేరేది మరుభూమే!

"మరుభూమిలో ఏ తేడాలూ వుండవ్! ఏ ఆస్తి పాస్తులూ వెంటరావు. ఏ బాంధవ్యాలూ వెంబడించవ్! ఆఖరుకు ఎన్నోయేళ్ళు ప్రాణప్రదంగా చూసుకున్న శరీరాన్నీ ఎముకల్నీకూడ మరుభూమిలోనే వదలి వెడుతుంది ఆ మంటల్లో పవిత్రత చెందిన మానవుడి ఆత్మ!!!

"ఏం ప్రయోజనం? వెంటరాని ఆస్తిపాస్తుల కోసం తాపత్రయపడి వెధవ కోరికల్ని పెంచుకొని వాటిని నెరవేర్చుకోటం కోసం అడ్డదారులు త్రొక్కి నానాగడ్డి కరచి సంపాదించి ఏం సుఖపడగలుగుతోన్నాడు మానవుడు?

"నిజానికి సంపదలో ఎన్నో సందేహాలున్నాయి. ఎన్నో బాధలు, భయాలు, కలతలు, కన్నీళ్ళు-ఇంకా ఎన్నో, ఎన్నెన్నో వున్నాయి. వాటన్నిటినీ త్యజించి, సంతృప్తిని మించిన సంపద లేదని తెలుసుకోగల్గినవాడే నిజమైన మానవుడు! కోరికల్ని అదుపులో పెట్టుకోగలిగిన మానవుడు భగవత్సమానుడు!!!

"అటువంటి శక్తి దైవచింతనవల్ల లభిస్తుంది. మీ మీ కోరికల్ని భక్తిమార్గంవైపు మళ్ళించండి. ముక్తిమార్గంలో పయనించి సరైన గమ్యం చేరుకోండి." వుపన్యాసాన్ని ముగిస్తూ నెమ్మదిగా కళ్లు మూసుకున్నారు స్వాములవారు.

అంతవరకూ ఆయన శాంత గంభీర స్వరంతో యిచ్చిన వుపన్యాసాన్ని మంత్రముగ్ధుల్లా వింటూ కూర్చుండిపోయిన భక్తులు ఒక్కసారిగా తేరుకున్నారు. భక్తిగా తలలు వంచి నమస్కరించారు ఆయన మాటల్లో అతిశయోక్తి లేదని అంగీకరించినవారిలా.

"భక్తులారా!" స్వాములవారి శిష్యుల్లో ఒకడు లేచాడు. ఆ ప్రదేశమంతా నిశ్శబ్దంతో నిండిపోయింది.

"యధాప్రకారం శ్రీవారు మీలో యిద్దర్ని ఎన్నుకుంటారు. వారు తప్ప తక్కినవారందరూ వెళ్ళిపోవచ్చు. ఆ యిద్దరు అదృష్టవంతులూ శ్రీవారిచే భూత-భవిష్యత్-వర్తమానకాలాలని గురించి తెలుసుకోవచ్చు వారికి సంబంధించినంతవరకూ."

హాల్లో చీమ చిటుక్కుమన్నా స్పష్టంగా విన్పించేంతటి గంభీర నిశ్శబ్దత ఆవరించుకుంది. ప్రతి ఒక్కరూ స్వాములవారు తననే పిలుస్తారన్న ఆశతో, పిలవాలన్న కోరికతో అమితాసక్తితో ఎదురుచూస్తోన్నారు.

మురళికి ఏదో తెలియని ఎన్నో భావాలు జనించసాగాయ్. స్వాములవారు ఎవర్ని పిలుస్తారు? వారి జీవితానికి సంబంధించిన వివరాలు ఎలా చెప్పగలుగుతారు? తనని పిలిస్తే బావుండును. తన కొన్ని సందేహాలు ఆయన తీర్చగలడేమో...!

తనని పిలిస్తే ఏయే ప్రశ్నలడగాలో ఆలోచించుకుంటూ రెండు నిమిషాలు గడిపాడు మురళి.

నెమ్మదిగా కళ్ళు తెరిచారు స్వాములవారు. భక్తుల గుండెలు ఆత్రంతో ఒక్కక్షణం ఆగి మళ్ళీ కొట్టుకోనారంభించాయి.

భక్తులందరివేపూ ఓ మారు తేరిపార చూశారు స్వాములవారు. స్త్రీల వరుసలో ఓ అమ్మాయిని, పురుషుల వరుసలో ఓ యువకుణ్ని వ్రేలుపెట్టి చూపించారు.

అమ్మాయెవరోకాని, ఆ యువకుడు మాత్రం మురళి!!

మిగతా భక్తుల వదనాలు చిన్నబోయాయి. ఇక అక్కడ వుండి చేసేదేదీ లేనట్టుగా ఒక్కొక్కరుగా నిష్క్రమించారు.

ఆ అమ్మాయికి పద్దెనిమిది-ఇరవై మధ్య వయసు వుంటుంది. చదువుకున్న అమ్మాయని మొహం చూస్తేనే చెప్పొచ్చు. ఆకర్షణీయమైన విగ్రహం. రింగు రింగుల ఒత్తైన పొట్టి వెంట్రుకల్ని రబ్బర్ రింగ్‌తో బిగించింది. విశాలమైన నుదుట ఆకుపచ్చని తిలకబొట్టు మెరుస్తూంది.

"నీ పేరేమిటమ్మా?" ప్రసన్నవదనంతో ఆమెవేపు చూస్తూ అన్నారు స్వాములవారు.

ఆ అమ్మాయి తడబడినట్టుగా స్వాములవారివంక చూసి నెమ్మదిగా వెనుదిరిగి మురళికేసి దృష్టిసారించింది.

"అర్థమైందమ్మా! ఆ అబ్బాయి నీ వివరాలు వింటాడనేగా! ఫర్వాలేదు అతనీ దేశస్థుడు కాదులే...!"

వులిక్కిపడ్డాడు మురళి. 'తనీ దేశస్థుడు కాడని అతనెలా చెప్పగలిగాడు???'

"చెప్పమ్మా!" మరోసారి ఆమెవేపు చూశారు స్వామి.

"యశోద..." తగ్గుస్వరంతో చెప్పిందామె.

అరనిమిషంపాటు కళ్ళు మూసుకున్నారు స్వామి. ఆ తర్వాత కనులు తెరచి సూటిగా ఆమెవేపు చూశారు. ఆయన ముఖం నెమ్మదిగా గంభీరతని సంతరించుకుంది.

"అవును. వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకున్న నెలలోగా ప్రభాకర్ పాముకాటుకి గురై చచ్చిపోతాడు. అలాగని మీ యిద్దరూ చేసుకుంటే సుగుణ ఆత్మహత్య చేసుకుంటుంది."

గడగడ వణికిపోయింది యశోద. "మరెలా స్వామీ! వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకోకుండా అడ్డుపడినా..."

"మీ చెల్లెలు బ్రతకదు."

ఏం మాట్లాడటానికీ అర్థంకాక శిలలా నిల్చుండి పోయింది యశోద.

"నాకు... నాకేం చెయ్యటానికి పాలుబోవటంలేదు... అదసలే మొండిమనిషి. తను అనుకున్నది జరక్కపోతే ఎంతకైనా తెగిస్తుంది. పెళ్ళైన నెలకే యింత ఘోరం జరుగుతుందని ఎలా చెప్పటం? చెబితే నమ్ముతుందా? ప్రభాకర్‌నుండి నేనేదోఆశించి ఈ పెళ్ళి నేనే కాకుండా చేస్తున్నానని అపోహపడుతుందేమో! పెళ్ళి జరిపిస్తే నెల లోగానే నా చెల్లెలు...నో...నో...నా చెల్లెలు పెళ్ళి పారాణి ఆరకముందే విధవకాకూడదు. నాకు దూరం కాకూడదు. స్వామీ! నా చెల్లిని మీరే కాపాడాలి..." దీనంగా అంది యశోద.

"అలాగేనమ్మా! రేపు శుక్రవారంనాడు ఇదే సమయానికి మీ చెల్లెల్ని తీసుకురా! ఆ అమ్మాయికి నా చేతో భస్మమిస్తాను. అది సేవిస్తే ప్రభాకర్‌పై ఆమెకున్న భ్రమ, ప్రేమ భస్మమైపోతాయి. ఆ తర్వాత ఆమెకు మరో సంబంధం చూడండి."

"అలాగే స్వామీ!" భక్తితో నమస్కరించింది యశోద.

"నిజం చెప్పాలంటే నా కిలాంటి జ్యోతిష్యం వగైరా లంటే నమ్మకంలేదు స్వామీ! కాని యిక్కడికొచ్చాక మిమ్మల్ని చూశాక, యశోదగారితో మీరు మాట్లాడాక నా అపోహలన్నీ తొలగిపోయాయి. నా అజ్ఞానాన్ని మన్నించండి. మీరు చెప్పబోయే విషయాలకోసం వెయ్యి చెవుల్తో సిద్ధంగా వున్నాను" భక్తిగా చేతులు కట్టుకున్నాడు మురళి.

స్వాములవారి పెదవులపై లిప్తపాటు చిరుమందహాసం నాట్యంచేసింది. "సంతోషం నాయనా! ఈనాడు నువ్వు ముక్తిమార్గంలో పయనించే బాటపై తొలి అడుగు మోపావు. చిరంజీవునివై వర్ధిల్లు."

"ధన్యుణ్ని.."నమ్రతగా చేతులు జోడించాడు మురళి.

"నువ్వు రావటానిక్కూడ కారణం అదే! నీవారి విషయంలో నిజానిజాలు కనుక్కుందామని వచ్చావు. అవునా?"

"అవును..."

"నీ తాలూకు ప్రస్తుతం నువ్వు రావటానికి కారణమైన వ్యక్తి పేరులో అయిదక్షరాలున్నాయి. మొదటి అక్షరం 'గ'కారంతో మొదలవుతుంది."

"అవును స్వామీ! గోవిందరావు. మాబావ."

"అతను మొన్న మా పిలుపుకి అర్హుడయ్యాడుకదూ!" తలూపాడు మురళి.

"అరమైంది. అతనికి ఈనెల పదోతేదీ_అంటే రేపే! మరణం రాసిపెట్టబడి వుంది."

"అదే. ఆ విషయం మీ నోటివెంట విన్నప్పటినుండీ ఆయన మనసులోనే కృళ్ళిపోతున్నారు. అతని ఆయుష్షు

తీరటం మాట అటుంచి ఈ దిగులుతోనే కన్నుమూసేట్టు న్నాడు. ఏది చెప్పినా ఫర్వాలేదు. కాని 'నువ్వు ఫలానా రోజు ఛస్తావ్' అని చెబితే ఆ మనిషి గతేం కాను?"

"మాకు తెలిసిన విషయాలన్నీ చెబుతాం నాయనా! తెలియని విషయాలు లేనపుడు అన్నీ చెప్పాల్సివస్తుంది. అన్నీ కాకపోయినా కొన్నైనా చెప్పాలి. వాటిలో మీ బావగారి విషయంలో అది అతి ముఖ్యమైనది. నేను చెప్పకపోయినా రేపు మీ బావకి క్రియాశేషులు కావటం తథ్యం. మరణం ముందే తెలిసినప్పుడు, ఆలోగా చక్క బెట్టుకోవల్సిన పనులుంటే చక్కదిద్దుకోవచ్చుకదా!"

"అయితే మా బావగారి చావు" భయంగా అన్నాడు మురళి.

"రావుగారి చావు రేపు రాత్రికి తప్పదు. భూమ్యాకాశాలు బ్రద్దలైనా నా నాలుక దాటి వచ్చిన మాట అబద్ధంకాదు. దీపముండగానే యిల్లు చక్కదిద్దుకోండి..."

పిచ్చివాడిలా తలూపాడు మురళి...

## 5

ఆ రోజే పదో తేదీ!!!

అమావాస్యరోజులు కావటంతో ఆకాశం 'తారు' రంగుని పులుముకుంది.

ఆకాశమైతే నిర్మలంగా వుంది కాని గోవిందరావు మనసు మాత్రం భయంతో అల్లకల్లోలంగా వుంది! గడియారం చేస్తూన్న 'టిక్, టిక్' మనే శబ్దంకూడ అతని గుండెపై సమ్మెట పోట్లలా ఊహింపజేస్తూంది.

గడియారంవేపు చూశాడు గోవిందరావు. పదకొండూ యాభై అయిదు!!

అతనిగుండె ఒక్క క్షణం ఆగి తిరిగి కొట్టుకో నారంభించింది.

'అయిపోయింది. మరో అయిదు నిముషాల్లో తను అందరికీ దూరం కాబోతున్నాడు. ఇహలోక బంధాలన్నీ తెంచుకొని పరలోకపు అనుభవాలు చవి చూడ బోతున్నాడు.

తన ఒక్క గానొక్క కూతురు పెళ్ళిని కళ్ళారా చూడలేక పోయాడు తను. ఆమె మొండి పట్టుదలకి వారధి కట్టలేకపోయాడు.

మురళికూడ తన ఆవేదనని అర్థం చేసుకోలేక పోయాడు. ఫలితంగా వాళ్ళిద్దర్నీ దంపతులుగా ఆశీర్వదించే అదృష్టాన్ని తను కోల్పోయాడు!

స్వాములవారి దర్శనం చేసుకుని తనవద్దకి వచ్చిన మురళి తనని సముదాయించాడు. అలాంటి పిచ్చి నమ్మకాలేవీ పెట్టుకోవద్దని, ధైర్యంగా వుండమని ధైర్యం చెప్పాడు.

కాని, ఆ మాటలు చెబుతోన్న మురళి కంఠస్వరంలోని దైన్యాన్ని, అపనమ్మకాన్ని తను స్పష్టంగా గుర్తించగలిగాడు. స్వాములవారి పట్ల మురళికూడ నమ్మకం కల్గిందని సులువుగా గ్రహించాడు.'

ఆలోచిస్తూనే మరోమారు క్లాక్ వంక చూశాడు గోవిందరావు. పదకొండూ యాభైఏనిమిది!!!

"భగవాన్! నా తదనంతరం నా కూతుర్ని కాపాడి మురళితో వివాహం జరిపించే భారం నీదే..." చేతులు జోడించి ఆ రెండు నిమిషాలూ దైవప్రార్థన చేసే వుద్దేశ్యంతో కళ్ళు మూసుకున్నాడు గోవిందరావు.

ఒకొక్క క్షణం గడచిపోతోందని చెబుతోన్నట్టుగ గడియారం 'టిక్ టిక్' మని శబ్దం చేస్తూనే వుంది.

సెకన్లు భారంగా గడిచిపోయాయి.

తనప్రక్కన మంచంపై ఏదో 'దబ్' మని వస్తువు పడినట్టు అన్పించి వులిక్కిపడి కళ్ళు తెరిచాడు గోవిందరావు.

తనని కాటు వెయ్యడానికి ఆత్రంగా వస్తూన్న పొడు గాటి పాము! పాము ప్రయత్నాన్ని విఫలంచేస్తూ దాని గొంతుకని ఒడిసిపట్టుకున్న బలిష్టమయిన చెయ్యి!

తన గదిలో తనకి తెలీకుండా తన ప్రాణం కాపాడ్డం కోసం మరొకరు యింతవరకూ దాక్కొని వున్నారా? ఎవరు? మురళి కాదుగదా?

"మురళీ!" అంటూ మంచం దిగిన గోవిందరావు ఆశ్చర్యపోయాడు.

అతను మురళి కాదు! మరెవరు?

"బావా! నేనిక్కడున్నాను." బీరువా చాటునుంచి చిరునవ్వుతో ఎదురొచ్చాడు మురళి. అతని వెనుకే భవాని కూడా వచ్చింది.

"మురళీ! ఏమిటిది? వీరెవరు?" ఏదీ అర్థంగాని అయోమయావస్థలో అప్రయత్నంగా అడిగాడు గోవింద రావు.

"వారెవరోకాదు. ప్రఖ్యాత డిటెక్టివ్ జలంధర్!"

"అయితే స్వాములవారు చెప్పిన జోస్యం నిజం కాదా?" గొణిగాడు గోవిందరావు.

"ఏం? నిజం కావాలనుందా? అసలు స్వాములవారే నిజంకాదు."

"అవును గోవిందరావుగారూ! ఋజువు చూస్తారా?" అంటూ వెనక్కితిరిగి చప్పట్లు కొట్టాడు జలంధర్.

మరునిమిషంలో ఇరవయ్యేళ్ళ బలిష్టమయిన జలంధర్ ఆఫీస్ బోయ్ గోపి ఓవ్యక్తికి చొక్కాపట్టుకొని బరబరా లాక్కొచ్చాడు. ఆ వ్యక్తి వణికిపోతున్నాడు.

"చెప్పు, ఈపనికి నిన్ను నియమించిందెవరు? గోవిందరావుపై నల్లత్రాచుని వుసిగొల్పి అతన్ని చంపమని నిన్ను వుసిగొల్పిందెవరు?" కఠినంగా ప్రశ్నించాడు జలంధర్.

"నిత్యానంద స్వాములవారు!" తలొంచుకుని చెప్పాడు ఆ వ్యక్తి వణికిపోతూ.

స్థాణువై పోయాడు గోవిందరావు.

మురళీ చిన్నగా దగ్గి చెప్పసాగాడు.

"నువ్వు ఎప్పుడూ సంతోషంగావుంటూ నవ్వుతూ ఎదుటివాళ్ళనికూడా నవ్వించేవాడివి. వున్నట్టుండి ఏదోలా మారిపోయావు. ఏదోబాధ నిన్ను తినెయ్యసాగింది. అది గమనించింది భవాని. నీకు తెలియకుండా నాకు కేబుల్ పంపి నన్ను పిలిపించింది.

"భవానితో మాట్లాడాను. నీ బాధకు కారణం భవాని నోటమ్మటవిని ఆశ్చర్యపోయాను. పదిరోజుల్లో నువ్వు చనిపోబోతున్నావట.

"ఎంత స్వాములవారయినా ఎదటి మనిషి ఆయుష్షు ఎలా చెప్పగలడు? అదీ అంత ఖచ్చితంగా. నాకేదో అనుమానం వేసింది. నీతో వాదించాను.

"కాని నువ్వు నమ్మలేదు. ఇది ద్వాపరయుగం కాదు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో చదువు సంస్కారం నాగరికత మూర్తీభవించిన నీలో యింతటి మూఢనమ్మకమా? ఆశ్చర్యపోయాను. ఎవరికేనా చెప్పినా నవ్విపోయే విషయం.

''అయినా ఆ స్వాములవారిని ఓసారి చూడాలనిపించింది. వెళ్ళాను. ఏదేదో వుపన్యాసమిచ్చాడు. చివరగా నన్ను, ఓ అమ్మాయిని పిల్చాడు.

''ఎన్నో రోజులుగా, నెలలుగా స్వామి పిలుపుకోసం ఎదురు తెన్నులు చూస్తోన్న 'భక్తులు' అంతమంది వుండగా ఆరోజువచ్చిన నన్నే పిలవటంలో అర్థం? నా అనుమానం బలపడింది.

''ఆయన చెప్పినవి నమ్మినట్టు, అతనిపై నాకు అమితమయిన నమ్మకం కలిగినట్లు నటించాను. అతని కళ్ళలో మెరుపు గమనించాను.

''ఆ అమ్మాయి— యశోద విషయాలు స్వామి చెప్పబోయేముందు నన్నూ అక్కడే వుండనిచ్చాడు నాకు మరింత నమ్మకం కల్గించాలని. ఆమె విషయంలో అతను చెప్పిన విషయాలన్నీ నిజమని యశోద ఒప్పుకుంది.

''తర్వాత ఆమె ఆటోలో వెళ్ళిపోయింది. నేనూ, టాక్సీ పిలిచి ఆమెకి తెలీకుండా అనుసరించాను. వాళ్ళ యిల్లు కనుక్కొని వాకబు చేశాను.

''అసలు యశోదకు చెల్లెలే లేదని తెలిసింది. నాకు దిక్కు తోచలేదు. ఇందులో ఏదో మిస్టరీ వుందనే నమ్మకం మాత్రం బలపడింది.

''ఈ మిస్టరీని ఛేదించటం నా ఒక్కడివల్లా సాధ్యమయ్యేపని కాదని తోచింది. అప్పుడప్పుడూ ఇక్కడికి వచ్చినప్పుడు జలంధర్ గారి పేరు వినివుండటంతో, టెలిఫోన్ డైరెక్టర్‌లో వారి అడ్రస్ వెదికి వారిని కలిశాను''

ఆ తర్వాత చెప్పమన్నట్టుగా జలంధర్ కేసి చూశాడు మురళి.

అంత్యదశ కొచ్చిన రెడ్ విల్సని ఆష్ట్రేలో పడవేసి

మరో సిగరెట్ వెల్గించుకొని ప్రారంభించాడు డిటెక్టివ్ జలంధర్.

"మురళి నన్ను కలిసి అన్ని విషయాలూ వివరించారు. స్వశక్తితో బిజినెస్‌ని యింతగా ఇంప్రూవ్ చేసుకొన్న మీరుకూడా మూఢనమ్మకాలికి లొంగిపోవటం నన్నూ ఆశ్చర్యపరచింది. అవతార పురుషుడుగా చెప్పబడుతున్న ఆ స్వామీజీ అసలు అవతారమేమిటో తేల్చుకోవాల న్పించింది.

"యశోద స్వామీజీ తరఫు మనిషేనని గ్రహించాము. ఆలోచించి చూడగా మీకుటుంబంపై స్వామీజీ కన్ను పడిందని, మీ ప్రాణంపోతే అతనికేదో లాభం వస్తుం దని వూహించాం. అదేదో తెల్సుకోవాలన్పించింది. మరి అది నువ్వు చెబుతావా నన్నే చెప్పమంటావా మిస్టర్ దయానంద్?" వెనుకనున్న దయానంద్ కేసి దృష్టి మర లుస్తూ అన్నారు జలంధర్.

"దయానందా? ఏమిటి మీరంటున్నది? అతను నా పర్సనల్ అసిస్టెంట్ జలంధర్ గారూ!" అన్నాడు గోవిందరావు.

"ఇతను బిజినెస్ వ్యవహారాల్లో మీ పర్సనల్ అసి స్టెంట్. కాని మీ ఆస్తిని కాజేసే పథకాన్ని జయ ప్రదంచేసే వ్యవహారాలలో స్వామీజీ పర్సనల్ అసి స్టెంట్."

"ఆఁ?"

"అవును, మీ తదనంతరం మీ ఆస్తి అంతా మీ కూతురికి చెందుతుంది. మురళి భవానిని వివాహం చేసు కుంటే వాళ్ళిద్దరికి చెందుతుంది. ముందుగా మీ అడ్డు తొలగించుకోవాలనుకున్నాడు.

్రల' వివరాలు రహస్యంగా
తో యధాతథంగా చెప్పి
పాదించుకున్న స్వామీజీ
ప్రజలు. ఈ విధంగా
ద్‌పై అనుమానం యెలా
త్రం రావటానికి ఆ అను
యి?

ఎరలి వివాహం చేసుకొని
తుండగా మధ్యలో విమాన
స్త కష్టమయిన పనయినా
వృష్టిలో కొత్తదంపతులు
ఎంచక్కా 'వచ్చిపోతారు.
రాదు.

యినా ఈ ఆస్తిని అనుభ
య్యటంలో సిద్ధహస్తుడైన
తో మార్చుకోవటం కష్ట

వివరాలన్నీ?'' మెదడు
గోవిందరావు.

.? ఈరాత్రి మీ ప్రాణా
తకం రాశారు ఆలోచించి
మీ ఆస్తిని పంచుకోవాలో
సమయంలో పాత కథను
వీళ్ళు మాట్లాడిన మాట
గానంద్ షర్టుకి అమర్చిన
మావస్తున్న టేప్ రికార్డర్‌కి
ఫు ఆన్ చేశారు జలంధర్.

వినేకొద్దీ గోవిందరావు ముఖం ఎర్రబడసాగింది. అంచలంచెలుగా దయానంద్ ముఖం నల్లబడింది.

"ఎంత నాటకం? నన్ను క్షమించండి జలంధర్ గారూ. మూఢనమ్మకాల ముసుగులో మా కుటుంబం 'గోవిందా' కావటానికి నేనే కారణం అయ్యుండే వాణ్ని. మీ ఋణం, మురళి ఋణం ఎలా తీర్చుకోను?" డగ్గుత్తికతో అన్నాడు గోవిందరావు.

"నా ఋణం మీ బదులు మురళి తీర్చేశాడు. మురళి ఋణం ఎలా తీర్చాలో మీకు తెల్సు" చిరునవ్వుతో అన్నాడు జలంధర్.

ఆనందబాష్పాలు రాలుతుండగా మురళి చెయ్యి ఆప్యాయంగా నొక్కాడు గోవిందరావు.

"మరి, స్వామీజీ ఏమయ్యాడు? గుట్టు బయట పడిందని పారిపోయాడా?"

"ఆఁ, జెండా ఎత్తబోయాడు. పట్టుకునేసరికి తెల్ల జెండా ఎత్తాడు. నల్ల జెండా ఎత్తించి మరీ కటకటాల్లో తోశాం. ఇప్పుడక్కడ మీ అవతార పురుషుడు మరో అవతారంలో కన్పిస్తాడు. యశోదకూడా అక్కడేవుంది.

"సాయంత్రం అలా ఈవినెంగ్ వాక్ గా రండి స్టేషన్ వేపు. స్టేట్ మెంట్ యిచ్చినట్టూ వుంటుంది. ఆ అవతార పురుషుడిని చూసినట్టూ వుంటుంది." చిరునవ్వుతో అంటూ లేచారు డిటెక్టివ్ జలంధర్!

—: ఐపోయింది :—

మూర్తి ప్లేటులో చెయ్యి కడిగేసి, ఒక సిగరెట్ ముట్టించి, మళ్ళీ మిత్రులను చూసాడు.

రవి, కిశోర్, వర్మలు తలలు ఎత్తనయినా ఎత్తకుండా తినేస్తున్నారు. నలుగురు మంచి స్నేహితులు.

"రవీ! మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" మూర్తి మెల్లగా అన్నాడు.

"వైనాట్? తప్పకుండా మాట్లాడు" రవి చెయ్యి కడుక్కుంటూ అన్నాడు. అతను మంచి డిటెక్టివ్ రచయిత. అప్పటికి కిశోర్, వర్మలుకూడా చేతులు కడిగేసుకొని సిగరెట్స్ అందుకున్నారు. వాళ్ళిద్దరూ బిజినెస్ చేస్తున్నారు. మంచి ఆస్తిపరులు.

మూర్తి చిన్నగా నిట్టూర్పు వదలి చెప్పటం మొదలు పెట్టాడు. "ముందు మీకొక కథ చెప్తాను. అదివినండి. భవానీ పట్టణం అనేది ఒక పల్లెటూరు. ఆ పల్లెటూరిలో నారాయణభూపతి అనే జమీందారు వుండేవాడు. ఆయనకి ఒకేఒక్క సంతానం రమేష్‌చంద్ర.

నారాయణభూపతికి ఒక బావమరిది ఉన్నాడు. అతని పేరు జగన్నాథం. అతనికి ఇద్దరు పిల్లలు శిరీష, శ్రీనాథ్‌లు. శిరీషను రమేష్‌చంద్రకి ఇచ్చి పెళ్ళిచేసేసి, ఆస్తిని హస్తగతం చేసుకోవాలను కుంటున్నాడు జగన్నాథం."

మూర్తి తన మాటల్ని ఆపి మిత్రుల ముఖాలలోకి చూసాడు.

ముగ్గురూ ముఖాలని ఆముదం తాగినవాళ్ళలా పెట్టారు.

వాళ్ళకి తను చెప్తున్న కథపై బొత్తిగా ఆసక్తిలేదని గ్రహించాడు మూర్తి. అయినా తను చెప్పదలచుకున్నది ఆపదలచుకోలేదు.

రవి పౌరుషంగా అంటూ, జేబులోంచి వందరూపాయల నోట్లుపది తీసి బల్లమీద పడేసాడు. మూర్తి ఆ నోట్లుతీసి రవి షర్టుజేబులో పెట్టేసి "డబ్బుతో ఈ మూర్తి పంతెం కాయడు" అన్నాడు.

"మరి దేనితో?" రెట్టిస్తూ అడిగాడు రవి.

"మాట. మాటతో పంతెం. నేను చెప్పేది కథకాదు. కొన్ని అభాగ్యపు జీవితాల వ్యథ. ఆ వ్యధను కథగా మార్చి చెప్తున్నాను. నేను చెప్తున్న కథకు ముగింపు చిత్రమైనది. ఆ ముగింపు నువ్వు రాసేసే కథలలో ముగింపులాంటిది కాదు. మీరు నా కథ ముగింపు విన్నాక ఈరోజునుంచి నా మాటకు బద్ధులై వుండాలి. ఇదే నా పందెం!"

"వ్వాట్? జీవితాంతమూ నీ మాట వినాలా?" శర్మ ముందుకు వంగి అగాడు.

"కాదు. కొద్ది కాలమే"

"అంటే ఎంత కాలం?"

"చెప్పలేను. రోజు కావచ్చు, వారం కావచ్చు. నెల కావచ్చు. నా ఆశయం నెరవేరేవరకూ మీరు నా మాటలకు విలువనివ్వాలి. విలువనిస్తామని మాటిస్తే నేనా కథ చెప్తాను."

"మాటే నీ పంతె మన్నావుగా. ముందు మిగిలిన కథ చెప్పు!"

మూర్తి తిరిగి చెప్పటం ప్రారంభించాడు—

"వైజయంతి, రమేష్‌చంద్ర ప్రేమించుకొన్నారు. వారి ప్రేమ సంగతి నారాయణ భూపతికి తెలిసింది. మొదట పేదింటి పిల్లను చేసుకొంటావా అంటూ కొడుకుని మందలించాడు. కాని రమేష్‌చంద్ర పెళ్ళి అంటూ చేసుకొంటే

కొడుకును, మనవడిని ఒంటిగా పంపలేక కోడలిని జాగ్రత్తగా వుండమని చెప్పి, తనూ వాళ్ళతో బయలుదేరాడు.

వేటకు వెళ్ళిన ముగ్గురు సూర్యాస్తమయం అయినా తిరిగిరాలేదు. జగన్నాథం ఖంగారుపడిపోతూ మనుషులను పంపి ముగ్గుర్నీ వెతికించాడు. వెళ్ళిన వాళ్ళు నారాయణభూపతి, రమేష్‌చంద్రల రక్తసిక్తమయిన దుస్తులతో తిరిగి వచ్చారు.

వేటలో ఆ ఇద్దరితోపాటు రాజేష్‌చంద్రను కూడా ఏదో క్రూరజంతువు పొట్టన పెట్టుకొన్నదని, ఆ కుర్రవాని దుస్తులుకూడా దొరకలేదని చెప్పారు. వైజయంతి ఆ దుర్వార్తను విని తెలివితప్పిపోయింది. ముగ్గురూ ఒకేసారి మరణించటంతో వూరంతా గగ్గోలెత్తిపోయింది..."

మూర్తి తన మాటల్ని ఆపి, జేబులోంచి కర్చీఫ్ తీసి నుదుట పట్టిన చెమటను తుడుచుకున్నాడు.

"మూర్తీ! ఆ తరువాత ఏమయింది? వైజయంతి ఏమయిపోయింది?" శర్మ వుత్సుకతగా ప్రశ్నించాడు.

"చెప్తాను. వైజయంతి మామగారికి, భర్తకు కర్మలు ఘనంగా జరిపించింది. అయితే దురదృష్టం ఆమెనుకూడ చుట్టుముట్టింది. చిన్న వయసులో భర్త పోవటంతో వైజయంతి ఎవడితోనో అక్రమ సంబంధం పెట్టుకొన్నదని పుకార్లు లేచాయి. కాదు జగన్నాథం లేవదీశాడు.

వైజయంతి అన్నయ్య అది భరించలేకపోయాడు. ఉద్యోగానికి శలవు పెట్టుకొని చెల్లెల్ని, తండ్రిని తీసుకు వెళ్ళిపోవటానికి వచ్చాడు. అన్నతో వెళ్ళిపోయేముందు వైజయంతి కోవెలకు వెళ్ళింది. అంతే కోవెలకు వెళ్ళిన ఆమె తిరిగి రాలేదు.

అన్న వూరికి తీసుకువెళ్ళి పోతాడని వైజయంతి తన ప్రియుడితో లేచిపోయింది, అని వూరంతా అన్నారు.

వైజయంతి వెళ్ళిపోయాక నారాయణభూపతి, రమేష్ చంద్ర దెయ్యాలై ఆ భవంతిలో నివాసమేర్పరచుకొన్నారనే మరో వదంతి పుట్టింది. రాత్రుళ్ళు రివాల్వర్ శబ్దాలు, బూట్లశబ్దాలు, ఫలహారాలు చేస్తున్న ధ్వనులు వినిపించటం మొదలుపెట్టాయి.

నౌకర్లు, దాసీలు భయంతో ఆ భవంతివదలి పారిపోయారు. జగన్నాథంకూడా భయంతో మరోఇంటిలో అద్దెకు దిగాడు. ఇప్పుడా బంగళా ప్రతి ఒక్కరిదృష్టిలో దెయ్యాల బంగళా!'' చెప్పటం ఆపాడు మూర్తి.

''మూర్తీ! ఇదంతా నిజమేనా లేక ఇందులో ఏదైనా మిస్టరీ వుందా?''

''నువ్వు వూహించింది కరెక్టు రవీ! రమేష్‌చంద్ర నారాయణభూపతి ఏ జంతువువాత బడలేదు. ఆ ఇద్దర్నీ జగన్నాథం చంపేశాడు. రాజేష్‌చంద్ర మాత్రం ఎలాగో తప్పించుకున్నాడు. అందుకే ఆ పసివాడి దుస్తులు చూపించలేక పోయారు.

అంతేకాదు, వైజయంతిమీద హత్యా ప్రయోగం చేసారు. ఆమె కోవెలనుంచి తిరిగి వస్తుండగా యిద్దరు మనుషులు ఆమె మీదపడి చంపబోయారు. ఆమె ఎలాగో తప్పించుకుని పారిపోయింది.''

మూర్తి మరోగ్లాసు డ్రింక్ తాగేసాడు గటగటా.

తమ ఆస్తిని కాజెయ్యాలని జగన్నాథం కుట్రపన్నుతున్నాడని నారాయణభూపతికి అనుమానంకల్గింది. ఆ స్తి వారికి దక్కరాదనే వుద్దేశ్యంతో ఆయన చంపబడటానికి

ముందురోజు లాయర్ హరనాధరావు దగ్గరకి వెళ్ళి యావదా స్తిని తన మనవడికి దక్కేలా, ఆ మనవడిని దక్కని పక్షమందు ప్రభుత్వానికి చెందేలా వీలునామా వ్రాసి, ఆ వీలునామాతో పాటుగా వైజయంతీ, రమేష్‌చంద్రా, శంభూ, అతని కొడుకు అందరూ కలసి తీయించుకున్న ఫోటోను ఒక రహస్య స్థలంలో దాచాడట.

వీలునామా సంగతి ఒక్క లాయర్‌కు మాత్రమే తెలుసు. జగన్నాధం ఆ బంగళా అంతా తిరగేసి వీలునామాకోసం గాలించాడు. కానీ వీలునామా లభించలేదు. అయినా జగన్నాధం తన ప్రయత్నాలను మానుకోలేదు. ఆ వీలునామా పొరపాటున బయటపడితే ఆ స్తి అంతా రాజేష్‌చంద్రకుగాని, ప్రభుత్వానికిగాని లభిస్తుంది. ఆ వీలునామా లేకపోతే ఆయనకే ఆ స్తి లభిస్తుంది," చెప్పాడు మూర్తి.

"మూర్తీ! నీవు చెప్పేదంతా నిజమైతే ఎవ్వరికీ తెలియని ఈ సత్యాలు నీకెలా తెలిసాయి?"

రవి ప్రశ్నకు మూర్తి కలవరపడుతూ చూసాడు.

"నాకా?...నాకు ఎలా తెలిసాయని ప్రశ్నించవద్దు?"

"నో, వీల్లేదు. ఎవ్వరికీ తెలియని వీలునామా సంగతి నీకు ఎలా తెలిసింది. నారాయణభూపతి వీలునామా వ్రాయించినట్లు లాయర్‌కు, ఆయనకు మాత్రమే తెలుసు నన్నావు. మరి ఆ గుప్త రహస్యం నీకెలా తెలిసింది? వైజయంతి చావునుంచి రక్షింపబడినట్లు ఎవ్వరికీ తెలియదు. అలాంటిది నీకు ఎలా తెలిసింది? నారాయణభూపతి, రమేష్‌చంద్ర, జంతువులవాత బడలేదని నీకు ఎలా తెలిసింది? రాజేష్‌చంద్ర ఇంకా బ్రతికి వున్నట్లు నీకెలా తెలును?" రవి బల్లగుద్ది మరీ అడిగాడు.

"మూర్తీ! నీతో భవాని పట్టణం రావటానికి మాకు అభ్యంతరం లేదు. కాని చిన్న సందేహం" అన్నాడు రవి.

"ఏమిటి రవీ?"

"నారాయణభూపతి వీలునామా లాయర్ చేత వ్రాయించాడు కదా. ఆ లాయర్‌కి ఆయన తన భయాన్ని గురించి చెప్పివుండవచ్చు. మరి ఆయన రమేష్‌చంద్ర, రాజేష్‌చంద్ర చనిపోయారని తెలుసుకొని వీలునామా సంగతి పోలీసులకి ఎందుకు చెప్పలేక పోయాడు?"

"కరెక్ట్‌గా ప్రశ్నించావు రవీ! ఆ లాయరే బ్రతికి వుంటే ఈ రోజు నేను మీకు ఈ కథ చెప్పేవాడిని కాను. వీలునామా వ్రాసిన రాత్రే ఆయన తన కొడుకు వుంటున్న వూరు వెళ్ళాడు. తిరిగి ఇంటికి వస్తూ ఆయన కూడా కారు ఆక్సిడెంట్‌లో మరణించాడు. ఆయన పోవటంతో వీలునామా గురించి ఎవరికీ తెలిసే అవకాశం లేక పోయింది."

"అదే అదే అడుగుతున్నా. ఆ లాయర్‌తో సమాధి అయిపోయిన వీలునామా చరిత్ర నీకెలా తెలిసింది?"

"ప్లీజ్! నన్ను ఏం ప్రశ్నించకండి. మిత్రులుగా నాకు హెల్ప్ చెయ్యండి. వీలునామా బయట పడితే అన్నీ మీకే తెలుస్తాయి."

## 2

మూర్తి, రవితో కలసి అతని ఇంటికి బయలుదేరాడు.

రవి పెద్దగా డబ్బున్న వాడుకాడు.

అతని జీతం అతని ఇంటికి సరిపోతుంది.

భార్య, అతనే కాబట్టి ఏ చీకూ చింతా లేకుండా గడిపేస్తున్నారు.

"రవీ! ఈ బాబు పేరు రాజా. ఒక అనాథ. ఈమధ్య కొద్ది రోజులు నాతోపాటే హోటల్‌లో భోంచేసేవాడు. నన్ను 'మామయ్యా' అని పిలుస్తుండేవాడు. ఈ రెండు రోజులుగా రాజా కనిపించటం లేదు. ఈ రోజు చెల్లాయికి కన్పించి వుంటాడు."

"ఆఁ అవునండీ. పాపం! ఆకలికి ఏడుస్తుంటే లోపలికి పిలిచి అన్నం పెట్టాను. మనకు ఎలాగో పిల్లలు లేరు. రాజాని ఇంట్లో వుంచేసుకొందామండీ" అంది జయంతి.

అతనికి ఏం చెప్పాలో తోచలేదు.

తమకు పెళ్ళి అయి నిండా ఆరునెలలు కాలేదు.

జయంతి ఇక పిల్లలే పుట్టరన్నట్లు అంటుంటే అతనికి చాలా వింతగా అనిపించింది. అయినా పైకి ఏమీ అనలేక పోయాడు.

మెత్తని మనసుగల రవికి భార్యను నొప్పించటం ఇష్టం లేదు.

"నీ ఇష్టం జయా, రాజాను ఇక్కడే వుండనీ" అని స్నానానికి లేచాడు.

మూర్తి బాబుని క్రిందకు దింపి "చెల్లాయ్! రేపు మేము భవానీ పట్టణం వెళుతున్నాం" అన్నాడు.

"భవానీ పట్నమా?"

జయంతి భయంగా ఏదో అనబోతుంటే, రవి తువ్వాలు కోసం వచ్చాడు.

"ఏమిట్రా మీ చెల్లాయ్‌తో మాట్లాడుతున్నావు!"

"మన ప్రయాణం గురించే చెప్తున్నా."

"అదా చెప్పు, చెప్పు. నీ మాటంటే మీ చెల్లెలికి గురి చాలా ఎక్కువ. నేనేకాని ముందుగా చెప్తే,

అమ్మో ఆ దెయ్యాల మధ్యకు వెళతారా? వీల్లేదు అంటుంది."

రవి భార్యను చిలిపిగా చూస్తూ అని, తువ్వాలుతో వెళ్ళిపోయాడు.

మూర్తి, జయంతి ఒకరి ముఖాలు ఒకరు చూసు కుంటూ వుండిపోయారు.

## 3

ఆ మర్నాడు మిత్రులు నలుగురూ జీప్‌లో భవానీ పట్టణం బయలుదేరారు.

రాజావస్తానని గోలచేస్తే, రవి ఆ పనివాడిని మాట లతో మరిపించి వుంచేసాడు. సరిగ్గా రెండు గంటలవు తుండగా భవానీ పట్టణంలోకి ప్రవేశించారు. జీప్‌ని తిన్నగా బంగళావైపే పోనిచ్చారు.

బంగళా ముందున్న స్థలంలో బాగా చెట్లు పెరిగి పోయి వున్నాయి.

ఏ సంరక్షణ లేకపోవటంతో చెత్తా, చెదారంతో నిండి పోయి వుంది అంతా.

మూర్తి జీప్‌లోంచి క్రిందకు దిగి గేటు తెరిచాడు.

జీప్‌ని ఓ వారగా ఆపి, మిగిలిన ముగ్గురూ సామాను లన్నీ క్రిందకు దించారు.

మూర్తి బంగళా తలుపులు తెరిస్తే మిగిలిన వాళ్ళు సామానులతో లోపలికి నడిచారు. పెద్దహాలు బూజుల మయంతో వుంది.

హాలుకి ఎడంవైపు మేడమెట్లు కనిపిస్తున్నాయి.

హాలు మూడువైపులా గదులున్నాయి.

"రవీ! భూత్ బంగళాలా వుందికదా!" కిషోర్ చుట్టూ చూస్తూ అన్నాడు.

రవి అవునన్నట్లు తలవూపి "ముందు సామాన్లు విప్పి, భోజనాలు కానిచ్చి, ఆ తరువాత బంగళాని గురించి ఆలోచిద్దాం!" అని అన్నాడు.

మేడమీద నాలుగు గదులలో నలుగురూ బెడ్డింగ్‌లు పరిచేరు.

ఉదయంనుంచి ఒకరి తరువాత ఒకరు డ్రయివింగ్ చేయటంతో బాగా అలసిపోయారు నలుగురు.

ఆ రాత్రికి ఎలాంటి పరిశోధనలు జరపవద్దని రవి అనటంతో వెంట తెచ్చుకున్న పదార్థాలు తిని, అంతా నిద్ర కుపక్రమించారు.

# 4

రవి పక్క మీదవాలి కళ్ళు మూసాడేకానీ, నిద్రాదేవి అతన్ని వరించటంలేదు. అతని మదిలో యెన్నెన్నో ప్రశ్నలు వుదయిస్తున్నాయి.

కానీ వాటికి సమాధానాలు శూన్యం!

సమాధానాల కోసం ఆలోచిస్తే తల బద్దలై పోతున్నదేకాని సమాధానం లభించటం లేదు.

అటు మూర్తికికూడా నిద్ర రావటంలేదు.

పక్క మీద అటూయిటూ దొర్లుతున్నాడు.

చేతివాచీ సరిగ్గా పదకొండు చూపిస్తున్నది.

అంతలో ఎవరో మేడ ఎక్కి వస్తున్నట్లుగా కిర్, కిర్ మంటూ బూట్లధ్వని వినిపించింది.

మూర్తి టక్కున లేచి కూర్చున్నాడు.

ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్న ధ్వని వినిపించసాగింది అతనికి.

అన్ని తలుపులు వేసి వుండగా లోపలకు వస్తున్నది ఎవరు?

"ఎక్కడ కనిపించింది?"

"నారాయణపభూతి కనిపించాడు."

"అబద్ధం! నేను నమ్మను." మూర్తి ఖచ్చితంగా అన్నాడు.

"నువ్వు నమ్మవు. కాని ఇది నిజం! ముందు బూట్ల చప్పుళ్ళు, నవ్వులు వినిపించినా నేను బెదరలేదు. కాని నా కిటికీ ఎవరో కొట్టేసరికి తీసాను. అంతే! స్థాణువులా నిలిచిపోయాను. జమీందారీ దుస్తుల్లో ఒకవృద్ధుడు నిలిచివున్నాడు. నన్ను చూసి చిన్నగానవ్వి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాక తెలివి తెచ్చుకుని అరిచాను!"

కిషోర్ ముఖంనిండా చెమటలు పట్టేసాయి. అతని శరీరమంతా భయంతో కాబోలు చిన్నగా కంపిస్తున్నది.

"కిషోర్! అన్నీ తెలిసిన నేనే బూట్ల శబ్దానికి జడిసిపోయాను. కొత్త మనిషినిచూసి నువ్వు జడవటంలో తప్పులేదు. ఆ ముసలాడు మాత్రం నారాయణభూపతి కాదు," అన్నాడు మూర్తి.

"ఎవరో మనిషంటావు. మనిషే అయితే నీ చేతులతో నీవే తలుపులు వేసావుకదా! అవ్యక్తి నా కిటికీ దగ్గర ఎలా ప్రత్యక్షమైనాడు. అతడేం దేవుడుకాదు. దెయ్యం కాబట్టి లోపలికి రాగలిగాడు."

"కిషోర్ నీ వాదన సరయినది కాదని కొద్దిరోజుల్లో ఋజువుచేస్తాను. దయచేసి ఎవరి రూమ్స్‌లోకి వాళ్ళు వెళ్ళండి!"

"అదికాదు మూర్తీ..."

రవి ఏదో చెప్పబోతుంటే "ప్లీజ్! నామాటకు ఎదురు చెప్పకండి!" అంటూ మూర్తి తనగదిలోకి వెళ్ళిపోయాడు.

మూర్తి ఆ చెరువులోకిదిగి ఒడ్డు చేరుకున్నాడు.

అతను కొద్దిదూరం వెళ్ళాక రవి తనూ చెరువులోకి దిగి మూర్తిని అనుసరించాడు.

కొద్దిదూరంలో చిన్న పెంకుటిల్లు కనిపించింది.

మూర్తి ఆ ఇంటిదగ్గరకు వెళ్ళి మెల్లగా తలుపుతట్టాడు.

అతను కొట్టిన కొద్ది క్షణాలకే తలుపులు తెరుచుకున్నాయి.

మూర్తి ఇంటిలోపలికి వెళ్ళిపోయాడు.

రవి గబగబా ఆ ఇంటి దగ్గరకివచ్చి, తలుపులోంచి చూసాడు.

కాని తలుపు వేసివుంది.

అతను కిటికీ దగ్గరకు వెళ్ళాడు.

కిటికీ రెక్కలు రెండూ దగ్గరగా చేర వేసి వున్నాయి.

కొద్దిగా వంగి లోపలికి చూసాడు రవి.

ఒక వృద్ధుడు, మూర్తి ఎదురుగా కూర్చొని కన్నీరు కారుస్తున్నాడు.

మూర్తి మౌనంగా అతన్ని వూరడిస్తున్నాడు.

రవికి మతిపోతున్నట్లయింది.

ఎవరా వృద్ధుడు? మూర్తికి, అతనికి ఏం సంబంధం వుంది?

అతను ఆలోచిస్తూనే వాళ్ళని చూస్తున్నాడు.

"కిషోర్ అప్పుడే బెదిరిపోతున్నాడు. వాడు, వర్మ ఆ ఇంట్లో ఎక్కువ కాలం వుండలేరేమో. రవిలో గుండె ధైర్యం చాలా వుంది. వాడు బెదిరిపోతాడనుకోను..."

రవికి ఆవేశం పొంగిపోయింది.

మూర్తి ఏదైనా కుట్రపన్నుతున్నాడా?

అంతలోనే తన పూహాపు తనని తనే తిట్టుకొన్నాడు.

మూర్తి అలాంటివాడు కాడు.

రవి తన ఆలోచనలని ఆపి, ఆ ఇద్దర్నీ చూసాడు.

"ఇంక వెళ్ళిరానా?"

"అప్పుడేనా?"

"ఇంకా ఆలస్యమైతే రవిగాడు లేచి కూర్చుంటాడు. వాడసలే క్రైమ్ రచయిత. నేను లేకపోవటం చూస్తే డిటెక్షన్ ప్రారంభిస్తాడు."

మూర్తి నవ్వుతూ అని లేచి నిలబడ్డాడు.

తను ఇంకా అక్కడే నిలబడటం శ్రేయస్కరం కాదని తెలుసుకొని, రవి బంగళాకి నడిచాడు.

## 5

ఆ మర్నాడు ఎనిమిది గంటలకు లేచాడు రవి.

మూర్తి చిక్కటి కాఫీ కలిపి తెచ్చి ఇచ్చాడు.

కాఫీ కప్పు అందుకొంటూ "రాత్రి ఎక్కడైనా వెళ్ళావా?" అని అడిగాడు.

"ఏం నేను ఎక్కడైనా వెళ్ళినట్లు రాత్రి కలగన్నావా!" మూర్తి చిరునవ్వుతో ప్రశ్నించాడు.

రవి ఇంకేం మాట్లాడలేకపోయాడు.

"మీరు ముగ్గురూ జగన్నాథం ఇంటికి వెళ్ళిరండి. మీరే వచ్చినట్లు చెప్పండి.

నా పేరు మాత్రం పైకి రానీయవద్దు!"

"నువ్వో?"

"నేను రాను. ఎందుకూ అని ప్రశ్నించవద్దు. అక్కడ నా పేరు బయట పెట్టవద్దు!"

మూర్తి రవి చేతిలో ఖాళీ కప్పు అందుకొని లోపలికి వెళ్ళిపోయాడు.

అతనితో వాదించి లాభంలేదని తెలుసుకొని, ముగ్గురూ డ్రెస్స్ చేసుకొని జగన్నాథం ఇంటికి బయలుదేరారు.

శ్రీనాథ్, శిరీష, జగన్నాథం ముందు గదిలోనే కూర్చొని వున్నారు.

రవిని మిగిలిన వాళ్ళను చూసి "ఎవరు మీరు?" అని ప్రశ్నించాడు శ్రీనాథ్.

రవి తమను పరిచయం చేసుకొన్నాడు.

"మీరు దెయ్యాల బంగళాలో వున్నారా? చాలా ఆశ్చర్యంగా వుందే!" శిరీష, రవినే చూస్తూ భయంగా అంది.

రవి పెర్సనాలిటీ శిరీషను ముగ్ధురాలని చేసింది.

"అబ్బాయిలూ! మీరు అమాయకుల్లా వున్నారు. ఆ దెయ్యాల కొంపలోంచి త్వరగా బయటపడండి. లేదా మీరు నలుగురూ చావును కొని తెచ్చుకొంటారు!"

జగన్నాథం హెచ్చరిస్తున్నవాడిలా అంటుంటే రవి గతుక్కుమన్నాడు.

మూర్తి చెప్పినట్లుగానే తాము ముగ్గురే వచ్చామని చెప్పారు. మరి ఈ ముసలాడు నలుగురంటున్నాడు... అంటే...ఇందులో ఏదో మిస్టరీ వుందన్నమాట.

రవికి ఇంకా అక్కడ వుండాలనిపించక "వెళతాం" అని అన్నాడు.

శిరీష అతనిమీద మక్కువ కొద్ది కాఫీ ఇచ్చి పంపింది.

ముగ్గురూ బయటపడ్డాక, రవి కొద్దిదూరం నడచి, రుమాలుకోసం జేబులో చెయ్యిపెట్టి "అరే! రుమాలు మర్చిపోయాను. ఇప్పుడే వస్తానుండండి" అని తిరిగి జగన్నాథం ఇంటికి బయలుదేరాడు.

ముందుగదిలో ఎవరూ కనిపించలేదు.

సోఫామీద మడత పెట్టిన రుమాలు కనిపించింది. దాన్ని తీసుకొని జేబులో పెట్టుకోబోతుండగా, జగన్నాథం గదిలోంచి నవ్వు వినిపించింది.

రవి మెల్లగా ఆ గది ముందుకొచ్చి 'కీ'హోల్ లోంచి లోపలకి చూసాడు.

జగన్నాథం, శ్రీనాథ్ ఒక టేప్ రికార్డర్ ముందు కూర్చొని వున్నారు.

రవి భృకుటి ముడిపడింది.

టేప్ రికార్డర్‌లోంచి ఏవేవో ధ్వనులు వినిపిస్తున్నాయి.

రవి రెండు క్షణాలు అలాగే విని ముందుగదిలోకి వచ్చాడు.

అప్పుడే శిరీష ఎదురుపడింది.

"హల్లో మళ్ళీ వచ్చారా?" అంది ఉత్సాహంగా రవిని చూస్తూ.

"నా కర్చీఫ్ మరచిపోయాను. తిరిగి తీసుకు వెళుతున్నాను."

"రవీ! ఈ వూరినుంచి వెళ్ళిపోవటం మంచిది."

"ఏం? ఎందుకూ?"

"ఆ దెయ్యాల బంగళాలో మీరు సమాధికావటం నా కిష్టంలేదు!"

"నాకూ నిన్ను వదలి వెళ్ళటానికి ఇష్టం కలగటం లేదు" రవి చిలిపిగా అన్నాడు.

శిరీష కళ్ళలో సన్నని మెరుపు కదలాడింది.

"ఈజిట్!" అంది.

"ప్రామిస్."

రవి చనువుగా ఆమె చేతిని అందుకొని, తన చేతిని వేసి సన్నగా నొక్కాడు.

శిరీష అతని చేతిని ముద్దు పెట్టుకోబోతున్నంతలో "చెల్లాయ్!" అని పిలిచాడు శ్రీనాథ్ లోపలనుంచి.

"రవీ! రేపు మధ్యాన్నం ఇంటికిరా!" శిరీష గబగబా చెప్పి, వెళ్ళిపోయింది.

# 6

ముగ్గురూ మాట్లాడుకొంటూ బంగళాకి చేరుకొన్నారు.

మూర్తి వంట రెడీగా వుంచాడు.

ముగ్గురూ రాగానే వడ్డన ప్రారంభించాడు.

గబ, గబా భోజనాలు చేసేసి, ఇల్లంతా సోదా చెయ్య ప్రారంభించారు నలుగురూ.

చాలా గదులకు తాళాలు వేసి వుంటే అవి పగలగొట్టి కూడా వెతికారు. కొన్ని గదుల్లో పుస్తకాలు, చెత్త, చెత్త సామానులు వున్నాయి. అంతా వెతికి, వెతికి విసిగి పోయారు.

"ఏ వీలునామా లేదు. అంతా నీ పిచ్చి" కిషోర్ చిరాగ్గా అన్నాడు.

"లేదు. వీలునామా ఇక్కడే... ఈ గదుల్లోనే..." మూర్తి ఏదో అనబోతుండగా కిటికీ దగ్గర ఏదో చప్పుడైంది. నలుగురూ పరుగున కిటికీ దగ్గరకి వచ్చేసరికి నల్లటి ముసుగు ఆకారం పరిగెడుతున్నది.

రవి జేబులోంచి రివాల్వర్ తీసి, ఆ ఆకారం కాలికి తగిలేలా షూట్ చేసాడు.

బుల్లెట్ ఆ ఆకారం కాలిలో దిగబడింది.

ఆ ఆకారం కాలు పట్టుకొని పరిగెట్టింది.

రవి బయటకి వచ్చి, ఆ ఆకారంకోసం వెతికాడు.

కిషోర్‌కు కనిపించిన ఆకారం ఎవరిది?

మూర్తి కల్సుకొన్న మనిషి ఎవరు? మూర్తికి అతను ఏమౌతాడు? రివాల్వర్‌తో కాల్చబడ్డ ఆకారం ఎవరిది?

ఆ ఆకారం దెయ్యం మాత్రం కాదు.

ఆత్మలకు రక్తంరాదు. మరి ఆ మనిషి ఎవరు?

ఒకదాని వెనుక ఒకటి ప్రశ్నలే కాని జవాబులు శూన్యం.

ఆఖరికి వుదయాన్నే మూర్తితో అతను కల్సుకొన్న వ్యక్తిని గురించి అడగాలని నిర్ణయించుకొని బలవంతాన కళ్లు మూసాడు.

## 7

మగతగా నిద్రపోబోతుండగా రివాల్వర్ పేలిన ధ్వని, ఆ వెంటనే మూర్తి వేసిన హృదయవిదారకమైన కేక, రవి నిద్రని చెదరగొట్టేసాయి.

టక్కన లేచి రివాల్వర్ అందుకొని తలుపులు తీసాడు.

అప్పుడే అతనికి వర్మా, కిషోర్ ఎదురుపడ్డారు.

ఎక్కడ అయితే రవి ఒక ఆకారాన్ని రివాల్వర్‌తో కాల్చాడో, అదే ప్రదేశంలో మూర్తి రక్తపు మడుగులో పడి కనిపించాడు.

ముగ్గురూ శిలా ప్రతిమల్లా నిలిచిపోయారు.

అరగంట క్రిందట తమతో మాట్లాడిన మూర్తిని అలా రక్తపు మడుగులో చూస్తూంటే, ముగ్గురికీ మతులు పోతున్నట్లు అయింది.

రవి వెర్రిగా మూర్తి శవాన్ని చూస్తున్నవాడల్లా అతని చేతి వ్రేళ్ళను చూస్తూ అలాగే చూపు నిలిపేసాడు.

అతను కుడిచేతి రెండు వ్రేళ్ళను, ఎడం చేతి రెండు వ్రేళ్ళను కలిపివుంచి మరణించాడు.

''కిషోర్! ఇది హత్య. మూర్తి పిచ్చిగా ఈ భవంతిలో దెయ్యాలు లేవని అన్నాడు. ఫలితం దెయ్యంచేత చంప బడ్డాడు. ఏది ఏమైనా పోలీస్ రిపోర్ట్ ఇవ్వాలి. నేను వెళ్ళి ఇనస్పెక్టర్‌ని తీసుకొస్తాను'' వర్మ రుమాలుతో కళ్ళు తుడుచుకొని, బయటకి నడిచాడు.

రవి, మూర్తిమీంచి చూపుల్ని గదుల వైపుకు పోనిచ్చాడు. వరుసగా వున్నాయి గదులు.

రెండూ + రెండు = నాలుగు.

అంటే మూర్తి వుద్దేశ్యం ఏమిటి? హంతకుడు అతన్ని రివాల్వర్‌తో కాల్చివేసి, నాలుగో గదిలోంచి పారి పోయాడా?

ఏ నాలుగో గది? ఎడమవైపుదా? కుడివైపుదా?

రవి, కిషోర్ ఎదురుగా పరిశోధన చెయ్యటానికి ఇష్ట పడ లేదు.

మూర్తి చావుతో అతను చాలా బెదిరిపోతున్నవాడిలా కనిపిస్తున్నాడు.

రవి మౌనంగా శవాన్ని చూస్తూ కూర్చున్నాడు. పావు గంటకి వర్మ, ఇన్‌స్పెక్టర్‌తో కలిసివచ్చాడు.

పోలీస్ డాక్టర్, ఫోటోగ్రాఫర్, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్స్ అంతా వచ్చి తమ తమ పనులు ముగించు కొంటున్నారు.

''మీరు ఈ బంగళాగురించి పూర్తిగా తెల్సుకోకుండా ఎందుకొచ్చారు?'' ఇనస్పెక్టర్ ముగ్గుర్నీ ప్రశ్నించాడు.

''మేము ఈవూరు పిక్నిక్ వేసుకున్నాం. ఇక్కడికి వచ్చాక దెయ్యాలున్నాయని తెలిసింది. మాలో యెవ్వ రికీ దెయ్యాలభయం లేకపోవటంతో ధైర్యంగా వున్నాం.

రేపు వెళ్ళిపోదామను కొంటుండగా ఈఘోరం. జరిగి పోయింది."

"ఇతనికి విరోధులు ఎవరయినా ఇక్కడ వున్నారా"

"లేరనే నా నమ్మకం!"

"ఇతను ఎలాంటివాడు?"

"మూర్తి పరిచయం నిండా రెండు నెలల క్రిందటే. మంచిహృదయం కలవాడు కావటంతో మాతో కలిసి పోయాడు. ఎవరికీ హాని చేసేవాడు కాదు" రవి బాధగా అన్నాడు.

"ఇన్స్పెక్టర్! మూర్తిని దెయ్యమే చంపిందంటారా" కిషోర్ భయంగా అడిగాడు.

"చూడండి మిస్టర్. ఈ ఇంట్లో జమీందారు, ఆయన కొడుకు, మనవడు వేటలో చనిపోయారు. జమీందారు కోడలు ఎవరితోనో పారిపోయింది. వారి యావదాస్తి ప్రస్తుతం మా అధీనంలోవుంది. జమీందారు కోడలు ఏమయింది తెలిసాక, ఆ ఆస్తిని జమీందారు బావమరిదికి ఇవ్వాలి. జమీందారుకు అతను తప్పించి మరెవ్వరూ లేరు. ఆ జమీందారు, ఆయన కొడుకు దెయ్యాలయినారని అంతా చెప్పుకుంటారు. మీరు వెంటనే యిక్కడనుంచి వెళ్ళిపొండి." ఇన్స్పెక్టర్ చెప్పి శవాన్ని మార్చురీకి పంపించేసి, వెళ్ళిపోయాడు.

"రవీ, మనం వెంటనే బయలుదేరుదాం!"

"ఎక్కడికి కిషోర్?"

"మన వూరికి."

"దెయ్యాలకి జడుస్తున్నారా?" వెటకారంగా అడిగాడు రవి.

"మనుషులకయితే జడవకపోదుం. కాని ఆత్మలతో ఆట మనకే ప్రమాదం! మూర్తి మరణంతో ఈ ఇంట్లో దెయ్యాలున్నాయని రుజువయిపోయింది. జీప్ లో అన్నీ సర్దేస్తాను. పోదాం పద! ఆ పీలునామాకో నమస్కారం!"

"సారీ కిషోర్! మూర్తి చావుకు కారకులైన వ్యక్తుల్ని వురికంబం ఎక్కించేదాక నేను ఈ ఇట్లోంచి కదలను."

"వాట్ నాన్సెన్స్ యువార్ టాకింగ్! దెయ్యాన్ని వురి త్రాడులో నిలబెడతావా? పిచ్చి మాటలాడక జీప్ ఎక్కు" వర్మ మందలింపుగా అన్నాడు.

"వర్మా! మూర్తిని చంపింది ఆత్మకాదు. మూర్తి వుంటే వాడి ప్రతిమాటకు కట్టుబడేవారు. మీరు నా మాటకు కట్టుబడరు. కనుక మీరు వెళ్ళిపోండి. నేను వుంటాను" రవి దృఢంగా అన్నాడు.

"నువ్వు ఒక్కడివి వుంటావా?"

"యస్!"

వర్మ, కిషోర్, రవిని వచ్చెయ్యమని యెంతగానో బ్రతిమిలాడారు.

కాని అతను తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

చేసేదిలేక ఇద్దరూ తమ సామానులు జీప్ లో పడేసుకుని, వెళ్ళిపోయారు.

రవి తలుపులుమూసేసి, తనగదిలోకి వెళ్ళిపోయి,పక్క మీద వాలిపోయాడు.

# 8

తెల్లవారాక లేచి, కాఫీ పెట్టుకుతాగి, డ్రెస్ చేసుకొని, ముందు పోలీస్ స్టేషన్ వెళ్ళాడు.

ఇన్ స్పెక్టర్ తో, మూర్తి తమతో చెప్పినదంతా చెప్పి, తాము వచ్చిన దగ్గరనుంచి జరిగిన ప్రతి సంఘటనను వివరించాడు.

అతను చెప్పినదంతా విని, చాలా ఆశ్చర్యాన్ని పొందాడు ఇన్ స్పెక్టర్.

"జగన్నాథమే మూర్తిని చంపాడంటారా?" అని ప్రశ్నించాడు ఆయన.

"నా అనుమానం అదే ఇన్ స్పెక్టర్!"

"మిస్టర్ రవీ! మీరు చెప్పినదంతా నిజమైతే జగన్నాథాన్ని పట్టేందుకు ప్రయత్నిస్తాను."

రవి ఆయనకి 'థేంక్స్' చెప్పి, శిరీష యింటికి బయలుదేరాడు.

జగన్నాథం, శ్రీనాథ్ ఇంట్లో లేరు.

రవిని చూడగానే శిరీష ముఖం వెలిగిపోయింది.

అతను సరాసరి జగన్నాథం గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు.

శిరీష అతని ప్రక్కనే కూర్చొని ఏకైకంగా అతన్నే చూస్తోంది.

"శిరీ! మీ ఇంట్లో టేప్ రికార్డర్ వుందా?" రవి ప్రేమగా ఆమె కురులను సవరిస్తూ అడిగాడు.

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది.

"మన ప్రేమగీతాన్ని టేప్ చేసుకొందామని!" రవి చిలిపిగా అన్నాడు.

అతని అల్లరి చూపులకు కరిగిపోయిందామె.

ఏవేవో తాళాలు వెతికి, ఎలాగో తండ్రి పెట్టె తెరచి, టేప్ రికార్డర్ బయటకితీసి, రవిచేతికి ఇచ్చింది.

అదే మొదటేమో తాగటం శిరీష తెలివితప్పినదానిలా మంచంపై వాలిపోయింది.

"రవీ! తొలిచూపులోనే నిన్ను లైక్ చేసాను. ఐ లవ్ యూ రవీ" అంటూ ముద్ద, ముద్దగా మాట్లాడ సాగింది శిరీష.

అతను ఆమెను అలాగే వదిలేసి, బయటకి వచ్చాడు.

వీధి గుమ్మంలోకి వచ్చేసరికి, జగన్నాథం యెదురు పడ్డాడు.

మనిషి తూలుతూ నడుస్తున్నాడు.

రవిని చూడగానే గతుక్కుమన్నాడు.

"నువ్వా? ఎందుకొచ్చావ్. మావూరు పోలేదా?" అని ప్రశ్నించాడు ఆందోళనగా.

రవి చిన్నగా నవ్వాడు.

"జగన్నాథం! అంత తొందరగా ఓటమిని అంగీక రించి పారిపోయే రకంకాదు ఈ రవి. నారాయణభూపతిని రమేష్‌చంద్రని హత్యచేసిన నిన్నూ, నీ కొడుకును ఉరి కంబం ఎక్కించి మరీ వెళతాను. అమాయకుడయిన మూర్తిని బలిగొన్న మీ ఇద్దర్నీ చట్టానికి అప్పగించి కదులుతాను!" రవి కసిగా అని చర, చరా వెళ్ళి పోయాడు.

జగన్నాథం ఏ స్థితిలో వుంటాడో వూహించుకుంటూ పోలీస్ స్టేషన్ కెళ్ళి ఆ టేప్ ఇనస్పెక్టర్‌కు అందించి, "ఈరాత్రికి నేను చంపబడవచ్చు!" అన్నాడు రవి.

"నో. మరో హత్యను జరగనివ్వను!" ఇన్‌స్పెక్టర్ దృఢంగా అన్నాడు.

రవి, ఆయనతో కొద్దిసేపు మాట్లాడి, ఆ తరువాత

చిన్న హోటల్‌లో భోజనం చేసి, సాయంత్రానికి బంగళాకి చేరుకున్నాడు.

## 9

వీధి తలుపులు దగ్గరగా చేరవేసి, పైకివెళ్ళి తన గది లోకి వెళ్ళాడు రవి. రివాల్వర్ తీసి జేబులో పెట్టుకొని మూర్తి చనిపోయిన స్థలం దగ్గరకు వచ్చాడు!

అక్కడున్న గదుల దగ్గరకి వెళ్ళాడు.

ఎడమవైపు నాలుగో గదిలోకి వెళ్ళాలా? కుడివైపు నాలుగో గదిలోకి వెళ్ళాలా? అనే సందిగ్ధంలో పడ్డాడు కాస్సేపు.

కుడివైపు నాలుగో గదిముందు నేలమీద చీమలుబాగా పట్టేశాయి.

రవి చీమల్ని ప్రక్కకితోసి చూసాడు.

రక్తపు మరక బాగా గడ్డకట్టివుంది.

అతనిలో వుత్సాహం వురకలు వేసింది.

ఆ రక్తం నిన్నరాత్రి తను రివాల్వర్‌తో కాల్చిన వ్యక్తిదని గ్రహించాడు అతను. ఆ గది తలుపులు తెరచి లోపలకి నడిచాడు.

ఆగది ముందు వాళ్ళు వెతికినదే!

దాని నిండా చెత్త సామానువుంది.

ఈసారి అతను నేలమీద పరచిన తివాసీని లాగి చూసాడు.

గదిలో ఒకప్రక్క నలుచదరపు పలక వున్నట్లు సన్నని గీతలా చుట్టూవుంది. రవి గోళ్ళతో ఆ పలకని లాగటానికి ప్రయత్నించాడు. కాని రాలేదు. అతను చుట్టూ చూశాడు.

ఒక బొక్కి టేబిల్ క్రింద ఒక ట్రాన్సిస్టర్ కన్పిం చింది.

రవి దాన్ని బయటకుతీసి, దాని వైర్ తీసే వుద్దేశంతో కవరు విప్పాడు.

అతను కవరు విప్పగానే అందులోంచి ఒక కవరు క్రింద పడింది.

రవి ఆ కవరుచింపి, అందులోంచి ఒక కాయితం, రెండు ఫోటోలు బయటకి తీసాడు.

ఆ కాయితం రాజేష్ చంద్రకు చెందవలసిన ఆస్తి వీలునామా!

రవి కళ్ళు వెలిగిపోయాయి.

ఆ కాయితంమీంచి దృష్టిని ఫోటోలమీదకు మరల్చాడు. ఆ ఫోటోలు చూడగానే అతనికి కళ్ళు తిరిగినట్లు అయింది.

రవిభార్య జయంతి, నారాయణభూపతి, రమేష్ చంద్రమూర్తి, మూర్తి అర్ధరాత్రి కలుసుకున్న వ్యక్తి, రవి ఇంట్లో అనాధ బాలుడుగావున్న రాజా వున్నారు ఆ ఫోటోలో. మరో ఫోటోలో జయంతి, రమేష్‌చంద్ర, రాజా వున్నారు.

ఆ ఫోటోలు చూడగానే రవికి జమీందారీ చరిత్ర మబ్బులా విడిపోయింది.

జయంతి యెవరో, మూర్తి యెవరో, రాజా యెవరో తెల్సిపోయింది.

అతను ఆ ఫోటోలని, కాయితాన్ని తిరిగి రేడియోలో పెట్టేసి, కవర్ మూసి, రేడియో వైర్ తో పలక ఎత్తాడు మెట్లు కనిపించాయి.

అతను రివాల్వర్ గట్టిగా పట్టుకొని, మెట్లుదిగి లోపలకు ప్రవేశించాడు.

చిన్న వెలుగురేఖలు ఎక్కడనుంచో లోపలకు పడుతున్నాయి.

అతను నాలుగడుగులు వేసి, స్థాణువు నా నిలచిపోయాడు.

జగన్నాథం, శ్రీనాథ్ నవ్వుతూ నిలచి ఉన్నారు ఎదురుగా.

శ్రీనాథ్ చేతిలో రివాల్వర్ మెరుస్తున్నది.

"రవీ! రివాల్వర్ క్రిందపడెయ్!" జగన్నాథం గర్జించాడు.

"పడెయ్యకపోతే" రవి నవ్వుతూనే అడిగాడు.

"నీ మొండితనం మాకు తెలుసు. నాన్నా వాళ్ళని తీసుకురా!" శ్రీనాథ్ తండ్రితో అన్నాడు.

జగన్నాథం ఓ వారకు వెళ్ళి జయంతిని, రాజాను తీసుకొచ్చాడు.

శ్రీనాథ్ జయంతికి రివాల్వర్ గురిపెట్టి "యిక పారేస్తావా?" అని అడిగాడు.

రవి తప్పనిసరిగా రివాల్వర్ క్రిందకు జారవిడిచి, "జయా! ఈ రాస్కెల్స్‌కి మీరెలా దొరికారు?" అని అడిగాడు కలవరంగా.

"నీ స్నేహితులు మూర్తి చనిపోయిన సంగతి జయంతితో చెప్పారు. పాపం అన్నచావు. నీకు ఎదురవబోయే మృత్యువును తలచుకొని, పిల్ల జమీందారుతో ఈ వూరిలోకి అడుగుపెట్టి, మా శ్రీనాథ్ కళ్ళబడి, మళ్ళీ మాకే దొరికింది. వైజయంతి, రాజేష్‌చంద్ర ఆరోజు చావు నుంచి తప్పించుకున్నారు. ఇప్పుడు వాళ్ళ జాతకాలు మా చేతుల్లో వున్నాయి. నువ్వు మర్యాదగా ఆ టేప్ ఇచ్చెయ్. అంతేకాదు, వీలునామాకూడా నీకు తెలిసే వుంటుంది. అదికూడా ఇచ్చేస్తే నీ భార్యను, రాజేష్ చంద్రను నీతో పంపిస్తాం!"

జగన్నాథం కొడుకు చేతిలో రివాల్వర్ అందుకొని

వైజయంతికి గురిపెట్టి, "వీలునామా ఇస్తావా? నీ భార్యను కాల్చిపారెయ్యనా" కర్కశంగా అన్నాడు.

"వద్దు. వైజయంతిని చంపవద్దు. వీలునామాఎక్కడ వుందో...." రవిమాటలు పూర్తికాకుండానే 'థాం' మని రివాల్వర్ ప్రేలింది.

జగన్నాథం, శ్రీనాథ్ భయంతో అలాగే నిలిచి పోయారు.

పోలీసులు బిలబిలమంటూ లోపలికి ప్రవేశించారు.

జగన్నాథానికి, శ్రీనాథ్‌కు బేడీలు పడ్డాయి.

"మీరెలా రాగలిగారు?" రవి ఆనందంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్‌ను.

"మొదటే చెప్పానుగా, మరోహత్య జరగనివ్వనని! మీరు ఈ బంగళాలోకి వచ్చిన దగ్గరనుంచి నేను నీడలా మిమ్మల్ని వెన్నంటే వున్నాను, మీరు నేను చెప్పినట్లు తలుపుతీసి వుంచడంతో లోపలికి రాగలిగాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"థాంక్యూ, ఇన్‌స్పెక్టర్! సమయానికివచ్చి మమ్మల్ని కాపాడారు!"

"మీకు నేను చెప్పుకోవాలి థాంక్స్, ఈ కేసును పట్టి ఇచ్చినందుకు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ.

# 10

ఆ గదిలో ఇనస్పెక్టర్, రవి, మూర్తి కల్సుకొన్న వృద్ధుడు శంభూ, జయంతి, రాజా, రవి మిత్రులు వున్నారు.

రవి గొంతు సవరించుకొని చెప్ప సాగాడు.

"జగన్నాథం, నారాయణభూపతి, రమేష్‌చంద్ర, రాజేష్‌చంద్ర వేటకు వెళ్ళినపుడు తన మనుషులను వారి

పైకి పంపాడు. అంతా దాడి మొదలెట్టటంతో రాజేష్ చంద్ర ఎలాగో తప్పించుకొని, అక్కడనుంచి పారి పోయాడు. దొరికిన ఆ ఇద్దర్నీ చంపించాడు జగన్నాథం. అయితే అంతకుముందే నారాయణభూపతి, జగన్నాథం పత్రను గ్రహించి, లాయర్ చేత వీలునామా వ్రాయించి దాచాడు. ఈ సంగతి తన కోడలయిన వైజయంతితో చెప్పాడు. వీలునామా వ్రాయించిన విషయం చెప్పాడే కానీ ఇంకేం చెప్పలేదు.

ఆ తరువాత ఆయన చనిపోయాడు. శంభూ కొడుకు మూర్తికి టెలిగ్రాం యిచ్చి రప్పించాడు. చెల్లెలికి కలిగిన కష్టానికి అతను ఎంతగానో కుమిలిపోయాడు. దానికి తోడు వైజయంతిపై నిందలు లేచాయి. ఆమె యెవరినో ప్రేమిస్తోందని జగన్నాథం పుకార్లు పుట్టించాడు. మూర్తి తండ్రిని చెల్లెల్ని తనతో వచ్చెయ్యమన్నాడు.

వైజయంతి ఆఖరుసారిగా కోవెలకి వెళ్ళింది. అక్కడే జగన్నాథం మనుషులు ఆమెను చంపబోతుండగా తప్పించుకొని పారిపోయింది. తర్వాత జయంతిగా నాకు పరిచయమైంది.

జయంతిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. అటు మూర్తి చెల్లెలికోసం వేట ప్రారంభిస్తుండగా, ఒక స్టేషన్‌లో రాజేష్‌చంద్ర కనిపించాడు. ఆ పత్రవాడి ద్వారా నారాయణభూపతి, రమేష్‌చంద్రలు ఏమైందీ తెల్సుకొన్నాడు. రజాను హాస్టల్‌లో వుంచాడు.

అనుకోకుండా రెండునెలల క్రిందట మూర్తి నాకు పరిచయమైనాడు. నేను మూర్తిని నా ఇంటికి తీసుకు వెళ్ళాను. నా ఇంట్లో, నాభార్యగా జయంతిని చూసాడు. ఆమెద్వారా వీలునామా గురించి తెల్సుకొన్నాడు. వీలు

నామా వ్రాసిన లాయర్ దురదృష్టవశాత్తు చనిపోవ టంతో, మూర్తి మమ్మల్ని హెల్ప్ కోరాడు. రాజేష్ చంద్రనుకూడా మూర్తి అనాథ బాలుడని చెప్పి తెలివిగా నా ఇంట చేర్చాడు.

ఆ తరువాత మేం నలుగురం ఇక్కడకి వచ్చాం. మూర్తి అర్థరాత్రి తన తండ్రి శంభూని కల్సుకున్నాను. అప్పటికి నాకు నిజం తెలియదు. కాని ఫోటోలు చూడ గానే నాభార్య జయంతి ఒకప్పుడు రమేష్‌చంద్ర భార్య అని, మూర్తి ఆమె అన్న అని, రాజా రాజేష్‌చంద్ర అని తెలుసుకున్నాను'' అని రవి చెప్పటం పూర్తి చేశాడు.

వైజయంతి కన్నీటితో ఏదో అనబోతుంటే, రవి ఆమెను, రాజేష్‌చంద్రను దగ్గరకు తీసుకుని, ''జయా! నీవు ఎప్పటికి నాదానివి. రాజా మన ఇద్దరికీ కొడుకే!'' అన్నాడు ప్రేమగా.

ఆ దృశ్యం చూస్తున్న శంభూ కన్నులవెంట ఆనంద బాష్పాలు రాలాయి.

—:ఐపోయింది:—

# మండూక బిలం!

## టి. యం. సత్యనారాయణరెడ్డి

చుట్టూ కొండలు. గడ్డి ఏపుగా పెరిగి వుంది. నరసంచారమే లేదు. ఎండ తీక్షణంగా కాస్తోంది.

ఆ ప్రదేశంలో నలుగురు వ్యక్తులు నడుస్తున్నారు. వారి మొఖాల్లో ఏదో సాధించాలని పట్టుదల కన్పిస్తోంది. పరిసరాలను పరికిస్తూ పోతున్నారు.

నలుగురూ తెల్లటి బిగువైన దుస్తులను ధరించారు. కళ్ళకు వెడల్పాటి గాగుల్స్, తలలకు హెల్మెట్స్, వారి నడుము చుట్టూ రకరకాల కత్తులు, పిస్తోళ్లు వున్నాయి.

ఒకని చేతిలో ఏదో 'మ్యాప్' వుంది. దాన్ని చూస్తూ ముందుకు పోతున్నాడు. అతన్ని అనుసరించసాగారు మిగతా ముగ్గురూ.

హఠాత్తుగా ముందర పోతున్న వ్యక్తి "ఫ్రెండ్స్" అని బిగ్గరగా పిలిచాడు. అతని ముఖంలో చెప్పలేని ఆనందం వెల్లి విరిసింది. ఉలిక్కిపడ్డారు వెనుకనున్న ముగ్గురూ.

"వాట్ హేపెండ్...ఏం జరిగింది" అంటూ అతని చుట్టూ మూగారు ముగ్గురూ.

"ఇష్...నిశ్శబ్దంగా ఉండండి. మనం నిల్చున్న చోటు క్రిందిభాగాన నీళ్ళు పారుతున్న చప్పుడును జాగ్రత్తగా వినండి" అన్నాడు.

"అవును రాజూ, నీవు చెప్పింది నిజమే! అయితే ఈ చుట్టు ప్రక్కలే ఏదో ఒక చోట, ఆ బిలం తప్పక కన్పిస్తుంది" అన్నాడు ప్రక్కనే నిల్చున్న శ్యామ్.

"ఏం! బిలమో! రెండు రోజులనుండి వెతుకుతున్నాం. ఇంతవరకు మొదటి మెట్టే ఎక్కలేదు" నిరుత్సాహంగా అన్నాడు వెంకట్.

"షటప్ యువర్ అగ్లీ మౌత్! ఒక కార్యానికి బయలుదేరిన తర్వాత, ఆ కార్యం దిగ్విజయంగా ముగిసేవరకు ఇలాంటి నిరుత్సాహపు మాటలు మానేయ్!" గర్జించాడు ఆ గుంపుకు లీడర్‌గా వ్యవహరిస్తున్న భూషణ్.

వెంకట్ సీరియస్‌గా ముఖంపెట్టి ప్రక్కనే వున్న రాళ్ళను ఎగిసి తన్నాడు.

"ఆల్ రైట్. నలుదిక్కులు జాగ్రత్తగా వెదకండి. ఆ బిలం కన్పించగానే అందరూ అక్కడికి చేరాలి. తొందరపడి సాహసించకండి" హెచ్చరించాడు భూషణ్.

నలుగురు చక, చక నలువైపుల ఉన్న పొదలకు తమ

డాగర్లతో నరుకుతూ బిలంకోసం వెదకసాగారు. ఒక చోట చాలా ఎత్తుగా పెరిగి వున్నాయి పొదలు. అయితే ఆ పొదలను ఎవరో తొక్కినట్లు కన్పిస్తోంది. అక్కడికి వెళ్ళి ఆ పొదను పరిశీలించాడు వెంకట్.

ఆశ్చర్యం! అక్కడ ఒక పెద్ద రాయి ఆ బిలంకు అడ్డంగా వుంది.

ఆనందంగా తమసంకేతంతో విజిల్ వేశాడు వెంకట్. క్షణంలో వెంకట్ ముందుకు వచ్చారు భూషణ్, శ్యామ్, రాజులు.

"అదిగో. మనం వెతుకుతున్న బిలం అదే! ఆ రాతిని తొలగిస్తే లోనికి దారి ఏర్పడుతుంది" అన్నాడు వెంకట్.

నలుగురూ కలిసి ఆ రాతిని ప్రక్కకు దొర్లించారు. చాలా లోతుగా వుంది ఆ బిలం. అడుగుభాగం కన్పించటం లేదు. ఎంత లోతుగా వుందో ఊహించలేకపోయారు. లోపలికి కొద్ది వరకూ బయటి వెలుగుపడినా, ఆ తర్వాత అంతా చీకటిగా కన్పిస్తోంది.

నలుగురు తమ చేతిలోని శక్తివంతమైన టార్చ్‌లను వెలిగించారు. ఆ బిలం అంతా వెలుతురుతో పట్టపగల్లా అయిపోయింది. అనుమానాస్పందంగా ఏమి కన్పించలేదు. ఎక్కడో నీళ్ళ సవ్వడి మాత్రం వినపడుతుంది.

"రాజూ! నీవు ముందు లోనికి దిగు. ఆ తర్వాత వెంకట్ దిగుతాడు" అన్నాడు భూషణ్.

పైనున్న రాతికి బలంగా రెండు తాళ్ళను కట్టి, బిలం లోకి వదిలారు. రాజు నడుముకు తాడు కట్టుకొన్నాడు.

"రాజూ. జాగ్రత్త! ప్రమాదసూచనలు కన్పిస్తే విజిల్ వెయ్యి" హెచ్చరించాడు భూషణ్.

రాజు తల ఊపి ఉత్సాహంగా లోనికి దిగిపోయాడు. చూస్తూండగానే కన్పించకుండా పోయాడు.

## 2

రాజు త్రాటిద్వారా లోపలికి దిగిపోయాడు.

బలంగా ఊపిరి పీల్చుకొని చుట్టూ చూశాడు. ఆ ప్రాంతమంతా జానపద సినిమాల్లో చూపించే మాంత్రికుని గుహలా వుంది. ఆ గుహలో కాటుకలాంటి చీకటి వ్యాపించి వుంది.

చుట్టూ చాలా భయంకరంగా వుంది గుహ. అటూ, ఇటూ విషసర్పాలు, కీటకాలు పారాడుతున్నాయి. సాలె గూళ్ళతో నిండి ఉంది. భరించరాని దుర్గంధం.

అలాగే కొద్దిదూరం నడిచాడు.

అక్కడ మరో బిలం కన్పించింది. దానిలోనికి దిగాడు. ఒకచోట నీళ్ళు మడుగులా నిలిచి వున్నాయి. అక్కడ నుండి గలగల పారుతూ పోతున్నాయి నీళ్ళు.

హఠాత్తుగా రాజు భుజంపై ఎవరిదో చెయ్యి పడింది. కెవ్వున కేక వెయ్యబోయాడు. వెంటనే ఓ చెయ్యి నోరు మూసింది.

"ఇష్. అరవకు ... నేను... వెంకట్‌ను" అన్నాడు అప్పుడే అక్కడి చేరుకున్న వెంకట్. బలంగా ఊపిరి వదిలాడు రాజు.

"అదిరిపోయాను...! ఇక్కడివరకు వచ్చాం. ఇక దారి లేదు. ఎలా!" ప్రశ్నించాడు రాజు.

"ఎలా అంటే నేనేం చేసేది! భూషణ్ ఆజ్ఞ. పాతాళం లోనికి అయినా వెళ్ళాలి" అన్నాడు.

"అందుకే మనం ఈ నీటి మడుగులోనికి వెళ్దాం. అదే దారి కన్పిస్తోంది" నవ్వుతూ అన్నాడు వెంకట్.

ఒకచోట దుర్గంధమైన వాసన వేస్తోంది. ఇరువురు అటువైపు సాగారు.

అక్కడ రకరకాల జంతువుల కళేబరాలు, అస్థి పంజరాలు పడివున్నాయి. ఆ దృశ్యంచూసి ఆశ్చర్య పోయాడు వెంకట్. ఆ గుహను ఫోటో తియ్యబోయాడు.

అంతే! అదిరిపోయాడు వెంకట్.

దాదాపు పది అడుగుల ఎత్తున్న ఒక భయంకరమైన ఆకారం రక్తంతో తడిసిన ముఖంతో కమేరా లెన్సులో కనిపించింది.

చటుక్కున తల ఎత్తాడు. వికృతంగా నిలబడివుంది ఆ ఆకారం. ఆటోమేటిక్‌గా రెండు స్నాప్స్ తీసేశాడు.

"గ్రా(...ంగ్" మంటూ తన బలమైన చేతిని వెంకట్ పైకి విసిరింది ఆ ఆకారం. వాలీబాల్‌లా ఎగిరి పదడుగుల దూరంలో పడిపోయాడు వెంకట్.

దూరంగా ఫోటోలు తీస్తున్న రాజు ఆ దృశ్యంచూసి రివాల్వర్ తీసాడు. ఒక్క ఎగురులో రాజును చేరుకుంది ఆ ఆకారం.

గబుక్కున రాజును అవలీలగా ఎత్తుకొని పుల్లని విరిచి నట్టు రాజును రెండుగా విరిచివేసింది. "ఫట్ ... ఫట్" మన్నాయి ఎముకలు. చివ్వున చిమ్మింది రక్తం. రక్తంలో తడిసిన ఆ ఆకారం ఇంకా భయంకరంగా కన్పడుతుంది.

క్రిందపడిన వెంకట్ పైకిలేచి, చటుక్కున రివాల్వర్ గురిపెట్టి "ఢాం" మని కాల్చాడు. గురి తప్పింది కంగా రులో. చేతిలోవున్న రాజు మృతకళేబరాన్ని వెంకట్ పైకి విసిరింది ఆ ఆకారం.

ఊహించని సంఘటనకు వెల్లకిలా పడిపోయాడు వెంకట్. రివ్వునదూసుకువచ్చి వెంకట్ రెండుకాళ్ళను

పట్టుకొని గిరగిర త్రిప్పి విసిరికొట్టింది ఆ ఆకారం. పైనున్న కప్పుకు కొట్టుకుని క్రింద పడిపోయాడు వెంకట్.

సరిగా అదే సమయంలో బిలంలోకి అడుగు పెట్టారు శ్యామ్, భూషణ్ లు. వారికి ముందుగా కన్పించింది వెంకట్. రక్తం ముద్దగా మారిన వెంకట్ నుచూసి, కంగారు పడ్డారు శ్యామ్, భూషణ్ లు.

"వెంకట్ ఏం జరిగింది? రాజు ఏమయ్యాడు?" ప్రశ్నలవర్షం కురిపించారు ఇరువురు.

వెంకట్ తనచేతిలోని మినీ కెమెరాను భూషణ్ చేతిలో పెట్టి ప్రక్కకిచూపుతూ తల వాల్చేశాడు.

"మైగాడ్!—చనిపోయాడు...రాజు ఏమయ్యాడో?" అంటూ శ్యామ్ ప్రక్కకు తిరిగిచూశాడు.

వారికి కొద్దిదూరంలో భయంకరంగా...అతి భయంకరంగా కన్పించింది రాజుశవం!

అప్రయత్నంగా ఇరువురూ రివాల్వర్స్ తీశారు.

"శ్యామ్!, జాగ్రత్త...ఏదో ప్రమాదం జరిగింది" అన్నాడు భూషణ్.

ప్రతి అంగుళం పరీక్షగా చూడసాగారు.

ఒక్కొక్క అడుగువేస్తూ లోపలకు చొచ్చుకొన్న గుహ చెంతకు వెళ్ళాడు శ్యామ్. అనుమానాస్పదంగా ఏమీ కన్పించలేదు. చటుక్కున వెనుతిరిగాడు—అంతే!

లోపల నక్కివున్న భయంకరాకారం వెనుకపాటుగా శ్యామ్ పైకిదూకి, రెండుచేతులతో గట్టిగా పట్టుకొని పైకి ఎత్తివేసింది.

హృదయ విదారకంగా అరిచాడు శ్యామ్.

"ధన్, ధన్, ధన్" మంది భూషణ్ చేతిలోని

రివాల్వర్. మూడు బుల్లెట్స్ ఆ ఆకారం కాళ్ళకి తగిలాయి.

"గ్రాంగ్. గ్రాంగ్" మంటూ అరుస్తూ చేతులతో శ్యామ్‌ను భూషణ్ పైకి విసిరింది. భూషణ్ చేతిలోనున్న రివాల్వర్ శ్యామ్ తాకిడికి దూరంగా పడిపోయింది. క్రింద పడిన శ్యామ్ వెర్రివాడిలా కేకలు వేస్తున్నాడు.

చటుక్కున బొడ్లోనుండి డాగర్ తీశాడు భూషణ్ రివ్వున విసిరాడు ఆ ఆకారంపైకి. సూటిగా వెళ్ళి దాని భుజంలో పిడివరకు దిగబడిపోయింది డాగర్.

భయంకరంగా అరుస్తూ మడుగులోకి దూకి పారి పోయింది ఆ ఆకారం.

భూషణ్ వెంటాడబోయాడు. కాని శ్యామ్ వున్న పరిస్థితిలో అతన్ని ఒంటరిగా విడిచి వెళ్ళడం ఇష్టంలేక, శ్యామ్‌ను భుజంపైకి ఎత్తుకొన్నాడు.

అతి ప్రయాసతో పైనున్న తాళ్ళలో ఆ బిలం వెలుప లికి వచ్చేశాడు.

ఆ బిలంకు యధాప్రకారంగా రాతిని అడ్డు దొర్లించి, శ్యామ్‌ను భుజంపైకి ఎత్తుకొని గబ, గబ అడుగులు వేస్తూ ముందుకు పోతున్నాడు. శ్యామ్ స్పృహతప్పిపోయాడు.

భూషణ్ కళ్ళు గిర్రున తిరిగి పోతున్నాయి. అతని హృదయం వేగంగా కొట్టుకొంటుంది. ఆ ఆకారం ఇంకా కళ్ళముంగు ఉన్నట్లే ఫీలవుతున్నాడు. ఇలా జరుగుతుం దని కలలోనైనా ఊహించలేదు భూషణ్.

సుమారు పది అడుగుల ఎత్తు. బలిష్టమైన శరీరంతో ఒళ్ళంతా వెంట్రుకలు, జడలుగా వ్యాపించి ఉంది—ఆ ఆకారం! దాని తలమాత్రం చాలా విచిత్రంగా వుంది. అది ఒక కప్పతలనుపోలి వుంది. పెద్ద కండ్లు అగ్ని

గోళాల్లా మెరుస్తున్నాయి. పారల్లాంటి పండ్లు. నోటి నుండి జిగురులాంటి ద్రవం కారుతూ చాలా అసహ్యంగా వుంది. ముఖమంతా రక్తం చింది చాలా భయంకరంగా కన్పిస్తోంది.

ఆ ఆకారాన్ని తలచుకొంటేనే ఒళ్ళు జలదరించింది భూషణ్ కు.

ఆకలి దహించుక పోతుంది భూషణ్ కు. కనుచూపు మేరలో రోడ్డు కన్పించింది. ఆ వైపు వేగంగా అడుగులు వేసి_రోడ్డు పైకి చేరుకొన్నాడు.

భుజం పైనున్న బ్యాగ్ ను క్రిందికి దించి, ఏదైనా వాహనం వస్తుందేమోనని చూడసాగాడు. ఎంత సేపటికి ఆ వైపు నుండి ఏ వాహనమూ రాలేదు.

ఎండ తీక్షణంగా కాస్తోంది. కళ్ళు గిర్రున తిరిగిపోతున్నాయి. దాహంతో నాలుక పిడుచకట్టుకుపోతుంది.

అంతలో దూరంనుండి ఏదో కారురావడం చూశాడు. అలాగే రోడ్డుకు అడ్డంపడి స్పృహతప్పి పోయాడు భూషణ్. వేగంగా దూసుకొని వచ్చి సడన్ బ్రేకుతో భూషణ్ ముందు ఆగింది కారు.

# 3

మెల్లగా కళ్ళు తెరిచాడు భూషణ్.

ఎదురుగా ఒక అందమైన యువతి నిలబడి వుంది. ఆమెకు దాదాపు 28 ఏండ్లు వుండవచ్చు. చటుక్కునలేచి కూర్చున్నాడు భూషణ్, ఆ యువతి వైపు చూస్తూ—

"మీరెవరో తెలుసుకోవచ్చా" అన్నాడు భూషణ్.

"నా పేరు సాధన. నేను జువాలజి సైంటిస్టును" అంది ఆ యువతి అందంగా నవ్వుతూ.

దాని సంబంధమైన ప్లాన్ నాకు దొరికింది. ఆ ప్లాన్ సహాయంతో నిధి ఆచూకీ తియ్యడానికి మేం నలుగురం బయలుదేరాం. చివరకు మా శ్రమ ఫలించింది. నిధి ఉండే ఆ 'మండూకబిలం' కన్పించింది.

కానీ ఆ బిలం మా పాలిట మృత్యు మందిరం అనుకో లేదు. ఆ బిలంలో మేము ఇంతవరకూ ఎవరూ చూడని ఒక విచిత్రమైన మనిషిలాంటి జంతువును చూశాము. దాని తల కప్పతలను పోలి వుంది. బహుశా ఆ జంతువు ఆ బిలంను తన నివాసంగా ఏర్పరచుకొందేమో!

ఆ జంతువే నా ఇరువురి మిత్రులను చంపేసింది. ఇంక మూడోవాడు నా మిత్రుడు శ్యామ్ ఇలా పిచ్చివా డయ్యాడు. ఇంత ప్రయాసపడి మేము ఏమీ సాధించలేక పోయాము'' భూషణ్ గొంతు జీరపోయింది.

''బాధపడకు మిస్టర్ భూషణ్! ఆఁ. నీవేదో జంతువును చూశానని చెప్పావే! అది ఎలా వుంటుందో చెప్ప గలవా?'' ఆసక్తిగా అడిగింది సైంటిస్ట్ సాధన.

''నేను చెప్పడం దేనికి! నేను నా మిత్రులం కలిసి దాన్ని ఫోటోలుకూడా తీశాం. ఆ మినీ కెమరా నా దగ్గరే వుంది!'' అన్నాడు భూషణ్.

''వెల్ డన్ భూషణ్! వాటిని వెంటనే ప్రింట్ తియ్యాలి. నేనుకూడా చూస్తాను. అదిగో అక్కడ బ్లాక్ రూం వుంది. అంతవరకు నేనలా బయటికి వెళ్ళొస్తాను'' అంటూ వెళ్ళింది సాధన.

సాధన వెళ్ళినవైపు అలాగే చూస్తుండిపోయాడు భూషణ్. ''ఎంత అందమైనది'' మనసులోనే అనుకొని చిన్నగా నవ్వుకొన్నాడు.

భూషణ్ అందించిన ఫోటోలను పరిశీలించింది సాధన.

"వండర్ మిస్టర్ భూషణ్. నేను ఇలాంటి జంతువుల కోరకే పరిశోధనలు చేస్తున్నాను. విచిత్రంగా ఈ వింత మృగం బయటపడింది." ఆనందంతో ఒళ్ళు మరచి భూషణ్‌ను కౌగలించుకొంది సాధన.

"థ్యాంక్స్" అన్నాడు భూషణ్ సాధనను ఇంకా గట్టిగా హత్తుకొంటూ.

సాధన, భూషణ్ కౌగిలినుండి విడిపోయింది సిగ్గు పడుతూ.

"మిష్టర్ భూషణ్! ఆ జంతువును ఎలాగైనా బంధించాలి. దాన్ని నా లాబరేటరీలో వుంచి దాని మెదడును వాష్ చేసి, ప్రయోగాలు చేస్తాను. అదే నా ఆశయం! అందుకు నీ తోడ్పాటుకూడా కావాలి."

"వాట్! ఆ జంతువును బంధించాలా! అది సాధ్యం కాదు. ఒకవేళ అది నా కంట పడినా వెంటనే దాని అంతం చూస్తాను, నా మిత్రుల ఆత్మ శాంతికోసం!" ఆవేశంగా పలికాడు భూషణ్.

ఒక్క క్షణం భూషణ్‌ను తీక్షణంగా చూసింది సాధన.

"ఎలా సాధ్యంకాదో నేనూ చూస్తాను. రేపే ఈ ఫోటోలను పేపర్లో వేయిస్తాను. ఆ తర్వాత ప్రభుత్వ సహాయంతో దాన్ని బంధించి, నా లాబ్ లోనికే రప్పిస్తాను" గర్వంగా అంది సాధన.

"వద్దు సాధన! నామాట విను. ఆ జంతువు చాలా ప్రమాదకరమైనది. దాన్ని గురించి ఆలోచించడం మానేయి. కోరి ప్రమాదంలో చిక్కుకోకు! నీ

శ్రేయోభిలాషిగా చెప్తున్నాను" అన్నాడు సాధన అందాలను చూస్తూ భూషణ్.

"భూషణ్! నిన్ను ఎంతో సాహసవంతుడిగా తలంచాను. కానీ నీలో ఇంత పిరికితనం ఉందని ఊహించలేదు. ఇక నా గురించి ఆలోచించడం మానెయ్యి. ఆ వింత మృగాన్ని బంధించి, నా ఆశయం నెరవేర్చుకొంటాను" గంభీరంగా పలికింది సాధన.

భూషణ్ గట్టిగా నిట్టూర్చి బయటకు వెళ్ళిపోయాడు.

# 5

మరునాడు పేపర్లలో పెద్ద పెద్ద అక్షరాలతో 'వింత మృగం' అన్న శీర్షికలో ఫోటోలతో సహా ప్రచురించారు.

"సైంటిస్ట్ సాధన వింతమృగాన్ని బంధించబోతున్నది' అని వ్రాశారు. ఆ కార్యక్రమానికి సాధనకు సహాయంగా C.R.P లను, కొంత పోలీసు సిబ్బందిని ప్రభుత్వము పంపింది.

ఆ రోజు—

ఆ వింత మృగాన్ని చూడటానికి వేలకొలది ప్రజలు, న్యూస్‌రీల్ కెమరామ్యాన్స్, పత్రికా విలేఖర్లు ఉత్సాహంగా ఆ బిలం చెంతకు చేరారు. ప్రజలను అదుపులో పెట్టడానికి పోలీసులు సతమతమవుతున్నారు. ఆ గుంపును చూసి ఆ ప్రాంతంలో చిన్న చిన్న టీదుకాణాలు, కిళ్ళీ బంకులుకూడా తెరిచారు వ్యాపారస్తులు. ఆ ప్రదేశం ఒక జాతరలా తయారయింది.

అక్కడున్న పొదలను పోలీసులు ముందే నరికివేశారు.

ఆ కొండ ప్రాంతమంతా మనుష్యులతో కిక్కిరిసి వుంది.

పోలీసు చీఫ్ కమీషనర్ శశికాంత్ చెంత సైంటిస్ట్ సాధన, భూషణ్, పోలీసు అధికారులు వున్నారు.

పోలీసు చీఫ్‌కమీషనర్ ఆదేశంతో బిలంకు అడ్డుగానున్న రాతిని తొలగించారు. కానీ ఒక్కరుకూడా లోనికి దిగడానికి సాహసించలేకపోయారు.

బయట నుండి పెద్ద ఢంకాలను మ్రోగిస్తూ...అనేక రకాల వాయిద్యాలతో చెవులు చిల్లులు పడేటట్లు శబ్దం చేయసాగారు.

రాబోవు వింతమృగం కోసం ఆతృతగా ఎదురుచూడసాగారు ప్రజలు. కానీ ఎంతసేపటికి ఆ వింత మృగం బయటికి రాలేదు.

"హేండ్ బాంబ్స్ విసరండి," అని ఆజ్ఞాపించాడు కమీషనర్ శశికాంత్.

అంతే! బిలం పైకి ఒకదాని వెనుక ఒకటి హేండ్ బాంబ్స్ పడసాగాయి.

"ఢాం... ఢాం" మంటూ అదిరిపోయింది బిలం. కాస్త పెద్దదయింది రంధ్రం. కాసేపు చూశారు. మళ్ళీ వరుసగా బాంబ్స్ కురిపించారు. దాంతో బిలం పెద్ద సొరంగంలా తయారయింది.

హఠాత్తుగా ఆ బిలంనుండి "గుర్...గుర్" మంటూ శబ్దం విన్పించసాగింది.

అందరూ నిశ్శబ్దంగా నిలబడిపోయారు. పోలీసు బృందం తమ గన్స్‌ను ఆ బిలంకేసి గురిపెట్టారు.

సైంటిస్ట్ సాధన, భూషణ్, శశికాంత్‌లు ఆత్రంగా ఆ బిలంకేస్సి చూడసాగారు.

ఐదు నిముషాలు గడిచిపోయాయి.

హఠాత్తుగా ప్రజల్లో హాహాకారాలు చెలరేగాయి. ప్రజలు భయంతో చెల్లా చెదరుగా పారిపోసాగారు. సాధన బిలం కేసి కళ్ళార్పకుండా చూడసాగింది.

ఒక్కసారిగా బిలం వెలుపలికి వచ్చి నిలిచింది ఆ వింత మృగం! ఆ మృగం భీకర, వికృతరూపం చూసి పోలీసు ఆఫీసర్స్‌తో సహా గడ, గడ వణికిపోసాగారు.

ఆ వింతమృగం నిల్చున్న జనం కేసిచూస్తూ "గ్రాంగ్" మంటూ భూమి దద్దరిల్లేటట్లు అరిచింది.

సాధన ఆ మృగంను సూటిగా చూసింది. ఆమె కళ్ళు వింత కాంతితో మెరిశాయి.

"క్లిక్. క్లిక్" మన్నాయి కెమరాలు. ప్రెస్ రిపోర్టర్స్ గబగబ ఫోటోలు తీస్తున్నారు. ఒక న్యూస్ రీల్ ఫోటోగ్రాఫర్, చకచక రీలును త్రిప్పసాగాడు.

ఆ వింతమృగం "గ్రాం...గ్" మంటూ అరుస్తూ ప్రక్కనేవున్న పెద్ద రాతిని చేతుల పైకి ఎత్తింది.

అంతే!..."ధభీ" మని ఆ రాయిని ఫోటోగ్రాఫర్ పైకి విసిరింది. తల పచ్చడై ప్రాణాలను వదిలాడు పాపం ఆ ఫోటోగ్రాఫర్.

ఆ సంఘటనను చూసిన శశికాంత్ ఆవేశంతో "ఫైర్" అని గర్జించాడు. "చక్...చక్" మంటూ ఒక్కసారిగా పైకి లేచాయి వంద తుపాకులు.

"ఆపండి. దాన్ని కాల్చడానికి నేను ఒప్పుకోను. దయచేసి ఒక్క నిముషం ఆగండి. దానివలన ఇక ఒక్క మనిషికి ప్రమాదం జరిగినా దానికి పూర్తిగా నేనే బాధ్యత వహిస్తాను" అంది సాధన.

"మిస్ సాధన! మీకు పిచ్చిపట్టిందనుకొంటాను.

ఇటువంటి క్రూరమృగాన్ని విచ్చలవిడిగా విడిచి పెడితే అందరిని సర్వనాశనం చేస్తుంది'' అన్నాడు శశికాంత్.

అతని మాటలకు జవాబివ్వకుండా, ఒక విచిత్రమైన తుపాకిని చేతిలోకి తీసుకొని ఆ వింతమృగంకేసి అడుగులు వేయసాగింది సాధన.

''సాధన. స్టాపిట్. స్టాపిట్ ప్లీజ్'' అంటూ కేకలు వేశాడు వెనుక నుండి శశికాంత్.

సాధన గబ, గబ అడుగులు వేస్తూ వెళ్ళి ఆ మృగానికి కొద్దిదూరంలో వెళ్ళి నిలబడింది. ఆ వింతమృగం సాధన కేసి విచిత్రంగా చూడసాగింది. శశికాంత్ మొదలగు వారు ఊపిరి బిగపట్టి చూడసాగారు. అంతలో సాధన పైకి దూకబోయింది ఆ మృగం.

చటుక్కున తుపాకి గురిపెట్టి కాల్చింది సాధన.

''తు...స్'' మంటూ శబ్దంచేస్తూ ఆ తుపాకినుండి ఒక బాణం లాంటిది వెలువడి సూటిగా ఆ వింతమృగం చెవి క్రింది భాగాన తగిలింది.

''గ్రాంగ్'' మంటూ అరుస్తూ ఆ జంతువు తల విదిలించి అలాగే నేలకు ఒరిగిపోతూ స్పృహ తప్పింది. సాధన సాహసానికి ఆశ్చర్యపోతూ సాధన చెంతకు వచ్చాడు శశికాంత్.

''సార్! ఈ జంతువు మూడు గంటలవరకు స్పృహాలో వుండదు. అంతలోగా దీనిని నా లాబ్ లోనికి చేర్చాలి'' అంది.

వెంటనే బలమైన గొలుసులతో ఆ వింత మృగాన్ని బంధించి, ఓ ట్రక్ పైభాగానికి కట్టేసి, సాధన భవనం కేసి తీసుకొని వెళ్లారు.

# 6

ఆ గదిలో అనేక రకాల గాజు ప్రాతలు, గొట్టాలు ఉన్నాయి. గాజు పాత్రలలో రకరకాల రసాయనిక ద్రవాలు నిండి ఉన్నాయి.

ల్యాబ్‌లో కట్టి పడేసిన ఆ వింత మృగం కళ్ళు తెరచింది. దాని మెడ చుట్టూ బ్యాండేజ్ కట్టబడి వుంది. ఒక్కసారిగా పైకిలేవడానికి అటూ ఇటూ గింజుకో సాగింది.

"ఫ్రా...గ్" ఉరుములా గర్జించింది సాధన.

ఆ వింతమృగం సాధనవైపు వింతగా చూసింది.

దానివద్దకు నిర్భయంగా వెళ్ళి దాని కళ్ళలోకి చూడ సాగింది సాధన. ఆ మృగం కనురెప్పలార్పకుండా సాధన కళ్ళలోకి చూసింది. అంతే! — పిల్లిలా కొద్దిసేపు కళ్ళు మూసుకొంది ఆ మృగం.

"ఫ్రా...గ్!" మృదువుగా పిలిచింది సాధన.

చటుక్కున కళ్ళు తెరిచింది ఆ మృగం. దాని తలపై చెయ్యివేసి ప్రేమగా నిమరసాగింది సాధన. విచిత్రంగా సాధనను చూడసాగింది ఆ మృగం.

అంతలో లోనికి ప్రవేశించాడు భూషణ్.

"మిస్టర్ భూషణ్! ఇది నా హిప్నాటిజమ్‌కు లొంగింది. ఈ జంతువును త్వరలో సాధుజంతువుగా మార్చుతాను. దీనివలన నాకు ఎటువంటి ప్రమాదం లేదు ఇప్పుడు" ఆనందంగా అంది సాధన, భూషణ్‌తో.

"నేను దీన్ని ఈ క్షణమే నాశనం చేయడానికి వచ్చాను. నా మిత్రులను చంపిన దీన్ని నామరూపాలు లేకుండా నాశనం చేస్తాను" అంటూ జేబులోంచి

రివాల్వర్ తీసి ఆ మృగానికేసి గురిపెట్టాడు భూషణ్ కసిగా.

"ఢన్" మంది భూషణ్ చేతిలోని రివాల్వర్.

గుండు సూటిగా వెళ్ళి ఆ మృగం కాలుకు తగిలింది. "గ్రాంగ్" మంటూ అరుస్తూ లేవబోయింది ఆ మృగం. గుండుసూది గ్రుచ్చుకొన్నట్లు గ్రుచ్చుకొంది బుల్లెట్.

"భూషణ్!...నీ రివాల్వర్‌లోని గుండ్లు దీన్ని ఏమీ చేయలేవు. మర్యాదగా బయటకు వెళ్ళు! ఇది నా స్వంత లేబరేటరీ అని మరచిపోతున్నావ్. దీనిపైన ఈగ వాలినా ఇక నేను సహించను!" గర్జించింది సాధన.

"ఆల్ రైట్. సాధన! ఇప్పుడు కాకున్నా, ఎప్పుడో ఒకసారి దీని అంతం చూడకుండా నిద్రపోను. గుర్తుంచుకో!" రుస రుసలాడుతూ విసుగుగా బయటికి వెళ్ళి పోయాడు.

సాధన ఏదో ఇంజక్షన్ ఎక్కించింది ఆ మృగానికి. చిన్న ఆపరేషన్ చేసి భూషణ్ పేల్చిన తూటాను తీసి వేసింది. మగతగా కళ్ళు మూసుకొంది ఆ మృగం.

"మైడియర్ ఫ్రాగ్. గుడ్ నైట్!" చిరునవ్వుతో దాని తల నిమిరి బయటకు అడుగులు వేసింది, సైంటిస్ట్ సాధన.

## 7

సైంటిస్ట్ సాధన వింత మృగాన్ని చాలా జాగ్రత్తగా చూడసాగింది. దాన్ని పిలువడానికి వీలుగా ఫ్రాగ్ అని పేరు పెట్టింది. ఫ్రాగ్‌ను ఇనుపకమ్ములతో తయారు చేసిన విశాలమైన బోనులో పెట్టింది.

ఆ బోను కమ్ములకు, ఫ్రాగ్ కాళ్ళకు పెద్దసైజు ఇనుప సంకెళ్ళు వేసింది. ఆ బోనులో స్వేచ్ఛగా తిరుగాడ సాగింది ఫ్రాగ్. ఆ బోనుకు ముందుభాగాన ఫ్రాగ్ కు కావలసిన పరికరాలను, తన ల్యాబరేటరీని అమర్చుకొంది.

తన ఇంటికి ల్యాబరేటరికి కలిపి చుట్టూ కంచె వుంది. ఆ కంచెలో రాత్రి సమయంలో విద్యుత్ ప్రసరిస్తూ ఉంటుంది. అంతేకాదు, ఇరువురు వ్యాచ్ మెన్లు కాపల ఉంటారు. వాళ్ళు ఆ కాంపౌండు అంతా తిరుగుతూ కాపలాకాస్తూ ఉంటారు. ఈ విధంగా సాధన ఫ్రాగ్ కు రక్షక ఏర్పాట్లు కట్టుదిట్టంగా చేసింది.

సైంటిస్ట్ సాధన, తన అసిస్టెంట్లతో ఫ్రాగ్ చెంతకు వెళ్ళింది. బోనులో అటూ, ఇటూ తిరుగాడసాగింది ఫ్రాగ్.

"ఫ్రా...గ్!" గట్టిగా అరిచింది సాధన.

ఫ్రాగ్ గబగబ సాధన ఉన్న వైపు వచ్చింది. దాని కళ్ళలోకి సూటిగా చూసింది సాధన. ఫ్రాగ్ కళ్ళు నులుపుకొంది.

"రాణి!... ఆ తొట్లో ఉన్న ఒక తొండను అందుకో!" అంది సాధన, తన అసిస్టెంట్ల వైపు తిరిగి.

పట్టుకారుతో తొట్లోని తొండను పట్టుకొని వచ్చి సాధనకు అందించింది రాణి.

సాధన బోనులో ఉన్న ఫ్రాగ్ కు ఆ తొండను అందించింది. గబుక్కున ఆ తొండను అందుకొని నోట్లో వేసుకొంది ఫ్రాగ్.

తరువాత ఒక చిన్న పామునుకూడా అందించింది సాధన.

దాన్నికూడా అవలీలగా మ్రింగివేసింది ఫ్రాగ్.

అలాగే బల్లులను, పాములను, చిన్న చిన్న ఉడుము పిల్లలను, చేపలను వరుసగా ఆహారంగా వేయసాగింది. ఒక్కొక్క దాన్ని వేరుశనక్కాయలు నమిలినట్లు అవలీలగా తినసాగింది ఫ్రాగ్.

చివరకు ఒక పెద్దసైజు కప్పను తీసి దానిముందుకు వేసింది సాధన.

బోనులో పెద్ద కప్ప అటూ ఇటూ గెంతసాగింది.

ఫ్రాగ్ గబుక్కున ఆ కప్పను అందుకొని నోటిదగ్గర పెట్టుకోబోయి, దానిని చూస్తూనే బయటకు విసిరివేసింది. ఆశ్చర్యంగా చూసింది సాధన.

"ఆశ్చర్యంగా ఉందే? అన్ని జీవాలను తినింది, కాని కప్పనుమాత్రం తినడంలేదు." అంది అసిస్టెంట్ రాణి.

"అవును కప్పజాతికి చెందినదే ఈ ఫ్రాగ్ కూడా. అందుకే దీని తల విచిత్రంగా కప్ప తలను పోలిఉంది. కాని దీని నోట్లో పండ్లువున్నాయి దీని పుట్టుక చాలా పురాతనమైనదై ఉంటుంది.

బహుశా డైనోసారస్, స్టాలోపాసుచస్, పైటోసార్స్, ధెరోపోడ్స్, బ్రోంటోసార్స్, యిగ్వానోడన్, ఇలా కొన్ని వందల రకాల జంతువులుండేవి. ఇవి అన్ని శాఖాహారులే. క్రమంగా వీటిలో కొన్ని మాంసాహారులుగా మారిపోయాయి. కాలక్రమాన ఈ జంతువులన్ని నశించిపోయాయి. అలాగే ఈ ఫ్రాగ్ కూడా ఈ విచిత్ర జంతువుల జాతికి చెందినదే అయ్యుంటుందని నా అంచనా! ఇన్నాళ్ళు మనుషులకు కనిపించకుండా ఆ కొండ చెరియల్లో తల దాచుకొంది. అందుకే దీని శరీరం తుపాకి తూటాలకుకూడా చలించలేదు" అంది సాధన.

తరువాత నలుపు, తెలుపు, పసుపు, ఆకుపచ్చ మొద లగు వివిధ రంగులుగల అట్టముక్కలను చూపించింది ఫ్రాగ్‌కు.

వాటిని విచిత్రంగా చూస్తూ నిల్చుంది ఫ్రాగ్.

కాని, రెడ్ కలర్ అట్టముక్కను చూస్తూనే "గ్రాంగ్...గ్రాంగ్" మంటూ భయంకరంగా అరచింది. ఆ అట్టముక్కను అందుకొని 'ఫట్' మంటూ రెండుగా విరచివేసింది ఫ్రాగ్.

"ఐసీ. రెడ్ కలర్ అంటే దీనికి గిట్టదన్నమాట!" అనుకొంది సాధన.

అలా వారంరోజులు ఫ్రాగ్ పై ఏవేవో పరిశోధనలు చేస్తూనేవుంది సాధన. ఆ వారంరోజుల్లో ఫ్రాగ్ బాగా మచ్చికైంది సాధనకు.

# 8

ఒక రోజు—

సాధన, ఫ్రాగ్‌ను బంధించిన తలుపులను బార్లా తెరిచివేసింది. నిర్భయంగా లోనికి పోయింది. సాధన అసిస్టెంట్లు భయంతో బయటే నిలబడిపోయి అలాగే చూస్తుండిపోయారు.

సాధన లోనికెళ్ళి ఫ్రాగ్ కాళ్ళకున్న సంకెళ్ళను తొలగించివేసింది. ఫ్రాగ్ సాధనకు కళ్ళార్పకుండా చూడసాగింది.

"ఫ్రాగ్" ఉరుములా ఉరిమింది సాధన.

"ఇలారా!" అంటూ చేత్తో సైగచేసి చూపింది. ఫ్రాగ్ మెల్లగా నడచివచ్చింది సాధన చెంతకు. ఆప్యా యంగా దాని చేతిని పట్టుకొంది.

"కమాన్" అంటూ ముందుకు నడచింది సాధన. వెనుకే అడుగులు వేస్తూ బయటకు వచ్చింది ఫ్రాగ్.

తన ల్యాబరేటరీని చూపుతూ కాంపౌండులోని గార్డెన్ వద్దకు పిలుచుకొని పోయింది.

అక్కడ రెండు ఫుట్ బాల్స్‌ను, పెద్ద పెద్ద రబ్బరు బొమ్మలను దాని ముందు ఉంచింది. ఫ్రాగ్ వాటిని అందుకొని ఇటూ, అటూ త్రిప్పుతూ చూడసాగింది.

సాధన ఒక ఫుట్ బాల్‌ను దానికి అందేలాగున తన్నింది. రివ్వున దూసుకొనిపోయి దాని గుండెలకు తగిలి క్రిందపడింది బాల్.

ఫ్రాగ్ కూడా సాధనలాగే ఫుట్ బాల్‌ను ఒక తన్ను తన్నింది. అది వేగంగా కాంపౌండు దాటి అవతల పడింది.

ఆ తర్వాత రబ్బరు బొమ్మలను అందుకొంది ఫ్రాగ్. వాటిని పరిశీలనగా చూసింది. రెండు బొమ్మలకు కాన్వెంటు దుస్తులు తొడగబడివున్నాయి. ఆ గుడ్డలను పట్టి లాగుతూ ఆ బొమ్మల కళ్ళు, ముక్కును తడుము తోంది. ఒక్కసారిగా రెండు బొమ్మలను విసిరికొట్టింది. వాటిలో ఒక బొమ్మ పెద్ద నీటితొట్టిలో పడిపోయింది.

ఫ్రాగ్ గబగబ నీటి తొట్టి చెంతకు వెళ్ళి బొమ్మను తీసుకొని అటూ, ఇటూ విదిల్చింది నీటిని.

"చూశారా! ఇప్పుడిప్పుడే దీనిలో మార్పులు కన్పిస్తున్నాయి. నా ప్రయత్నం త్వరలో ఫలించబోతుంది. ఆ తర్వాత దీనివల్ల ఎవరికి ఎటువంటి ప్రమాదం ఉండదు. అందరితో హాయిగా నడిరోడ్డులో త్రిప్పవచ్చు" అంది సాధన దూరంగా నిలబడి వింతగా ఫ్రాగ్ చేష్టలను చూస్తున్న తన అసిస్టెంట్లతో.

"ఫ్రాగ్! కమాన్" అంటూ కేక వేసింది సాధన. ఫ్రాగ్ చేతిలో ఉన్న బొమ్మతో సహా సాధన చెంతకు వచ్చి నిలబడింది. నవ్వుతూ దాని చేతిని పట్టుకొని, బోను, చెంతకు తీసుకొని వెళ్ళింది.

యథాప్రకారంగా బోనులోనికి పంపి, లాక్ చేసింది సాధన. కాని ఫ్రాగ్ కాళ్ళకు యీ సారి సంకెళ్ళు వేయలేదు. ఫ్రాగ్ చేతులలో బొమ్మ అలాగే ఉండి పోయింది.

# 9

రాత్రి పదకొండు గంటలు కావస్తుంది—

సాధన భవనం అతి నిశ్శబ్దంగా ఉంది. కాంపౌండు చుట్టూ తీగెలలో విద్యుత్ ప్రసారమవుతూవుంది.

వాచ్ మెన్సలో ఒకడు గేటుచెంత కూర్చొని బీడి ముట్టించాడు. రెండవవాడు లోపల గార్డెన్‌లో రౌండ్ కొట్టడానికి వెళ్ళాడు.

కార్లోనుండి దిగాడు భూషణ్. గేట్ చెంతకు వచ్చి నిలబడ్డాడు. చీకట్లో అతని ముఖం కన్పించలేదు వాచ్-మెన్‌కు.

"కౌన్ హై" ప్రశ్నించాడు—గేటు కమ్ములలోనుండి తల పెట్టి పరిశీలనగా ఎదురుగానున్న భూషణ్‌ను చూస్తూ.

చటుక్కున వాచ్ మెన్ తల పట్టుకొని గేటు కమ్ముల కేసి బలంగా మోదాడు. నిశ్శబ్దంగా వాలిపోయాడు వాచ్ మెన్. అతని జేబులోని తాళాలను తీసుకొని గేటును బార్లా తెరచి కారును లోనికి పోనిచ్చాడు.

ఎదురుగా దూసుకొని వస్తున్న కారును ఆశ్చర్యంగా చూడసాగాడు అప్పుడే అటుగా వస్తున్న వాచ్ మెన్. ఆపమన్నట్లు చెయ్యి అడ్డుపెట్టాడు. సర్రున దూసుకొని వచ్చి వాచ్ మెన్ ప్రక్కన ఆపాడు కారును.

"కౌన్..." అంటూ విండోలోనుండి లోనికి తల పెట్టాడు వాచ్ మెన్.

'ఫట్' మని పడింది వాచ్ మెన్ తలమీద భూషణ్ చేతిలోని ఇనుప రాడ్.

"యా!... అల్లా" అంటూ నేలకొరిగిపోయాడు వాచ్ మెన్.

కారును నేరుగా ఫ్రాగ్ ఉండే ల్యాబ్ ముందు ఆపాడు. దూరంగా సాధన గదిలో బెడ్ లైటు వెలుగుతుంది. నిర్భయంగా లోనికి వెళ్ళాడు.

ఒక్కొక్క గదిని పరిశీలిస్తూ ముందుకుపోసాగాడు. అన్ని లేబరెటరీకి సంబంధించిన పరికరాలతో, వింత వింత వాసనలతో ఆ గదులు నిండిఉన్నాయి.

చివరకు ఫ్రాగ్ ను బంధించిన బోను వద్దకు వెళ్ళాడు. చీకటిగా వుంది.

గోడను తడిమి స్విచ్ వేశాడు. గదంతా ప్రకాశవంతంగా వెలిగిపోతుంది.

బోనులో కూర్చొని కునికి పాట్లు పడుతున్న ఫ్రాగ్ ఉలిక్కిపడి లేచింది. దాన్ని చూస్తూనే భూషణ్ కళ్ళు ఎర్రబడ్డాయి. అతని ముగ్గురు మిత్రుల దీనవదనాలు కళ్ళ ముందు కదలాడాయి. చటుక్కున రివాల్వర్ తీశాడు. ఫ్రాగ్ భూషణ్ ను అలాగే చూస్తుండిపోయింది. రివాల్వర్ పైకి ఎత్తాడు.

దీన్ని తను చంపకూడదు. ముందుగా దీన్ని నగరంలోకి త్రోలి ప్రజలను భయభ్రాంతులుగా చేస్తూ ఇది తిరుగుతూ వుంటే...అప్పుడు ప్రభుత్వమే దీనిని పిచ్చికుక్కను కాల్చి నట్టు కాల్చి చంపుతుంది. దాంతో సాధన ఆశయం మట్టి పాలౌతుంది. తన కసి తీరుతుంది, అని చిన్నగా నవ్వు కొన్నాడు.

"ఢాం" మంది భూషణ్ చేతిలోని రివాల్వర్. బోనుకు వున్న తాళం విడిపోయి క్రింద పడింది. 'గుడ్. బై" అంటూ భూషణ్ బయటికి వెళ్ళిపోయాడు.

వేగంగా తన కారు చెంతకు వచ్చాడు భూషణ్. స్టార్ట్ చెయ్యబోయాడు. "గుర్ర్ర్" మంది ఇంజన్. స్టార్ట్ కావడంలేదు.

కారు దిగి ఆందోళనగా బానెట్ ఎత్తి లోపలికి చూశాడు. ఏవో వైర్లు తెగి వున్నాయి. వాటిని కలిపి బానెట్‌ను "దబ్" మంటూ మూసేశాడు.

అంతే! అదిరిపోయాడు భూషణ్. ఎదురుగా వున్న ఆకారాన్ని చూసి, గుండెలు పగిలేలా గావుకేక వేశాడు.

"గ్రాం...గ్" మంటూ ఎగిరి మీద పడింది ఫ్రాగ్.

"హెల్ప్. హెల్ప్. వద్దు. వద్దు. నన్ను చంపద్దు" భూషణ్ పిచ్చిగా కేకలు వేయసాగాడు. ఫ్రాగ్ గట్టిగా అతడి మెడను పట్టుకొంది. విలవిలలాడిపోయాడు.

బలంగా విసిరికొట్టింది భూషణ్‌ను.

గాలిలో రివ్వున దూసుకొనిపోయి కరెంట్ తీగలలో చిక్కుకొనిపోయాడు. "చక్ చక్" మని మెరిశాయి కరెంటు తీగెలు!

కొద్ది క్షణాల్లోనే నల్లగా మాడిపోయాడు భూషణ్.

# 10

చటుక్కున మెలకువ వచ్చింది సాధనకు. దబ, దబ మని బాదుతున్నారు తలుపులను.

"ఎవరు?" ప్రశ్నించింది. జవాబు రాలేదు. మళ్ళీ చప్పుడు.

బహుశా, వాచ్ మెన్ కావచ్చు, అనుకొని నైట్ గౌనును సర్దుకొంటూ, వెళ్ళి తలుపులు తీసింది. గుమ్మంలో నల్లగా ఏదో ఒక ఆకారం మసకమసకగా కన్పించింది.

చటుక్కున గోడకున్న స్విచ్ నొక్కింది. లైట్ వెలిగింది.

అంతే! సాధన కెవ్వున కేక వేయబోయి బలవంతంగా ఆపుకొంది. బయట భయంకరంగా, అతి భయంకరంగా. నిలబడి ఉంది ఫ్రాగ్!

ఏమిటి? ఫ్రాగ్ ఇక్కడికెలా వచ్చింది?

అంత రాత్రివేళ, ఆ రూపంలో దాన్ని చూడగానే సైంటిస్ట్ సాధనలోకూడా ఏదో భీతి కలుగసాగింది. ఎలాగో ధైర్యం చేసుకొని—

"ఫ్రాగ్! ఇక్కడి కెందుకొచ్చావ్?" గట్టిగా గర్జించింది.

సాధన మాటలు విన్పించుకోకుండా లోనికి అడుగులు వేసింది ఫ్రాగ్.

"వెళ్ళు. బయటకు వెళ్ళు" చేతిని బయటకు చూపుతూ అంది. అంతే! రెండు చేతులను చాపి చటుక్కున సాధనను పట్టుకొంది ఫ్రాగ్. ఆకులా గజగజ వణికిపోయింది సాధన.

"ఫ్రా...గ్" గట్టిగా బెదిరించాలనుకొంది. కానీ ఆ మాట నోటినుండి బయటికి రాలేదు. ఫ్రాగ్ ఉక్కులాంటి చేతులలో చేపపిల్లలా నలిగిపోసాగింది సాధన.

ఒళ్ళంతా చెమటలుపట్టి ధారలుగా కారసాగాయి.

కనుక్కొన తన పారల్లాంటి పళ్ళతో సాధన మెడను కొరికింది ఫ్రాగ్!

'కెవ్వు'న కేక వేసి పైకి లేచింది సాధన. ఒళ్ళంతా చెమటలుపట్టి కంపించిపోసాగింది. గుండె వేగంగా కొట్టుకొంటుంది. కల! భయంకరమైన పీడకల!

"ఠంగ్, ఠంగ్" మంటూ గంటలు కొట్టసాగింది గడియారం. దానివైపు చూసింది. 12 గంటలు చూపుతోంది.

బెడ్ పై నుండి క్రిందికి దిగి కూజాలోని నీళ్ళతో ముఖం కడుక్కొని గట, గట త్రాగేసింది సాధన.

"హమ్మయ్య! ఎంత భయంకరమైన కల. ఇలా నిజంగా జరుగుతుందా! నా ఫ్రాగ్ నన్నే చంపుతుందా!" అని ప్రశ్నించుకొంది.

గబ, గబ కిటికీవద్దకు వెళ్ళి లేబరేటరీ గదివైపు చూసింది. దూరంగా గేటు బార్లా తెరచి ఉండటం, ఒక చోట కారు నిలబడి వుండటం చూసింది. అంతేకాదు, ఫ్రాగ్ వుండే గది లైటు వెలుగుతుంది.

ఆశ్చర్యపోయింది సాధన.

"ఎవరిదా కారు? తన కాంపౌండులో ఎందుకు నిల్చింది?" ఆలోచించసాగింది.

ఒక్కసారిగా ఉలిక్కిపడింది.

"అవును. అది, అది భూషణ్ కారు. మరి అతడు ఫ్రాగ్‌ను చంపడానికి వచ్చాడా! అసలు లోపలికి ఎలా వచ్చాడు? అంటే?? వాచ్ మెన్స్‌ను చంపేశాడా????" అదిరిపోయింది.

గబ, గబ టెలిఫోన్ చెంతకు వెళ్ళి, చీఫ్ కమీషనర్ శశికాంత్ ఇంటికి రింగ్ చేసింది.

"యస్. శశికాంత్ స్పీకింగ్!" అవతలి నుండి వినబడ గానే—

"సారీ సార్. ఇంత రాత్రి వేళ మిమ్మల్ని ఇబ్బంది పెడ్తున్నాను. మీరు అర్జంటుగా ఒక్కసారి మా ఇంటికి రావాలి" అంది సాధన.

"వాట్ హేపెండ్ మిస్ సాధన. అసలు ఏం జరిగింది? విషయం చెప్పు?"

"భూషణ్. అదే ఫ్రాగ్‌ను కనుగొన్న వ్యక్తి కారు నా కాంపౌండులో ఉంది. అంతేకాదు, ఫ్రాగ్ ఉండే గదిలో లైట్లు వెలుగుతున్నాయి. అభూషణ్ నా వాచ్ మెన్స్‌నుకూడా ఏదో చేసి వుంటాడు. బహుశా ఇంకా సేపటికి నాదగ్గరకుకూడా రావచ్చు. నాకేమిటో భయంగా ఉంది సార్. మీరు వీలయినంత త్వరలో ఇక్కడికి వచ్చే యండి" ఆందోళనగా అంది సాధన.

"అలాగా! నేను వెంటనే పోలీసు సిబ్బందితో వస్తున్నా! అంతవరకు నీవు నీ గదిలోనే వుండి తలుపులు వేసుకో! నేను వచ్చి పిలిచేవరకు ఎట్టి పరిస్థితిలోను తలుపులు తెరవకు. జాగ్రత్త!" అంటూ అవతల రిసీవర్ పెట్టేశాడు.

సాధన కిటికి తలుపులనుకూడా వేసి బిక్కు బిక్కు మంటూ శశికాంత్ రాకకోసం వేచివుంది.

ఇరవై నిముషాలు ఇరవై యుగాలుగా గడిచింది. పోలీసు వ్యాన్ సాధన కాంపౌండు లోనికి దూసుకొని వచ్చి ఆగింది.

రివాల్వర్ చేత పట్టుకొని దిగాడు శశికాంత్. అతని వెనుక నలుగురు పోలీసులు దిగారు. చుట్టూ పరికించి చూశాడు. వాచ్ మెన్స్ అలాగే పడి వున్నారు. వారికి స్పృహ తెప్పించారు పోలీసులు.

వాళ్ళను వెంట పెట్టుకొని, సాధన గది చెంతకు వచ్చాడు శశికాంత్.

"మిస్ సాధన. నేను శశికాంత్ ను, నీవు తలుపులు తెరవచ్చు" గట్టిగా అన్నాడు శశికాంత్.

భయంతో తలుపులు తీసింది సాధన.

"వాచ్ మెన్లకు ప్రమాదం లేదు. ఇక ఫ్రాగ్ సంగతి చూద్దాం పద" అన్నాడు.

అందరూ కలిసి లేబరెటరీ గదికేసి నడిచారు.

ఎక్కడ చూసినా చెల్లా చెదురుగా పడిన సామానులతో నిండి వుంది ఆ గది. అయోమయంగా సాధన, ఫ్రాగ్ ను బంధించిన బోను చెంతకు వెళ్ళింది.

బోను తలుపులు బార్లా తెరచి వున్నాయి. ఫ్రాగ్ లేదు.

"ఫ్రాగ్ పారిపోయింది" అప్రయత్నంగా వెలువడింది సాధన నోటినుండి.

"కాదు. దానికి ఎవరో ఆ అవకాశమిచ్చారు" అన్నాడు శశికాంత్ గంభీరంగా.

అందరూ బయటకు వచ్చేశారు.

"సార్! ఆ కరెంటు తీగలలో ఏదో చిక్కుకొని వుంది" అన్నాడు ఒక కానిస్టేబుల్.

"పద, చూద్దాం" అంటూ శశికాంత్ టార్చి వెలిగిస్తూ ముందుకు కదిలాడు. టార్చ్ ను తీగలపై వెలిగించాడు

అంతే. అందరూ అలాగే కొయ్యబారిపోయారు. అక్కడ వారికి నల్లగా మాడిపోయిన భూషణ్ శవం కన్పించింది.

"బహుశా, భూషణ్ కావచ్చు! మరి, ఫ్రాగ్ ఏమైందో?" అనుకొన్నాడు శశికాంత్.

వెంటనే ఆ తీగెలలో కరెంటు నిలిపివేశారు.

"మిస్ సాధన ఈ వ్యక్తి ఫ్రాగ్‌కు ఏదో కీడు తల పెట్టడానికి వచ్చివుండాలి. కాని దాని చేతిలో ఘోరంగా మరణించాడు. ఇప్పుడు మరొక సమస్య మొదలైంది. ఫ్రాగ్ నగరంలోకి వెళ్ళింది. ఇక కన్పించిన వారందరిని చంపవచ్చు. అందుకే ఈ రాత్రికే దాన్ని ఎలాగైనా గాలించి బంధించాలి. లేకుంటే షూట్ చేయాలి" అన్నాడు శశికాంత్.

శశికాంత్ మాటలకు మౌనం వహించింది సాధన.

ఇరువురు పోలీసులను కాపలా పెట్టి వ్యాన్ ఎక్కాడు శశికాంత్.

"శశికాంత్ గారూ, దయచేసి నన్నూ మీ వెంట తీసుకెళ్ళండి" అంది సాధన.

"సాధన! ఆ క్రూరమృగం కోసం నీకింత పట్టుదల ఎందుకు? పాముకు పాలుపోసి పెంచినా, అది ఎప్పుడో ఒకప్పుడు కాటువేస్తుంది. అలాగే ఆ మృగం దాని లక్షణం చూపుతోంది."

"కాదు. మిస్టర్ శశికాంత్! ఫ్రాగ్ నా ఆధీనంలో ఉండి ఉంటే దాన్ని తప్పక మార్చి వుండేదాన్ని. కానీ ఇలా జరిగిపోయింది. ఇక నేనేం చేసేది. ప్చ్!—చివరకు ఎలా జరుగుతుందో. దాన్ని చివరిసారైనా చూడాలి. అందుకే దయచేసి నన్ను మీతో తీసుకెళ్ళండి" ప్రాధేయ పడింది సాధన.

"ఆల్ రైట్. వ్యాన్ ఎక్కు"

సాధన వ్యాన్‌లో కూర్చుంది.

వ్యాన్ రివ్వున దూసుకొని పోయింది బయటికి.

## 11

నిర్మానుష్యంగా వుంది రోడ్డు.

చల్లటి గాలులు వీస్తూ చిన్న చిన్న తుంపరలు పడుతున్నాయి.

గబ, గబ అడుగులు వేస్తూ ముందుకు పోసాగింది ఫ్రాగ్. "దబ్...దబ్" మంటూ దాని అడుగుల సవ్వడి ఆ నిశీధిలో మారుమ్రోగుతుంది.

అంత రాత్రివేళ, అటువంటి చోటున, అతి భయంకర మైన ఫ్రాగ్‌ను ఎవరైనా చూస్తే అక్కడికక్కడే గుండెలు పగిలి చస్తారు.

రాత్రి ఒంటి గంట కావస్తుంది. దూరంగా స్ట్రీట్ లైట్లు మసకగా కన్పిస్తున్నాయి. "భౌ" మంటూ వెంట పడింది వీధి కుక్క. విసురుగా కాలితో తన్నింది దాని కడుపులో. "కుయ్యో" మంటూ అల్లంతదూరం ఎగిరి పడింది. మరి లేవలేదు.

చక, చక అడుగులు వేస్తూ ముందుకు పోసాగింది ఫ్రాగ్. సిటీ దూరం కావడంవల్ల వాహనాలు ఏవీ రావడం లేదు.

రోడ్డును క్రాస్ చేయబోయింది ఫ్రాగ్. సరిగ్గా రోడ్డు మధ్యభాగాన వచ్చి నిలబడింది.

అదే సమయంలో ఒక జీపు సర్రున దూసుకొని వచ్చి దాని ముందు సడన్ బ్రేకుతో ఆగింది. జీపు లైట్ల కాంతి

ఫ్రాగ్ కండ్లమీద పడగానే చేతులు అడ్డుపెట్టుకొంటూ "గ్రాం...గ్" మంటూ బిగ్గరగా అరచింది.

అంతే! దాని ఆకారాన్ని చూస్తూనే జీపు డ్రైవర్ అదిరిపోయాడు. మరుక్షణం జీపును గిర్రున రివర్స్ కొట్టించి, 80 మైళ్ళ స్పీడుతో వచ్చినదారినే దూసుకొనిపోయాడు.

రోడ్డును దాటి మెట్టప్రదేశంలో అడుగుపెట్టింది. దూరంగా వెలుతురు కన్పించింది. ఆ వైపు గబ, గబ అడుగులు వేసింది.

వాన జోరు పెరిగింది. ఉరుములు, మెరుపులతో వాతావరణం కొద్దిసేపటిలో భీభత్సంగా తయారైంది. ఫ్రాగ్ అలాగే కొద్దిదూరం పోగానే ఎవరిదో కాంపౌండ్ కన్పించింది. ఆ కాంపౌండ్ లోనికి వెళ్ళింది.

ఆ కాంపౌండు రకరకాల చెట్లతో నిండి వుంది. చెట్లను చెల్లాచెదురుగా చేస్తూ ముందుకు పోసాగింది. కాళ్ళకు ఏదో తగిలి బోర్లా పడిపోయింది. ఒక పెద్ద గుంటలోకి దొర్లిపోయింది. అలాగే కండ్లు మూసుకొని నిద్రపోయింది.

తీక్షణమైన సూర్యకిరణాలు మీదపడగానే చటుక్కున లేచింది ఫ్రాగ్!

దూరంనుండి పిల్లల అరుపులు విన్పించాయి. ఫ్రాగ్ కాంపౌండు దాటి బయటకు వచ్చింది.

దూరంగా స్కూల్ గ్రౌండులో కాన్వెంటు పిల్లలు రక, రకాల ఆటలు ఆడుకొంటున్నారు. ఆవైపు వేగంగా నడుస్తూ వెళ్ళింది.

వాళ్ళ దుస్తులను చూస్తూనే ముచ్చటేసింది. ఫ్రాగ్ రావడం దూరంనుండి చూస్తూనే పిల్లలందరూ చెల్లాచెదరుగా పారిపోయారు.

వారిలో ఏడేండ్ల పిల్లవాడు కంగారుగా పరిగెత్తుతూ ఒక నీటి గుంటలో పడిపోయాడు. ఫ్రాగ్ వెంటనే ఆ పిల్లవాణ్ని రెండు చేతులతో ఎత్తుకొంది. దాని స్పర్శ తగలగానే వెర్రిగా కేకవేసి స్పృహతప్పి పడిపోయాడు.

ఆ పిల్లవాణ్ని పరిశీలనగా చూసింది ఫ్రాగ్. దాని కండ్లముందు సాధన అందించిన రబ్బరు బొమ్మలు మెదిలాయి. అలాగే భుజంపై వేసుకొని, కాన్వెంటు దాటి వచ్చేసింది.

ఎదురుగా కన్పించిన కొండ ప్రాంతమువైపు పరుగులు తీసింది ఫ్రాగ్!

# 12

శశికాంత్ రాత్రి అంతా ప్రతి రోడ్డును జాగ్రత్తగా పరిశీలించాడు ఫ్రాగ్ కోసం! కానీ ఫలితం కన్పించలేదు.

శశికాంత్ సిబ్బంది కాన్వెంటువైపు వచ్చింది.

కాన్వెంటు ముందు పిల్లలను స్పెషల్ బస్‌లో ఎక్కిస్తున్నారు టీచర్స్. పోలీసు జీపులు రావడం చూసి, టీచర్స్ ఆపమన్నట్లు సైగ చేశారు.

"ఏమిటి? ఏం జరిగింది?" ప్రశ్నించాడు శశికాంత్.

"ఉదయం 8 గంటల ప్రాంతాన పేపర్లో వేసిన విచిత్ర జంతువు మా కాన్వెంటులో ప్రవేశించింది. దాన్ని చూసి మా పిల్లలు భయపడి పారిపోయారు. కాని దాని చేతులో ఒక పిల్లవాడు చిక్కిపోయాడు. ఆ పిల్లవాణ్ని తీసుకొని అదిగో ఆ కొండ ప్రాంతంకేసి వెళ్ళిపోయింది. మీరు వెంటనే ఆ పిల్లవాణ్ని రక్షించాలి." అంది కాన్వెంటు హెడ్ మిస్.

ఒక జీపు టౌను వేపు దూసుకెళ్ళింది.

"సాధనగారూ! దేశానికి ప్రయోజనకరమైన పరిశోధనలు జరపండి. అంతేకాని, ఇలాంటి వాటిపై పరిశోధనలు జరిపితే కాలము—ధనం వృధా...అంతే!" అన్నాడు శశికాంత్ సాధవైపు చూస్తూ.

శశికాంత్ మాటలు ఆమె చెవికెక్కలేదు. ఆమె చూపులంతా ఫ్రాగ్ దాక్కొన్న బిలంకేసి వున్నాయి.

సమయం మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

అప్పుడే నగరంలో ఎలా తెలిసిందో ప్రజలందరూ గుంపులు గుంపులుగా రావడం మొదలెట్టారు. వస్తున్న జనాన్ని చూసి విసుక్కున్నాడు శశికాంత్.

టౌనుకు వెళ్ళిన జీపు తిరిగివచ్చింది. దానితోపాటు ఎనిమిది స్పెషల్ వ్యాన్స్ వచ్చాయి. ఒక వ్యాన్‌లో డైనమైట్స్, హ్యాండ్ బాంబ్స్ ఉన్నాయి. మిగతా వ్యాన్స్‌నుండి బిలబిలమని దిగారు పోలీసు సిబ్బంది.

శశికాంత్ కనుసైగ చేయగానే ఆ బిలంచుట్టూ తుపాకులు తీసుకుని నిలబడ్డారు. మరికొందరు చక, చక ఆ బిలంలోకి దిగారు. వారితోపాటు డైనమైట్స్‌నుకూడా వెంట తీసుకెళ్ళారు.

వారి చర్యలను ఆశ్చర్యంగా చూడసాగింది సాధన.

"శశికాంత్ గారు! ఏమిటిది? ఏం చేస్తున్నారు?" ఆదుర్దాగా అంది.

"బిలంనిండా డైనమైట్లను అమర్చి, బిలాన్ని పేల్చివేస్తున్నాం. దాంతోపాటు ఆ డెవిల్ ఫ్రాగ్‌కూడా అంతమవుతుంది."

"మరి ఆ ఫ్రాగ్ చేతిలో చిక్కిన పిల్లవాడు."

సాధన ధయిర్యానికి ఆశ్చర్యపోయాడు శశికాంత్.

"ఆల్ రైట్! ఇదిగో, ఈ రివాల్వర్ తీసుకెళ్ళండి ప్రాణ రక్షణకు."

"అవసరంలేదు," అంటూ బిలంలోనికి దిగింది సైంటిస్ట్ సాధన.

# 13

బిలంలో సగంవరకు పోలీసు సిబ్బంది దిగి అక్కడ కక్కడా డైనమైట్స్ అమర్చుతున్నారు. సాధనటార్చిని తీసుకొని లోనికి దిగసాగింది. కాలికి నేల తగలగానే టార్చ్ వెలిగించి చుట్టూచూసింది.

అంతా నిశ్శబ్దంగా వుంది.

పైనుండి గోలగా అరుపులు విన్పిస్తున్నాయి. పైన డైనమైట్స్ అమర్చుతున్న పోలీసులుకూడా కన్పిస్తున్నారు.

సాధన ముందుకు కదులుతూ పరిశీలిస్తూ పోసాగింది.

నీటి మడుగు కన్పించింది కొంతదూరంలో. ఆ మడుగు వైపు అడుగులువేస్తూ పోసాగింది.

హటాత్తుగా సన్నగా ఏడుస్తున్న ధ్వని యెక్కడ నుండో వినిపించసాగింది. ఆనందంగా ఆవైపు వెళ్ళింది. అలా కొంతదూరం పోగానే మోకాళ్ళలోతు నీళ్ళలో ఆ పిల్లవాడు నిల్చుని ఏడవడం కన్పించింది సాధనకు.

గబగబ ఆ పిల్లవాని చెంతకు వెళ్ళింది. సాధనను చూస్తూనే, ఆనందంగా ఎదురెళ్ళి కౌగలించుకున్నాడు.

అంతలో......

"గ్రాం...గ్" మంటూ సాధనపైకి రాబోయింది ఫ్రాగ్.

హ్యాండ్ బాంబులనుకూడా అమర్చాం" అన్నారు శశికాంత్‌తో.

అంతా ఆ బిలంకు దూరంగా వెళ్ళి నిలబడి చూస్తున్నారు.

"మిస్ సాధన! కమాన్, ఇక కొద్దిసేపట్లో ఆ బిలం ప్రేలిపోతుంది" అన్నాడు శశికాంత్. సాధన జవాబివ్వలేదు. అలాగే ఆ బిలంకేసి వెర్రిదానిలా చూస్తూండిపోయింది.

సాధన చెయ్యిపట్టుకుని దూరంగా నడిపించుకుపోయాడు శశికాంత్.

అంతే! మరుక్షణం—

ఒక్కసారిగా ఆ కొండప్రాంతమంతా అదిరిపోయింది.

"ఢాం... ఢాం... ధన్ ... ధన్ ... ధన్ ... ఢాం" అంటూ భయంకరంగా ప్రేలసాగాయి డైనమైట్లు. చెల్లాచెదురుగా పడసాగాయి ఆ బిలంనుండి దూసుకొచ్చిన రాళ్ళు. ఉవ్వెత్తున పైకి ఎగరసాగింది మట్టి.

బిలంలోనుండి ఫ్రాగ్ భయంకరమయిన అరుపులు, ఆ డైనమైట్ల శబ్దంలో కలిసిపోయాయి.

ఆ బిలనుండి వెదజల్లబడిన మట్టిలో అక్కడక్కడా బంగారు కణికెలు, బంగారు నాణేలు కనిపించసాగాయి ఆది భూషణ్ తాతలనాటి 'నిధి'. ఆ విధంగా బయటపడింది.

'ధన్' మరొక హ్యాండ్‌బాంబ్ ప్రేలింది. అక్కడనుండి ఎగురుకుంటూ కొంతమట్టివచ్చి సాధన, శశికాంత్ కాళ్ళముందు పడింది.

ఆ మట్టిలో ఛిన్నాభిన్నమైన ఫ్రాగ్ తలభాగాలు కూడా ఉన్నాయి.

దాన్ని చూసి, సాధన వెక్కి, వెక్కి ఏడవసాగింది. సాధన పరిస్థితిని చూసి శశికాంత్ హృదయం బాధగా మూలిగింది.

"మిస్ సాధన. మీదెంత సున్నిత హృదయం. ప్రాణాలుతీసే ఆ భయంకరమైన క్రూరమృగం కొరకు మీరు ఇంతగా బాధపడుతున్నారంటే, దానిపై మీరెన్ని ఆశలు పెంచుకొన్నారో అర్థమవుతుంది. అయాం వెరీ సారీ సాధన. నా డ్యూటీ నేను చేశాను. పదండి పోదాం," అంటూ సాధన చెయ్యి పట్టుకుని, జీపుకేసి నడిపించుకొని పోయాడు శశికాంత్.

సాధన వెనుకకు చూస్తూ బరువుగా అడుగులు వేయ సాగింది. ఆమెకళ్ళముందు ఫ్రాగ్ యింకా సజీవంగా ఉన్నట్లే కన్పిస్తుంది.

('ఫ్రాగ్' ఆంగ్లనవల ఆధారంగా)

—: ఐ పో యిం ది :—

# దోపిడిదొంగ సీతాపతి!!

## వసుంధర

వీధి అరుగుమీద కూర్చుని దశరథరామయ్యగారు తన మిత్రమండలితో రాజకీయాలు ముచ్చటిస్తున్నారు. రోజూ అదాయనకు రివాజు.

ఆ ఊళ్ళో దశరథరామయ్యగారు కాస్త పేరువున్నవాడనే చెప్పుకోవాలి. ఆయనకు పాతికెకరాల భూమి ఉంది. ఓ లక్షకుపైగా విలువచేసే డిపాజిట్లున్నాయి. నెలకు ఎనిమిదివందలు వచ్చే ఉద్యోగముంది.

ఆయనకిద్దరే మగపిల్లలు. ఒక ఆడపిల్ల. మగపిల్లలు పెద్దచదువులు చదువుతున్నారు. ఆడపిల్లకింకా పెళ్ళీడు రాలేదు. స్వంత ఇల్లు. అనుకూలవతి అయిన ఇల్లాలు.

ఆ అడిగిన విధానం కటువుగావుంది. దశరథరామయ్యా అన్నపదం ఉచ్ఛరించడంతో రవంత అమర్యాదకూడా గోచరించింది.

“నీదీ ఊరేనా?” అనడిగాడు దశరథరామయ్యావచ్చిన కోపాన్ని అణచుకొంటూ.

“తర్వాత చెబుతాను.దశరథరామయ్యా ఇల్లు ఇదేనా” మళ్ళీ అడిగాడు యువకుడు.

“నీదీవూరు కాదని తెలుస్తూనేవుంది. నా ఇంటికొచ్చి నా ఇల్లిదేనా అని అడుగుతున్నావ్. ఈ ఊళ్ళో నా ఇల్లు తెలియనివారు లేరు” అన్నాడు దశరథరామయ్య.

“నువ్వేనా దశరథరామయ్యావి.” అన్నాడా యువకుడు. మాట ఇందాకటికంటే కటువుగా వచ్చింది.

అరుగుమీద ఉన్న ఓ పెద్దమనిషి కలుగజేసుకొని' “చూడబ్బాయ్! నువ్వు చూడ్డానికి మర్యాదస్తుడిలా కనబడుతున్నావ్. చెట్టంత మనిషిని, నీకంటే పెద్దవాడిని, నువ్వని పిలవడం ఏమీ బాగోలేదు” అన్నాడు.
ఆ యువకుడదోలా నవ్వి — “దశరథరామయ్య నా కళ్ళకు చెట్టంత మనిషిలా కనబడ్డం లేదు. పిట్టలా అనున్నాడు. ఇంక పెద్దరికం సంగతంటావా_నీకంటె పెద్దవాడైన రిక్షావాణ్ని నువ్వు మన్నిస్తున్నావా? ముష్టాణ్ణి నువ్వు మన్నిస్తున్నావా? అంటే అర్థమేమిటి__మన్నించడం వయసునిబట్టి కాక అంతస్థునిబట్టీ, విద్యనుబట్టీ ఉంటుందని. అంతస్థులో, విద్యలో దశరథరామయ్య నా కాలిగోటికి సరిపోలడని తెలుసు కాబట్టి నేనతన్ని మన్నించడం లేదు” అన్నాడు.

సమాధానంవిన్న పెద్ద మనిషి దిమ్మెరపోయాడు.

"ఈ ఊళ్ళో ప్రముఖుడి ననుకునే నువ్వు—కొద్ది క్షణాల్లో ఓ పెద్దమనిషిని కుక్క అని పిలిచే స్థితికి దిగజారిపోయావు. పరిస్థితులు ఎదురు తిరిగితే ఎంత ఘోరానికైనా దిగడానికి నీకు క్షణంకూడా పట్టదనడానికి—ఇంతకంటే ప్రబలసాక్ష్యం అవసరంలేదు..." అన్నాడా యువకుడు.

దశరథరామయ్యకు క్షణంసేపు మాటరాలేదు—"నా మాటలలో నన్నే వేలెత్తి చూపించగల తెలివి తేటలు నీకున్నాయి. కానీ నీవంటివాడిని కుక్క అని పిలవడం—దిగజారిపోవడం కింద వస్తుందని నేను అనుకోవడంలేదు" అన్నాడాయన కాసేపు ఆలోచించాక.

"నావంటి వాడిని అంటే నీ ఉద్దేశ్యమేమిటి? నిన్ను చంపుతానని అన్నంతమాత్రాన నేను చెడ్డవాడినైపోతానా? అసలు నిన్ను ఒక మనిషి చంపాలని అనుకుంటున్నాడంటే అందుకు కారణమేమిటో ఆలోచించేవా? ఒక మనిషిని ఎవరైనా చంపాలనుకుంటున్నారంటే—వాడు చాలా దుర్మార్గుడయుండాలి కదా!—"

దశరథరామయ్య వెంటనే అందుకుని "మహాత్ములని కూడా మర్డర్ చెయ్యాలనుకునే వారుంటారు" అన్నాడు.

"అవుననుకో, కానీ నువ్వు మహాత్ముడివు కావన్న పరమసత్యం నీకుకూడా తెలుసును."

దశరథరామయ్య విసుగ్గా "సరే, నువ్వు సంగతి చెప్పు" అన్నాడు.

"చెప్పడానికేముంది? నేను నిన్ను చంపడానికి వచ్చాను."

"అయితే చంపు. ఇంతమంది సాక్షులు నిన్ను ఉరికంబం ఎక్కిస్తారు."

ఆక్కడున్న పెద్ద మనుషులందరూ సాక్షి అన్నపదం తమకు వర్తిస్తుందని తెలియగానే కంగారుగా ముఖాలు పెట్టారు.

"తన్ను చంపిన గాడ్సేని రక్షించమని కోరుతూ అంతిమ శ్వాస విడిచాడు గాంధీమహాత్ముడు. నేనింకా నిన్ను చంపకుండానే — నన్నురికంబం ఎక్కించటానికి సాక్షుల్ని చూసుకుంటున్నావు. నువ్వు మహాత్ముడివి కాదనడానికి వీరందరికీ ఇది సాక్ష్యం. అయినా సాక్షులకు భయపడేవాడినైతే ఇంతమంది ముందు వచ్చి విషయం ఎందుకు చెబుతాను? నిన్ను చంపే విధానం నాకు తెలుసు. ఆ దేవుడే దిగివచ్చి ఎదురుసాక్ష్యం చెప్పినా నన్నురికంబం ఎక్కించలేని విధంగా నిన్ను చంపుతాను" అన్నాడా యువకుడు.

"మొరిగేకుక్క..." అన్నాడు దశరథరామయ్య కసిగా.

యువకుడు చిన్నగా నవ్వి—"అన్ని సమయాల్లోనూ ఆవేశపడ్డం నా కలవాటు లేదు. నీ చావు త్వరలోనే వున్నదని హెచ్చరించడానికి వచ్చాను. ఈలోగా నీ కోర్కెలు తీర్చుకో. వీలునామాలు రాసుకో. అన్ని ఏర్పాట్లూ చేసుకో. నేను మళ్ళీసారి నిన్ను కలుసుకోడానికి వచ్చేసరికి నీకు రెండుమూడు రోజుల జీవన వ్యవధి మాత్రమే వుంటుంది" అన్నాడు.

"చాలా భయంగా ఉందినాకు" అన్నాడు దశరథ రామయ్య.

"ఉన్న కాస్తవ్యవధినీ భయంతో వృధా చేసుకోకు. ఎక్కడో అదృష్టవంతులకుగానీ, చావు చెప్పిరావడం జరగదు."

"చూడు—నీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"

"నిరభ్యంతరంగా తెలుసుకోవచ్చు. తెలుసుకుని ఏం చేస్తావ్?"

"పిచ్చాసుపత్రిలో చేర్చడానికి మనిషి పేరుకూడా తెలియాలి?"

"అయితే మంచిదే. నా పేరు సుబ్బారావ్" అన్నాడా యువకుడు.

"చూడు మిస్టర్ సుబ్బారావ్, నన్ను చంపాలని అనుకుంటున్నావు కదా. ఎందుకో తెలుసా నీకు?"

"తెలుసు!"

"అయితే ఎందుకో చెప్పు."

"సీతాపతి తెలుసా నీకు!"

"వాడా - వాడెవడు?"

"బాగా అడిగావ్ - సీతాపతిని మరచిపోయావు కాబట్టే, నిన్ను నేను చంపడానికి రావాల్సొచ్చింది."

"నాకు తెలియని మనిషిని నేను మరచిపోయే ప్రసక్తి ఎక్కడవుంది?"

"లేదులే—అయినా నేను పిచ్చాసుపత్రిలో చేరవల సిన వాణ్నికదా. నా మాటలగురించి భయపడకు. ఎందు కయినా మంచిది—ఏ పుట్టలో ఏ పాముందోననే జ్ఞాన మయినా నీకుంటే వెంటనే వీలునామా రాయించి అన్ని ఏర్పాట్లు చేసుకో. చావకపోతే మంచిదే, ఒకవేళ చస్తే అప్పుడు విచారించి లాభం లేదుకదా" అన్నాడు సుబ్బా రావు.

"నీ సలహాకి చాలా థాంక్స్" అన్నాడు దశరథ రామయ్య.

"నువ్వు చావడం అప్పుడే ఆరంభమైంది. మరి నే వస్తాను" అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

## 3

"ఇలాంటి తమాషా జీవితంలో చూడలేదు" అన్నాడో పెద్దమనిషి.

"ఇందిరాగాంధి ఎన్నికలు జరిపించడంకంటె చిత్రంగా ఉందిది" అన్నాడింకో పెద్దమనిషి.

"భారత ప్రజలు తమకేవో అన్యాయాలు జరిగాయనీ, అవి తీరుస్తుందనీ ఆశపడి బుర్ర ఉపయోగించి ఓటు చేసి జనతా నెన్నుకోవడంకంటే విచిత్రమిది" అన్నాడు మరో పెద్దమనిషి.

"జరిగిన ఘోరాలన్నీ తెలిసేకకూడా ఇందిరాగాంధీని ప్రజలు తమ మధ్యకు ధైర్యంగా రానివ్వడంకంటె ఆశ్చర్యకరమైన సంఘటన నా కళ్ళతో చూసాను" అన్నాడు ఇంకో పెద్దమనిషి.

మరికొందరు జనతాపార్టీని విమర్శిస్తూకూడా ఈ సంఘటన ఆశ్చర్యకరమైనదన్నారు.

"మీరు మీమీ రాజకీయ పరిజ్ఞానాన్ని బాగానే ప్రకటించుకుంటున్నారు కానీ నా ఇబ్బంది గ్రహించడం లేదు" అన్నాడు దశరథరామయ్య.

"అవును, నిజమే, మీరేంచేస్తారిప్పుడు?"

"మీ సలహా ఏమిటి?" అడిగాడు దశరథరామయ్య.

వెంటనే పెద్ద ఎత్తున గుసగుసలు ప్రారంభమయ్యాయి. అలా అలా అయిదారు నిమిషాలు కొనసాగేక "ఆ యువకుణ్ణి మనం వెళ్ళిపోనివ్వకుండా ఆపవల్సింది" అన్నాడో పెద్దమనిషి.

"ఎందుకు నన్ను చంపడానికా?" అన్నాడు దశరథ రామయ్య.

"వాడు మిమ్మల్ని చంపుతాడని అనుకుంటున్నారా?" అంటూ మరో పెద్ద మనిషి ఎదురుప్రశ్న వేశాడు.

"మొరిగే కుక్క..." అంటూ పళ్ళుకొరికాడు దశరథ రామయ్య.

"మొరిగే కుక్కలు కొన్ని కరచినవైనం నాకు తెలుసు" అన్నాడింకో పెద్దమనిషి.

"అయితే ఏం చెయ్యమంటారు నన్ను?"

"కొంతకాలంపాటు జాగ్రత్తగా ఉండాలి మీరు."

"కొంతకాలమంటే ఎంతకాలం?" విసుగ్గా అన్నాడు దశరథరామయ్య.

ఒక పెద్దమనిషి లేచినిలబడి "దశరథరామయ్యగారూ! మీరు బాగా అప్ సెట్ అయ్యారు. కాసేపు విశ్రాంతి అవసరంమీకు. మేము శెలవుతీసుకుంటాము. ఈరాత్రంతా ఆలోచించి మీకు మేమేవిధంగా సహాయపడగలమో చెబుతాము. మీరుకూడా ఆలోచించండి. అందాకా శెలవు" అన్నాడు.

అంతా శెలవుతీసుకుని వెళ్ళిపోయాక దరశథరామయ్య ఇంట్లోకి వెళ్ళాడు.

"ఈరోజు మీ సమావేశం త్వరగా ముగిసినట్లుంది" అన్నది రుక్మిణి, భర్తను పలకరిస్తూ.

దశరథరామయ్య మాట్లాడకుండా లోపల కుర్చీలో కూర్చున్నాడు. అప్పుడే రుక్మిణి భర్తవంక చూసి ఆశ్చర్యంగా "అదేంటండీ అలాగున్నారు" అంది.

"చెప్పనా?" అన్నాడు దశరథరామయ్య నీరసంగా.

"అందుకే సుబ్బారావు విషయం తేలికగా తీసుకోవలసినది కాదని నాకు అనిపిస్తోంది."

# 4

రుక్మిణి ఆశ్చర్యంగా భర్తవంక చూసి, "ఎవరండీ ఆ సీతాపతి. అతనికీ మీకూ సంబంధమేమిటి?" అంది.

"ఈ విషయంలో నన్నింకేమీ అడగవద్దు. ఆ విషయం ప్రస్తుతానికి ఒకరికి చెప్పవలసినదికాదు" అన్నాడు దశరథ రామయ్య.

రుక్మిణి కనుకొలుకుల్లో నీళ్ళు తిరిగాయి— "ఏదో రహస్యం మిమ్మల్ని వేధిస్తున్నదని నాకు తెలుసు. అదృష్టం ప్రసక్తి తీసుకువచ్చినపుడల్లా మీ ముఖం అదోలా అయి పోతుంది. దానికీ ఈ సీతాపతికీ ఏదో సంబంధముండి ఉండాలి. చెప్పకూడని రహస్యం తెలుసుకోవాలని నాకు లేదు. కానీ మీ అర్ధాంగిగా వేయికళ్ళతో మిమ్మల్ని కాపాడుకోవలసిన అవసరం నాకుంది. అందుకు సహాయ పడుతుందని తోస్తే ఆ రహస్యం నాకు చెప్పండి."

"నువ్వు దిగులుపడకు రుక్మిణీ, సమయం వచ్చినపుడు అన్నీ నేనే చెబుతాను."

"ఇప్పటికే సమయం మించిపోయిందేమో?"

దశరథరామయ్య వెంటనే జవాబివ్వలేదు. ఓ క్షణం ఆగి "వంటయిందా?" అన్నాడు.

"ముక్కలు వేయించాలి. అంతే!"

"అయితే ఆ పని చూడు. చాలా ఆకలిగావుంది నాకు"

భర్తకింక తనతో మాట్లాడటం ఇష్టంలేదని గ్రహించి, అక్కణ్నుంచి వెళ్ళిపోయింది రుక్మిణి. ఆవిడ వెళ్ళి

పోగానే దశరథరామయ్య అక్కణ్ణించి ఇంకో గదిలోకి వెళ్ళాడు. ఆ గదిలోని బీరువా తెరిచి బట్టల అడుగునించి ఒక ఉత్తరం తీశాడు. మడతవిప్పి తనలోతనే ఓసారి చదువుకున్నాడు.

"తొందర్లోనే నీ గుండెల్లో నిద్రపోవడానికి వస్తున్నాను—"
'సీతాపతి.'

పొడిగా ఒకే ఒక వాక్యమున్న ఆ ఉత్తరం చదువుకొని మళ్ళీ యథాస్థానంలో ఉంచి బీరువా తలుపులు తాళం వేశాడు దశరథరామయ్య.

ఆయన తిరిగి కుర్చీలో కూర్చుని కన్నులుమూసి ఆలోచనలో పడ్డాడు. చాలా తీవ్రాలోచనలో ఉన్నాడని ఆయనను చూడగానే అర్థమైపోతుంది. ఆయన ముఖంలో కలవరపాటు స్పష్టంగా కనబడుతోంది.

మరో పదినిమిషాల్లో ఆయనకు భోజనానికి పిలుపు వచ్చింది. లేచి వెళ్ళాడాయన.

"పిల్లల్ని చూడాలనుందే" అన్నాడు దశరథరామయ్య భోజనానికుపక్రమిస్తూ.

"ఇంకా వెళ్ళి నెలయినా కాలేదు. అప్పుడే యెలా వస్తారు?" అంది రుక్మిణి.

దశరథరామయ్య ముగ్గురు పిల్లలూ విశాఖపట్నంలో ఆయన అన్నగారింట్లో ఉండి చదువుకుంటున్నారు. పెద్దవాళ్ళిద్దరూ యూనివర్శిటీ కారణంగా అక్కడ చదువుతున్నారు. అమ్మాయి వాణి మాత్రం అక్కడ చదవడానికి వేరే కారణంవుంది.

దశరథరామయ్య అన్నకు ఆడపిల్లలులేరు. వాణి అంటే వాళ్ళకెంతో అభిమానం. వాణి తమ దగ్గరేవుండి

తమ ఇంట్లోనే చదువుకోవాలనీ, ఆ విధంగా కొంత ఆడ పిల్ల ముచ్చట తీరుతుందనీ అన్నగారు కోరగా దశరథ రామయ్య కాదనలేక పోయాడు.

అయితే అసలు కారణం అదొక్కటే కాదని రుక్మిణి అనుకొంటూంటుంది.

దశరథరామయ్య అన్నగారికి అట్టే ఆస్తిలేదు. కష్టం మీద సంసారం నడుపుతున్నాడాయన. చిన్నతనంనించీ ఉన్నదాన్ని పదింతలు చేసుకోగలిగాడు దశరథరామయ్య. ఆయన అన్నగారు కాస్త జోరుగా ఖర్చుపెట్టి ఉన్నది పాడు చేసుకున్నాడు. పిల్లల్నాయన దగ్గరుంచి ఆ పేరుతో ఆయనకు ఖర్చులకని ప్రతినెలా కాస్త ఎక్కువగానే డబ్బు పంపుతూంటాడు దశరథరామయ్య. అన్నగారికీ విధంగా సాయపడడం కోసమే పిల్లలు ముగ్గుర్నీ వారింట పెట్టాడని రుక్మిణి అనుకుంటూంటుంది.

"అవును. అప్పుడే ఎలావస్తారు? మనమైనా వెళ్ళి చూడాలి. రమ్మని మనమైనా వ్రాయాలి" అన్నాడు దశరథరామయ్య.

"ఓ నెలరోజులు ఆఫీసుకు సెలవుపెట్టండి. వెళ్ళి విశాఖపట్నంలో ఉందాం" అంది రుక్మిణి.

"అలా కుదరదు రుక్మిణీ."

"ఎందుకని? మీకు సెలవు దొరకదా?"

"సెలవు దొరకడం ఒక సమస్యకాదు. పిల్లల దగ్గరికిప్పుడు వెళ్ళానంటే నా మనసు దుర్బలమవుతుంది. ప్రస్తుతం నాకు మనోబలం అవసరం" అన్నాడు దశరథ రామయ్య.

"పేరుకి అర్ధాంగినే కానీ—మీ సమస్య ఏమిటో

తెలుసుకునేందుకూడా నోచుకోలేదు నేను" అంది బాధగా రుక్మిణి.

"అలా బాధపడతావెందుకే, కొన్ని సమస్యలు తెలియక పోవడంలోనే సుఖముంటుంది. ఈ సత్యం ఈరోజు కాకపోయినా, త్వరలోనే నువ్వు గ్రహిస్తావు" అన్నాడు దశరథరామయ్య.

"అలాగే లెండి, కానీ సీతాపతి ఎవ్వరో నాకు చెప్పరూ?" అంది రుక్మిణి.

దశరథరామయ్య నవ్వి "తెలుసుకుని ఏంచేస్తావ్?" అన్నాడు.

"తెలిసేక చెబుతాను."

"అనవసరంగా కంగారు పడకు. ఒకటి రెండురోజుల్లో ఆ సీతాపతి మనింటికే రావచ్చు. అప్పుడతన్ని నువ్వు స్వయంగా చూడవచ్చు" అన్నాడు దశరథరామయ్య.

"ఎలా వుంటాడో, ఎక్కడుంటాడో, ఏం చేస్తాడో - ఆ సీతాపతి" అనుకుంది రుక్మిణి.

## 5

"గెడ్డం బాగా గీశావోయ్" అని మెచ్చుకున్నాడతను.

"ఎప్పుడూ అంతేనండి" అన్నాడు గర్వంగా మంగలి.

"మంచిది - వస్తాను..." అంటూ అతను అక్కణ్ణించి కదలబోయాడు.

"డబ్బులు" అన్నాడు మంగలి తటపటాయిస్తూ.

"అదుగో ఆ పక్క కుర్చీలో కూర్చున్నాయనే నాకూ ఇచ్చేస్తాడు డబ్బులు" అంటూ షాపులో గెడ్డం గీయించుకుంటున్న మరో వ్యక్తిని చూపించాడు ఆ వ్యక్తి.

"అయితే ఒక్క నిముషమాగండి" అంటూ ఆ పక్క కుర్చీలో అతని దగ్గరకు వెళ్ళి—"మీరు ఇద్దరికి డబ్బు లిస్తారా?" అనడిగాడు.

"నేనెందుకిస్తాను?" అన్నాడతను గెడ్డం గీయించు కుంటూనే.

"అలాగంటారేమిటి రమణమూర్తిగారూ!" అంటూ ఆ వ్యక్తి అతన్ని సమీపించాడు.

గెడ్డం గీయించుకుంటున్న రమణమూర్తి మంగలిని ఆగమని చెప్పి ఆ వ్యక్తి వంక తీవ్రంగా చూసి—"ఎవరు నాయనా నువ్వు? నన్నెరిగినట్లే పిలుస్తున్నావ్—" అన్నాడు.

"ఎంత తెలిసినవారు కాకపోతే—గెడ్డానికి మిమ్మల్ని డబ్బులిమ్మంటాను?" అన్నాడా వ్యక్తి.

రమణమూర్తి తడబడి—"అనడందాకా బాగానే వుంది, నేనివ్వద్దూ" అన్నాడు.

"ఎందుకివ్వరూ" అన్నాడు ఆ వ్యక్తి.

"ఎందుకివ్వాలి?"

ఆ వ్యక్తి స్వరం తగ్గించి "ఇస్తే లాభముంటుంది" అన్నాడు.

"ఏమిటా లాభం?"

"సీతాపతి తెలుసా మీకు?"

హఠాత్తుగా రమణమూర్తి ముఖం మారిపోయింది. కాస్త కంగారుకూడా ఆయనముఖంలో కనబడింది "తెలిస్తే ఏం?" అన్నాడు.

"మీకు నేనతన్ని చూపిస్తాను" అన్నాడు నెమ్మదిగా ఆ వ్యక్తి.

"గడ్డం గీసేయవోయ్—" అన్నాడు రమణమూర్తి ఉన్నట్లుండి. అదయ్యాక ఆయన యిద్దరికీ తనే డబ్బులు యిచ్చేశాడు.

ఇద్దరూ బయటకు వచ్చేక—"సీతాపతి నీకెలా తెలుసు?" అనడిగాడు రమణమూర్తి ఆ వ్యక్తిని.

"ఎలా తెలిస్తే మీ కెందుకు? అతన్ని మీకు చూపిస్తాను నేను..."

"ఎక్కడున్నాడు సీతాపతి..."

"అతన్ని చూపిద్దామనే మీ ఇంటికి వెళ్ళాను. మీ రింట్లో లేరనీ మంగలిషాపుకు వెళ్ళారనీ తెలిసింది. నేను వచ్చేసరికి మీరు మంగలిషాపులో కూర్చుని వున్నారు. నేనూ మీ పక్కనే కూర్చున్నాను. ఆలశ్యముందని కాఫీ తాగడానికి బైటకు వెళ్ళారు మీరు. ఈలోగా నేను గడ్డం గీయించేసుకున్నాను. నేను మధ్యలో వుండగా మీరు వచ్చారు. మీవల్ల మంచి ప్రతిఫలముంటుందని తెలిసిన కారణంగా జేబులో పైసా లేకుండా బయల్దేరాను..."

"సరే—నీకు నేనెలా తెలుసు?"

"తెలియకపోవడమేమిటండీ—ప్రతిరోజూ సీతాపతి ఆచూకీకోసం మీరు ప్రయత్నిస్తున్నారనీ — ఆచూకీ తెలిపిన వారి కెంత డబ్బయినా ఇవ్వడానికి సిద్ధంగా వున్నారనీ నిన్ననే ఆయన నాకు చెప్పాడు."

"అయితే ఎక్కడున్నాడు సీతాపతి?"

"కాస్త మీ ఇంటికి తీసుకువెళ్ళి కమ్మని కాఫీ ఇప్పించండి. అక్కడే స్నానపానాదులు ముగించుకున్నాక మనమిద్దరం కలిసి సీతాపతిని చూడ్డానికి వెడదాం..." అన్నాడా వ్యక్తి.

"ఇంతకీ నీ పేరు."

"కొండల్రావు."

రమణమూర్తి, కొండల్రావు కలిసి—రమణమూర్తి ఇంటికి వెళ్ళారు. రమణమూర్తి తలుపు తట్టాడు. తలుపులు తెరుచుకున్నాయి. ఎవరో అపరిచితవ్యక్తి వచ్చి తలుపు తీశాడు.

"ఎవరండీ మీరు?" అన్నాడాశ్చర్యంగా రమణమూర్తి.

"లోపలకురండి-చెబుతాను" అన్నాడా అపరిచితుడు.

రమణమూర్తితోపాటు కొండల్రావుకూడా లోపల ప్రవేశించాడు. కొండల్రావు మళ్ళీ తలుపులు తనే మూసి-"అయనే సీతాపతి..." అన్నాడు.

రమణమూర్తి ఉలిక్కిపడ్డాడు. ఆయనకు ముందడుగు పడలేదు.

# 6

"ఏమిటో—ఆడపిల్లని కన్నామనేగానీ ఓ అచ్చటా ముచ్చటా తీరడంలేదు" అంది రుక్మిణి టెలిగ్రాం భర్తకు చూపిస్తూ.

దశరథరామయ్య బాధగా నిట్టూర్చి — "అమ్మాయి పెద్దమనిషయిందనగానే అచ్చట ముచ్చట్లు గురించి నువ్వాలోచిస్తున్నావ్. వాటికెలాగూ ఏలోటూ రాదు. ఇంకోగంటలో మనం బయల్దేరి వెడదాం. అన్ని సరదాలూ దగ్గరుండి జరిపించుకువద్దాం. కానీ నా అసలు బెంగ నీ కర్థంకాదు" అన్నాడు.

"బాగుందండీ-ఇంక దానికి వరుణ్ణి చూడాలనేగదా మీకు బాధ-దానికేం, బంగారంలాంటి మొగుడు దొరుకుతాడు. మనకేమన్నా లేదా పోగా..."

"అది కాదులే నా బాధ..."

"మరి..."

"అది సరే_శ్యామల సంగతి ఆలోచించావా?"

"ఆలోచించడానికేముందండీ_చిన్నప్పట్నించీ అనుకున్నదే కదా_ఆ పిల్ల తలిదండ్రులు చాలా పట్టుదలగా వున్నారు. మన పెద్దాడికీ ఆ పిల్లకీ ఈడూ జోడూ కూడా బ్రహ్మాండంగా వుంటుంది..."

అన్నీ బాగానే వున్నాయి. కానీ..."

"కానీ ఏంటండీ — అన్నిమాటలూ అయిపోయాయి కదా..."

"అదే కదే నా బాధ..."

"సంబంధం నిశ్చయమైతే బాధ ఎందుకండీ..."

"బాధ ఎందుకంటావా_సుబ్బారావు తెలుసా నీకు?"

"ఏ సుబ్బారావు_మీకూ నాకూ తెలియనివాడేనా?"

"వాడే—వాడు శ్యామలను ప్రేమించాడుట."

"ఏడవలేకపోయాను."

"ఏడవలేకపోవడం సంగతెలాగున్నా—వాడు మనని ఏడిపిస్తున్నాడు."

"ఏమని—?"

"శ్యామల పెళ్ళి తనతో జరగకపోతే నన్ను చంపుతానని."

"ఏమన్నారూ?" అంది రుక్మిణి.

"నన్ను చంపుతాట్ట."

"చంపితే చూస్తూ ఊరుకుంటారా?"

"ఊరుకోవడం మాటెలాగున్నా నేను చావడం ఖాయం. ఎందుకంటే..."

"చెప్పండి!"

"వాడు సీతాపతి పంపగా వచ్చాడు. నన్ను చంపడం వాడి డ్యూటీ. శ్యామలను వాడికిచ్చి చేయగలిగితే— వాడు నన్ను వదిలేస్తాడు. సీతాపతికి వాడెలాగో నచ్చ చెప్పుకుంటాడు...ఆ విధంగా నేను రక్షించబడతాను..."

రుక్మిణి భర్తవంక ఆశ్చర్యంగా చూసి–"మీరు మరీ ఆడదానిలా భయపడిపోతున్నారు. వాడు చంపుతాను, చంపుతానని అదేపనిగా బహిరంగంగా బెదిరిస్తూంటే— భయపడిపోవడానికిక్కడ ఎవరూ గాజులు తొడిగించుకుని లేరు...అని వాడితో తెగేసి చెప్పలేకపోయారా?" అంది.

"అసలు సంగతి తెలియదు నీకు. వాడు నన్ను చంపే పద్ధతి వేరు. వాడికేవిధంగానూ ప్రమాదంలేని పద్ధతి అది. వాడిని మనమేమీ చేయలేని అసహాయదశమన కేర్పడుతుంది. స్లోపాయిజన్ కంటె దారుణంగా శరీరాన్ని దహించగల పద్ధతి సీతాపతికుంది."

"ఎవరండీ ఆ సీతాపతి — ఎందుకు వాడికి మీమీద పగ!"

"అది నీకు నేను వివరించి చెప్పలేను."

"చెప్పాల్సిందే" పట్టుదలగా అంది రుక్మిణి.

"మనకి టైమవుతోంది. తొందరగా పెట్టె సర్దు. ఈ బస్సు మిస్సయిందంటే మళ్ళీ ఇప్పట్లో బస్సు లేదు." అన్నాడు దశరథరామయ్య.

రుక్మిణి హడావుడిగా లోపలకు పరుగెత్తింది.

# 7

"ఏమండీ—మీరు దశరథరామయ్యగారితో మాట్లాడేరా?" అంది విమల.

"ఏం మాట్లాడాలే" అన్నాడు చిరాగ్గా కృష్ణారావు.

"బాగుందండీ_ఆడపిల్ల గలవాళ్ళం."

"ఓహో_అదా_దండకం విప్పడు కానీ_అది సెటిలై పోయిన సంబంధమేగదా. దానికి మళ్ళీ మాటలెందుకూ."

"చాలా బాగుందండీ _ మాటల్లేకుండా పెళ్ళిదానంతటది జరిగిపోతుందా?" అంది విమల.

"జరగదు. కానీ ఒకసారి మాటలైపోయాక ఆ పెళ్ళి ఆగదుకూడా."

"ఆగదు_సరే_కానీ ఒక తేదీ అనీ, ముహూర్తమనీ నిశ్చయించేక గదా."

"ఆ సంగతి దశరథరామయ్యగా రెప్పుడో స్పష్టం చేశారు. వాళ్ళబ్బాయి థీసిస్ సబ్మిట్ చేసేదాకా పెళ్ళి మాటే లేదు."

"ఆ సంగతి నాకూ గుర్తుందండీ. కానీ ఇటీవల అమ్మాయి ప్రవర్తనచూస్తే నాకు కాస్త భయంగా వుంది."

"ఏం_ఏమయింది?" అన్నాడు కృష్ణారావు ఆత్రుతగా.

"ఏమీ లేదు. ఇంటికి బాగా ఆలశ్యంగా వస్తుంది. ఏమని అడిగితే సరైన కారణం చెప్పదు. మనిషిమటుకు చాలా ఉత్సాహంగా కనబడుతుంది. రాత్రిళ్ళు నిద్దర్లో కుండా మధ్యలో లేచి కూర్చుంటుంది. చదువుమీద శ్రద్ధ కాస్త తగ్గినట్లే అనిపిస్తుంది."

"అయితే ఏమంటావ్?"

"చాలాసార్లు అమ్మాయి తనకో స్నేహితురాలున్నదనీ తనంటే ప్రాణమిస్తుందనీ తనతో తిరగడంవల్లనే తన కాలశ్యమవుతున్నదనీ నాతో సంజాయిషీగా చెప్పేకుంది.

అది చాలాకాలం నమ్మాను కానీ ఇప్పుడిప్పుడే నాకో అనుమానం కలుగుతోంది."

"ఏమిటది?"

"అది తిరుగుతున్న మనిషి స్నేహితురాలు కాదు, స్నేహితుడు అని."

"ఏమన్నావ్?"

"ఏమంటే యేం లెండి కానీ — దశరథరామయ్య గారితో త్వరగా పెళ్ళిమాటలు మాట్లాడండి."

కృష్ణారావు ఆలోచనలో పడి—"ఇంతకీ అమ్మాయింకా ఇంటికి రాలేదుకదూ?" అన్నాడు. ఆయన చేతి వాచీ తొమ్మిదింపావయింది.

"కాలేజీ అయిదు లోపులోనే వదిలేస్తారు. ఈ రోజు ఆలశ్యమవుతుందని అది చెప్పనే చెప్పిందిలెండి. తన స్నేహితురాలితో సినిమాకు వెడుతుందిట."

కృష్ణారావు భ్రుకుటి ముడతలుపడింది — "రాత్రి తొమ్మిదివరకూ స్నేహితురాలితో కాలక్షేపమా? ఇలా ఇప్పటికి ఎన్నిసార్లు జరిగి వుంటుంది?"

"తెలుసుకుని ఏం చేస్తారండీ-నేను చెప్పినట్లు చేయండి. దశరథ..."

"అలాగేకానీ— ఈరోజు ఆ స్నేహితురాలికథ తేలుస్తాను." అన్నాడు కృష్ణారావు.

"మన అనుమానాలకో రూపాన్నిచ్చి పిల్లదాన్ని మందలించారంటే—అబద్ధం నిజమైపోగలదు. మీ రావేశపడిపోకండి. పెళ్ళి సంగతి చూస్తారని ఈ విషయం చెప్పాను గానీ—లేకపోతే ఇందులో జరిగిపోయే ప్రమాదమేమీ లేదని నాకు తెలుసును. మన పిల్లమీద నాకా నమ్మకముంది" అంది విమల.

# 8

"సీతాపతి లోపలే వున్నాడని నువ్వు నాకు చెప్ప లేదు" అన్నాడు రమణమూర్తి తడబడుతూ.

"సీతాపతి చెప్పొద్దన్నాడు. మిమ్మల్ని అర్జంటుగా వెంటబెట్టుకు రమ్మన్నాడు" అన్నాడు కొండర్రావు.

రమణమూర్తి ముఖం పాలిపోయింది.

"నన్ను చాలాకాలంగా ఎరుగుదువు. కాని చూడ్డం ఇదే ప్రథమమనుకుంటాను" అన్నాడు సీతాపతి.

"అవును. కానీ ఇప్పుడెందుకొచ్చావు?"

"ఆ విషయం నీకెన్నో ఉత్తరాల్లో వివరించి వున్నాను. మళ్ళీ చెప్పాలా?"

"వద్దు—" అన్నాడు రమణమూర్తి భయంగా. ఆ విషయం తలుచుకునేందుకుకూడా భయంగా ఉన్నదని అతని ముఖం చూస్తేనే తెలుస్తుంది.

"పద- లోపలకు..." అన్నాడు సీతాపతి. రమణ మూర్తి, కొండర్రావు సీతాపతిని అనుసరించారు. ఆ గదిలో.......

రమణమూర్తి భార్య, ఆయన కూతురు పధ్దెనిమిదేళ్ళ సుమతి, కొడుకు పధ్నాలుగేళ్ళ శేఖర్ కాళ్ళూ చేతులూ కట్టివేయబడి, నోట్లో గుడ్డలు కుక్కబడి ఉన్నారు.

"ఇది ప్రెజంట్ సిట్యుయేషన్ ..." అన్నాడు సీతాపతి.

"సీతాపతి - నన్ను క్షమించు. జరిగినదేదో జరిగి పోయింది. మళ్ళీ జీవితంలో అలాంటి పొరపాటు చేయ లేదు. నువ్వు తలపెట్టిన ఘోరం తలచుకుంటేనే నేను

వణికిపోతున్నాను. నేను చేసిన తప్పుకి ఇంకొకరిని శిక్షించడం చాలా అన్యాయం.''

''అలా వణికిపోకు రమణమూర్తీ! అందుకే తప్పుచేసే ముందు బాగా ఆలోచించాలి. ఆ తప్పువల్ల రానున్న అన్ని దుష్ఫలితాలనూ అనుభవించడానికి సిద్ధపడాలి. నీ తప్పుకు ఇంకొకర్ని శిక్షించడం అన్యాయమంటున్నావు.

కానీ నువ్వు నాకు చేసిన అన్యాయమంటూ ఏమీ లేదు. ఇంకొకరికి చేసిన అన్యాయం నన్ను బాధపెట్టి ప్రతీకారానికి పురిగొల్పింది. అలాగే నేను శిక్షించేదింకొకరిని అయినప్పటికీ, అది నిన్నూ బాధపెడుతుందని నాకు తెలుసు. అందుకోసం ఒకటికాదు, రెండుకాదు— పదిహేను సంవత్సరాలకుపైగా వేచాను. నా ప్రతీకారం ఇంతకాలానికి పరిణతికి వచ్చింది. ఇంక నన్ను బ్రహ్మరుద్రాదులుకూడా ఆపలేరు.

నేను తప్పు చేస్తున్నానని అనుకోవడంలేదు. ఈ పని సక్రమంగా నెరవేరడంకోసం దేవుణ్ణి ఎంతగానో ప్రార్థించాను. దైవానుగ్రహంవల్ల నా కోరిక ఈడేరులోంది. నేను చేసేది అన్యాయమే అయితే ఈ క్రియను భగవంతుడే ఆపుతాడు'' అని సీతాపతి క్షణం ఆగాడు.

రమణమూర్తి అప్పుడప్పుడే కలయబడడానికి ప్రయత్నిస్తున్నాడని గ్రహించి సీతాపతి చటుక్కున జేబులోంచి రివాల్వర్ తీసి గురిపెట్టి—''పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యవద్దు'' అన్నాడు.

రమణమూర్తి వున్నవాడున్నట్లు కదలకుండా నిలబడిపోయాడు. కొండల్రావు అతన్నికూడా బంధించి నోట్లో గుడ్డలు కుక్కాడు.

సీతాపతి ఈ పర్యాయం రమణమూర్తి కుటుంబంవైపు తిరిగి—"మీ ముగ్గురికీ అతి ముఖ్యబంధువు అయిన ఈ రమణ మూర్తి అనబడే దుర్మార్గుడి పూర్వకథ మీరు కొంచెం తెలుసుకోవాల్సి వుంది. అప్పుడు నేను ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నానో అర్థం చేసుకోగలుగుతారు." అని ఆగాడు. అతని కంఠంలో కొద్దిగా విషాదం చోటు చేసుకుంది.

"నాకో కూతురుండేది. దాని పేరు రమ. దానికి నేనూ, నాకు అదీ తప్ప ఎవ్వరూ లేరు. ప్రాణానికి ప్రాణంలా పెంచాను దానిని. దానికి పద్దెనిమిదేళ్ళ వయసు రాగానే పెళ్ళి చేయాలనుకున్నాను.

అయితే వయసు దాన్ని మోసం చేసింది. ఒక దుర్మార్గుడి వలలోపడి అది గర్భవతయ్యింది. తను గర్భవతి నని తెలియగానే అది ఆ దుర్మార్గుణ్ణి పెళ్ళికి ఒత్తిడి చేసింది. వాడు తోకముడిచి పారిపోయాడు. గత్యంతరం కానక—నాకు ముఖం చూపించలేక అది ఆత్మహత్యకు పాల్పడింది.

అయితే అప్పుడు దాన్నో వ్యక్తి కాపాడాడు. ఆత్మ హత్య మహాపాతకమన్నాడు. అంతకంటే మహాపాతకం తను చేశానని అది అనగా—వివరాలడిగి తెలుసుకుని దాన్ని తనతో వచ్చేయమనీ తనే దానికో మంచిదారి చూపిస్తాననీ అన్నాడు. తనకింకేదారీ అవసరంలేదని రమ అంటే—

'నువ్వు చేసింది తప్పేమీ కాదు. నీ అంతమంచిదాన్ని, అందమైనదాన్ని పెళ్ళి చేసుకోవడం నా అదృష్టంగా భావిస్తాను. నీ ఇంట్లో వాళ్ళకు చెప్పకుండా నాతో వచ్చే

సేయ్. నీ కడుపులోని బిడ్డ బయటకు వచ్చేవరకూ మనం రహస్యంగా ఎక్కడైనా గడుపుదాం. ఆ తర్వాత ఆ శిశువునే మన శిశువుగా ప్రపంచానికి ప్రకటించుదాం. ఎన్నో నెలలో బిడ్డపుట్టిందని ఎవ్వరూ అడగరప్పుడు. ధైర్యంగా మన బంధువులందర్నీ మనమప్పుడు కలుసుకో వచ్చు' అన్నాడా వ్యక్తి.

రమ నమ్మి అతనితో వెళ్ళిపోయింది. వెళ్ళేముందు నాకో చీటీపెట్టి—జరిగినది తెలియబరచింది. నాకు సగం దుఃఖమూ, సగం సంతోషమూ కలిగాయి. అలా నా రమను తీసుకువెళ్ళిన వ్యక్తి పేరు రమణమూర్తి. ప్రస్తుతం మీ ఎదురుగా మీ ముఖ్యబంధువుగా నిలబడి వున్నాడు" అని మళ్ళీ మరోక్షణం ఆగాడు సీతాపతి—

నా కూతురు కొద్ది నెలల్లో ఒడిలో బిడ్డతో, సరసన భర్తతో తిరిగి వస్తుందని వేయికళ్ళతో ఎదురుచూసాను. అలా ఎదురుచూసిన నాకు జవాబుగా ఓ ఉత్తరంవచ్చింది. అది నా కూతురే రాసింది.

"నాన్నా మరోసారి జీవితంలో మోసపోయాను. నన్ను పెళ్ళాడతానన్న వాడికి ఎప్పుడో పెళ్ళయి పోయింది. వాడికో రెండుమూడేళ్ళ పాపకూడావుంది. వాడు ప్రస్తుతం నన్ను వేశ్యాగృహానికి అమ్మే ప్రయత్నంలో ఉన్నాడు. కాని అందుకు నేను మిగిలి ఉండేకదా. మళ్ళీ నేను మిమ్మల్ని చూడలేను. ఏ మాత్రం వీలుపడినా వాడికి బుద్ధివచ్చేలా తగిన రీతిగా ప్రతీకారం తీర్చుకోండి. వాడి చిరునామా యిక్కడ పొందుపరుస్తున్నాను."

అని రాసిందది. అలాంటుత్తరం చూస్తే ఏ కన్న తండ్రికయినా గుండె చెరువయిపోతుంది. అప్పట్నించీ నా గుండె పగతో సెగలు కక్కుతోంది. పదిహేనేళ్ళ తరువాత ఇప్పటికి నాకు అవకాశం వచ్చింది. ప్రతీకారం తీర్చుకోక మానలేను'' అన్నాడు సీతాపతి.

''సీతాపతీ!'' అన్నాడు రమణమూర్తి. అంతకుమించి ఆయన నోటమ్మట మరేమాటా రాలేదు.

''కొండల్రావ్!'' అన్నాడు సీతాపతి—''శేఖర్నీ, అతని తల్లినీ ఈ గదిలోంచి తప్పించి, ఇంకో గదిలో వదిలేసిరా—ఎత్తుకుని తీసుకువెళ్ళాలిమరి— యెందుకంటే వాళ్ళు బందీలుకదా—''

కొండల్రావ్ ఆ పనికి ఉపక్రమించగానే ''సిద్ధంగా ఉండు రమణమూర్తీ. జరగబోయేది కళ్ళారా చూద్దువు గాని'' అన్నాడు సీతాపతి.

## 9

''ఏమండీ ఇలాగైతే ఎలాగండీ'' అంది భర్త ఇంట్లో అడుగుపెట్టగానే రుక్మిణి.

''ఏం జరిగిందేమిటి?''

''ఆ సుబ్బారావు మనింటికొచ్చాడండీ...''

''వస్తే-ఏం జరిగింది?''

''దేనికైనా వాణ్ణి అడ్డుపెట్టకద్దని మీరే చెప్పారు కదా—''

''అవునూ...ఏం చేశాడు వాడు?''

''అవ్వ—చెప్పుకుంటే సిగ్గు'' అని ఆగిపోయింది రుక్మిణి. ఆవిడ ముఖంలో సిగ్గుకు బదులు—భయమూ, బాధ కనపడ్డాయి.

"ఫరవాలేదు నీ మొగుణ్నేగా చెప్పు!" అన్నాడు దశరథరామయ్య చిలిపిగా.

"వాడు మన వాణి చేయి పట్టుకున్నాడండీ."

దశరథరామయ్య ముఖంలో చిలిపితనం మాయమైంది- "పట్టుకుని" అన్నాడు.

"పట్టుకుని ..పట్టుకుని" క్షణం తటపటాయించి— "ఒక్కసారి...అని నెమ్మదిగా అన్నాడుటండీ" అంది రుక్మిణి.

దశరథరామయ్య ముఖంలో కోపం స్పష్టంగా కనబడింది—"అంతమాటంటే చూస్తూ ఊరుకున్నావా?" అన్నాడు.

"లేదండీ నా ఎదురుగానే అంతమాటంటే నాకు ఒళ్లు తెలియలేదు. మీ హెచ్చరికకూడా మరిచిపోయి వాణ్ని నానా మాటలూ అన్నాను. వాడు అన్నీ మౌనంగా విని నా వంతు కాగానే "నేనేమీ తప్పు చేయలేదు. కావాలంటే దశరథరామయ్యనే అడుగు. నువ్వుమాత్రం అనవసరంగా నన్ను తిట్టావు. జరిగింది మీ ఆయనకు చెప్పు. ఆయనే నా దగ్గరకు వచ్చి తప్పుకు క్షమించమనీ—తన కూతుర్ని అనుగ్రహించమనీ వేడుకుంటాడు. అప్పుడే వస్తాను మళ్ళీ" అని వెళ్ళిపోయాడు" అంది రుక్మిణి.

దశరథరామయ్య ముఖం పాలిపోయిందని రుక్మిణి చూస్తూనే గ్రహించింది. "అలా అన్నాడా అయితే నేననుకున్నంతా అయిందన్నమాట" అన్నాడాయన.

"ఏమిటండీ మీరనుకున్నది" అంది రుక్మిణి.

"వాడు త్తినే వెళ్ళిపోలేదే నాకో ఆర్డరు వేసి వెళ్ళిపోయాడు. నేనిప్పుడు నా కూతుర్ని వాడికి అప్పగించాలన్న మాట."

"బాగుంది. వాడు చెప్పగానే మనం చేసేస్తామా?"

"రుక్మిణీ నీకు తెలియదు నా బాధ. అందుకే ఎంత గానో చెప్పాను నీకు. దాన్నక్కడకు తీసుకురావద్దని. కన్న కూతురిమీద నాకు మాత్రం మమకారముండదా— అయినా దాన్ని వేరే ఊళ్ళో పెట్టి ఎందుకు చదివిస్తున్నాననుకున్నావ్?" అన్నాడు దశరథరామయ్య.

"ఇదింకా బాగుంది. మనం మనుషులమధ్య మసలుతున్నామా లేక రాక్షసులమధ్య ఉంటున్నామా? మన కూతుర్ని మనింట్లో ఉంచుకోడానికి భయపడాలా?"

"భయపడొద్దు. జరిగేదానికి సిద్ధపడు."

"ఏమిటండీ జరిగేది?"

"అమ్మాయెక్కడుంది?"

"గదిలో ఒక్కర్తీ కూర్చుని ఉంది. ఏడుస్తోందది."

"నేను వెళ్ళి అమ్మాయితో కాసేపు మాట్లాడతాను."

"ఏం మాట్లాడతారు!"

"ఏ తండ్రీ ఇంతవరకూ తన కూతురితో చేసి వుండని సంభాషణ చేయడానికి వెడుతున్నాను. అది నా దురదృష్టం" అన్నాడు దశరథరామయ్య.

రుక్మిణి మ్రాన్పడిపోయింది!

## 10

"వాళ్ళిద్దర్నీ పక్క గదిలో వదిలాను" అన్నాడు కొండల్రావు.

"బంధాలు సడిలేలా లేవుకదా!" అన్నాడు సీతాపతి.

"మళ్ళీ బిగించాను."

"అయితే తలుపులు వేసేయ్."

కొండల్రావు తలుపులు వేసేశాడు.

"ఇలారా ఈ పిల్ల కట్లు విప్పు" అన్నాడు సీతాపతి. కొండల్రావు కట్లు విప్పగానే సుమతి లేచి బెదురు బెదురుగా నిలబడింది.

"కొండల్రావ్! నేనాపిల్ల ముఖంలోకి చూడను. చూస్తే నా మనసు మళ్ళీ మారిపోవచ్చు. నా రివాల్వర్ ఆ పిల్లవైపే గురిపెట్టబడి వుంది. అరిచినా, కిక్కురుమన్నా రివాల్వర్ పేలిపోతుంది. కట్లు విప్పిన ఆ చేత్తోనే ముందా అమ్మాయి కట్టుబట్టలుకూడా విప్పేసేయ్. ఆ తర్వాత ఇంక నేనేమీ చెప్పనక్కర్లేదు. రివాల్వర్ ఎదుట వుండగా కన్నెపిల్లకు మానాభిమానాలు గుర్తుండవు సీతాపతి."

"సీతాపతీ!" అంటూ అరిచాడు రమణమూర్తి.

"అరవకు. అరిస్తే ముందు నీ కూతురు హింసించబడుతుంది. ఆ హింస నువ్వు చూడలేవు. నోరు మూసుకుని ఊరుకోవడమే నీకు శ్రేయస్కరం."

"ఇది చాలా అన్యాయం సీతాపతీ!"

"న్యాయాన్యాయాల ప్రసక్తి లేదు నాకు. నా పగ ఒక్కటే నాకు తెలిసింది. నా కన్న కూతురికి జరిగిన అన్యాయం నీకు కలకాలం గుర్తుండడానికిదే మార్గం. నా కడుపుకోత నీకు అర్థంకావడానికింతకంటె మంచిమార్గం లేదు" అన్నాడు సీతాపతి.

"మీ మగవాళ్ళ పగలమధ్య రెండుసార్లూ నష్టపోయినది ఆడవారే!" అంది సుమతి. వివస్త్రగా నిలబడిన ఆమెకు గత్యంతరంకూడా తోచడంలేదు.

"అవును. నిజమే—కానీ మగవాడు తన నేరాలనూ, పరువునూకూడా ఆడదానితో ముడిపెట్టాడు. ఇంక

నువ్వేమీ మాట్లాడకు. నువ్వు చేయగలిగిందేమీ లేదు. వచ్చే జన్మలోనైనా ఒక మంచి తండ్రి నియ్యమని దేవుణ్ణి ప్రార్థించుకో. ఈ ప్రపంచాన్ని మగవాడు కాక ఆడది శాసించే రోజులు రావాలని కోరుకో. ఏమైనా మనను లోనే జరగాలి. పైకి నోరు మెదిపినా ఈ విధంగానే నడి వీధిలో నిన్ను నిలబెట్టగలను'' అన్నాడు సీతాపతి ఆమె వైపు చూడకుండా.

ఆ తర్వాత సుమతి మాట వినబడలేదు.

''రమణమూర్తీ! నీ కళ్ళముందే జరుగుతున్న ఈ సంఘటనను జీవితాంతం తల్చుకుని కుమిలి కుమిలి చావు'' అన్నాడు సీతాపతి. ''నిన్ను నేను హత్యచేయాలనుకున్న పద్ధతి ఇదే...''

రమణమూర్తి మాట్లాడలేదు.

''పెళ్ళి కాకుండా నీ కూతురు గర్భవతి కావాలన్నది నా ఆశయం. అవసరమైతే అందుకురించి మళ్ళీమళ్ళీ వస్తాను—కొండ్రలావుని తీసుకుని. నీ కూతురు గర్భవతి అయ్యేవరకూ నిన్ను నీడలా వెన్నాడుతూనే వుంటాను. గర్భవిచ్ఛిత్తికి రహస్య ప్రయత్నాలు చేశావా — ఆ డాక్టర్ని నిన్నూకూడా...'' అని ఆగి—''ఏం చేస్తానో చెప్పక్కర్లేదు కదా ఏ మగవాడికీ తన భార్యాబిడ్డలు నడి వీధిలో అవమానం పాలుపోవడం ఇష్టముండదు మరి—'' అన్నాడు సీతాపతి.

# 11

''నేను సీతాపతి మనిషినని గుర్తుందికదా'' అన్నాడు సుబ్బారావు.

''గుర్తుంది కానీ నువ్వు పదేపదే గుర్తుచేయవద్దు. నా గుండెలదురుతున్నాయి.'' అన్నాడు దశరథరామయ్య.

"గుర్తుచేయడం నాకు సరదాకాదు. ఆ అవసరం నువ్వే కల్పిస్తున్నావు."

"కల్పించను కానీ ఈ గండంనుంచి గడిచి బయటపడే ఉపాయం నువ్వే చెప్పాలి."

"చెప్పానుగా."

"ఆ ప్రయత్నాల్లోనే వున్నాను. నీ పెళ్ళి తప్పకుండా శ్యామలతో జరుగుతుంది. కానీ ఆ పెళ్ళి జరిగేక నువ్వు సీతాపతిని వెంటబెట్టుకుని వస్తే..."

"రానని చెప్పానుగా."

"గ్యారంటీ ఇవ్వాలి."

"గ్యారంటీలిచ్చే అలవాటు నాకు లేదు. నన్ను నమ్మాల్సిందే. నమ్మకపోతే నీ కర్మ." అన్నాడు సుబ్బారావు.

"అలా అనేయకూ. కన్నకడుపు బాధ నీకు అర్థం కాదు. ఎలాగో అలా నన్ను నువ్వు రక్షించాలి."

"ప్రస్తుతానికి నేనింక నీతో మాట్లాడను. రెండు రోజుల్లో నా పెళ్ళి నిశ్చయం కావాలి. లేకపోతే నీ ముహూర్తం నిశ్చయమైపోతుంది" అని సుబ్బారావు అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

"రుక్మిణీ" అంటూ పిలిచాడు దశరథరామయ్య.

"అన్నీ విన్నాను" అంటూ పక్కగదిలోంచి వచ్చింది రుక్మిణి.

భార్యాభర్తలిద్దరూ చాలాసేపు తర్జనభర్జనలు చేశారు. ఏం చేయాలని ఆలోచించారు. చివరకు ఎలాగో అలాగ సుబ్బారావుకు శ్యామలను కుదర్చాలని ఇద్దరూ నిశ్చయించుకున్నారు.

భార్యా భర్తలిద్దరూ ఏకాభిప్రాయానికి వచ్చేక ఇద్దరూ కలిసి కృష్ణారావు ఇంటికి వెళ్ళారు. వీళ్ళ ప్రతిపాదన వింటూనే కృష్ణారావు తెల్లబోయాడు.

"మాటలన్నీ అయిపోయేక మీ రిప్పుడిలాగనడం ఏమీ బాగాలేదు" అన్నాడు కృష్ణారావు.

"బాగాలేకపోవడాని కేముందండీ ఇందులో—మీ అమ్మాయి పెళ్ళి ఆగిపోవడం లేదుకదా. అన్ని ఖర్చులూ భరించి నే నేమీ అమ్మాయి పెళ్ళి చేస్తాను. మీ అమ్మాయి కూడా మెచ్చుకునే వరుణ్ణే నేను తీసుకువస్తాను. మీ కళ్ళముందే మీ అమ్మాయి సుఖంగా కాపురం చేసుకుంటూంటే చూస్తారు. అన్నింటికీ నేను హామీ" అన్నాడు దశరథరామయ్య.

"ఇంతకీ వరుడెవరు?" అంది విమల.

కృష్ణారావు చిరాగ్గా భార్యవంక చూసి "బావగారేదో వేలమాడుతూంటే నువ్వు వరుడెవరని అడిగేదాకా వచ్చేశావు. అమ్మాయిని నా కంఠంలో ప్రాణముండగా దశరథరామయ్యగారబ్బాయికి తప్ప మరొకరికివ్వను." అన్నాడు.

"అలాగనకండి. ఈ సంబంధం చేసుకుంటే నా కంఠంలో ప్రాణముండదు" అన్నాడు దశరథరామయ్య.

"ఏమిటయింది?"

"మీ దగ్గర దాపరికమెందుకు? నామీద ఒక వ్యక్తి పగబట్టాడు. అతని పేరు సీతాపతి. అతనెవరో ఎందుకు నామీద పగబట్టాడో నాకు తెలియదు. అతను సుబ్బారావు అనే వ్యక్తిని నామీద ప్రయోగించాడు. వాడు చంపుతానని నా చుట్టూ తిరుగుతూ బెదిరిస్తున్నాడు."

"సుబ్బారావు కథ నా ఎదురుగా జరిగిందేకదా-దాన్ని మీరు సీరియస్ గా తీసుకున్నారా?" అన్నాడు కృష్ణారావు.

"తీసుకోక తప్పదు. అన్న ప్రకారం సీతాపతి ఒకరిపైన పగతీర్చుకున్నాడు. ఆ విషయం నాకు తెలియబర్చాడు కూడా. అనుమానాలుంటే వెళ్ళి తీర్చుకోమనీ ఇంక నా వంతు రానున్నదనీ తెలియబర్చాడు. నేనా వ్యక్తిని కలుసుకున్నాను. మీకు వివరాలన్నీ చెప్పలేను కానీ సీతాపతి ఏ కారణంగానో నామీదకూడా పగ బట్టాడు. భయంకరమైన పద్ధతిలో ఆ పగ తీర్చుకునే ఉద్దేశ్యంలో వున్నాడు. ఈ విషయంలో నన్ను రక్షించ గలవాడా సుబ్బారావు ఒక్కడే! సీతాపతినికూడా తను మభ్యపెట్టగలనని సుబ్బారావు అన్నాడు. అయితే అందుకు ప్రతిఫలంగా అతను నన్నో కోరిక కోరాడు."

"ఏమిటది?"

"శ్యామలను తనకిచ్చి పెళ్ళి చేయాలట."

కృష్ణారావు ఉలిక్కిపడి, "సరి సరి-ఇదా సంగతి. ఆ సుబ్బారావు పిచ్చివాడేనా అయుండాలి. పచ్చిరౌడీ అయినా అయుండాలి. అలాంటివాడికి ఏ పరిస్థితుల్లోనూ నా కూతుర్నివ్వడం జరగదు" అన్నాడు.

"సుబ్బారావు ప్రవర్తన గురించి నేను హామీ ఇస్తాను" అన్నాడు దశరథరామయ్య.

"వాడు నిన్ను చంపకుండా ఉండడంకోసం-అంతే కదా" అన్నాడు కృష్ణారావు అనాకలా నవ్వి.

"అంతా అయోమయంగా వుంది" అంది విమల.

ఆ వుత్తరం ఆ రోజే పోస్టులో వచ్చింది. ఏం చేయాలో తోచక ఆయన ఆ వుత్తరాన్నే మళ్ళీ మళ్ళీ చదువు కుంటున్నాడు.

ఆయన అలా ఆలోచనలతో తల మునకలవుతూండగా "ఇదేమన్నా బాగుందా బావగారూ" అన్న మాటలు వినబడ్డాయి. ఆయన తలెత్తి కృష్ణారావుని చూసి "ఏం జరిగిందండీ" అన్నాడు.

ఆ ప్రశ్నలో కుతూహలం కనబడలేదు. యథాలాపంగా అడిగినట్లుందా ప్రశ్న.

"వాడు...ఆ సుబ్బారావుగాడు నా కొంప ముంచాడు. మా అమ్మాయిని బలవంతం పెళ్ళి చేసేసుకుని ఆశీర్వదించ మంటూ ఇంటికి వచ్చాడు."

"నిజమే!" అన్నాడు దశరథరామయ్య. ఆయన ముఖంలో ఆశ్చర్యంకన్నా—ఆ మాట నిజం కావాలన్న కోరిక ఎక్కువగా కనబడుతోంది.

"బాగుంది. ఏ తండ్రయినా ఇలాంటి అబద్ధం చెప్తా కుంటాడా?" అన్నాడు కృష్ణారావు.

"అయితే మీ అమ్మాయి ఏమంటుంది?"

"పెళ్ళయితే బలవంతంగానే జరిగిందట. కానీ పెళ్ళయిపోయాక వాడినే తన భర్తగా భావిస్తోందట, అది పిచ్చో, వెర్రో నాకర్థం కాలేదు..." అన్నాడు కృష్ణారావు.

"అమ్మాయి కిష్టమైతే మనం చేయగలిగిందేముంది? అయినా కుర్రాడు బాగుంటాడు లెండి..." అన్నాడు దశరథరామయ్య.

కృష్ణారావు అల్లుడి గురించిన పొగడ్తలు వినడాని కక్కుడదు రాలేదు. ఆయన ఒళ్ళు మండిపోతోంది. ఇందులో దశరథ రామయ్య సహాయసహకారాలుండి వుండాలని ఆయన నమ్మకం. ఆ నమ్మకంతో తన అక్కను వెళ్ళబుచ్చుకుందుకు వచ్చాడాయన. ఆ పని చేసుకుని వెళ్ళిపోయాడాయన.

వెళ్ళిపోయేముందు—"తెలిసో తెలియకో—ఈ వ్యవహారంలో చాలామంది పెద్దమనుషులు సహాయం చేసి వుంటారా సుబ్బారావుగాడికి. వాళ్ళకీ కూతుళ్ళుండక పోరు. నా బాధ వాళ్ళకర్థమయ్యేరోజు రాకపోదు" అన్నాడు.

"అవును ఆ రోజు దగ్గర్లోనే వుంది" అనుకున్నాడు దశరథరామయ్య బాధగా. ఆయన మనసు మనసులో లేదని ముఖం చూసి తెలుసుకోవచ్చు.

దశరథరామయ్య అలా ఆలోచనలో ఉండగానే "మమ్మల్నాశీర్వదించండి మామయ్యా" అన్న మాటలు వినబడి తల పైకి ఎత్తాడు.

ఎదురుగా కనబడ్డ సుబ్బారావు, శ్యామలను చూసి ఆయన ఉలిక్కిపడ్డాడు. శ్యామల చటుక్కున వంగి ఆయనకు పాదాభివందనం చేసింది. అప్రయత్నంగానే ఆశీర్వదించాడు దశరథరామయ్య.

"మీవల్లకాని పని నా వల్లనయింది..." అని నవ్వాడు సుబ్బారావు. ఆ అనడంలో ఈ పెళ్ళి నీ కారణంగా జరగ లేదు కాబట్టి నీకు నేను ఋణపడిలేనన్న ధ్వని వినిపించింది దశరథరామయ్యకు.

ఒక రెండు నిముషాల పాటు వాళ్ళని విశేషాలడిగి "నువ్వు లోపలికి వెళ్ళి అత్తయ్యతో మాట్లాడిరామ్మా-

నేను అబ్బాయితో మాట్లాడతాను'' అన్నాడు దశరథ రామయ్య. శ్యామల మౌనంగా లోపలకు వెళ్ళిపోయింది.

''నువ్వడగబోయేది నాకు తెలుసు. కానీ అనవసరం. జరగబోయేదాన్నెవ్వరూ ఆపలేరు. నేనెందుకు వచ్చానో అది జరిగితీరుంది.''

''ఎందుకొచ్చావ్ నువ్వు?''

''నిన్ను చంపుదామని...''

దశరథరామయ్య అదోలా నవ్వి—''చంపుతాను చంపుతానని రోజూ బెదిరించడమెందుకు? నేనింక బెదిరింపులకు లొంగేవాడిని కాదు. ఎలా చంపుతావో చూస్తాను. నీకభ్యంతరం లేకపోతే నీ కార్యక్రమం నెరవేర్చుకోవడం కోసం నువ్వు నా ఇంట్లోనే మకాం పెట్టవచ్చు...'' అన్నాడు.

''నీకు సరదాగా వుంటే అలాగే కానివ్వు. కానీ ఎలకను బోనులో పెడుతున్నాననుకుంటున్న నువ్వు తర్వాత చాలా విచారిస్తావేమో'' — అన్నాడు సుబ్బారావు.

''దటీజ్ మై హెడేక్—'' అన్నాడు దశరథ రామయ్య.

# 13

''దుర్మార్గుడా—చివరకు అన్నంత పనీ చేశావ్'' అన్నాడు దశరథరామయ్య.

''ఎలాంటి పరిస్థితుల్లోనైనా అన్నపని చేయడం నా ప్రత్యేకత'' అన్నాడు సుబ్బారావు వెకిలిగా నవ్వుతూ.

ప్రక్కనవున్న మంచం మీద కూర్చుని వాణి నిశ్శబ్దంగా రోదిస్తోంది.

ఆ సమయంలో గది తలుపులు ఎవరో తట్టిన శబ్దమయింది. సుబ్బారావు వెళ్ళి తలుపు తీశాడు. లోపల ప్రవేశించిన వ్యక్తి చేతిలో రివాల్వరు వుంది.

"చేతులు పైకెత్తు!" అన్నాడతను.

"నువ్వా?" అన్నాడాశ్చర్యంగా సుబ్బారావు చేతులు పైకెత్తుతూ.

అతను తలుపులు మళ్ళీ గడియవేసి "ఇంట్లో ఎవ్వరూ స్పృహలో లేరు. అలాగే వెనక్కు తిరుగు..." అన్నాడు. సుబ్బారావు అతను చెప్పినట్లే చేశాడు.

తాళ్ళతో కట్టబడివున్న దశరథరామయ్య నెమ్మదిగా తలెత్తి ఆ వ్యక్తిని ఆశ్చర్యంగా చూసి—"ఎవర్నువ్వు? మూడు సంవత్సరాలుగా నమ్మకంగా మా ఇంట్లో పని చేస్తున్న నువ్వు చేతిలో రివాల్వర్‌తో ఈ వేళ యీ విధంగా" అన్నాడు.

"దశరథరామయ్యా- నేను కావాలనే నీ ఇంట్లో పనికి చేరాను. నేను దొంగను కాదు. అనుక్షణం నిన్ను నీడలా వెంటాడడంకోసం మీ ఇంటి పనివాడినయ్యాను. నువ్వు నాకు బాగానే ఆశ్రయమిచ్చావు. భోజనం పెడుతున్నావు. పడుకునేందుకు స్థలమిచ్చావు. అయితే నేను తిన్న ఇంటివాసాలు లెక్కపెడుతున్నాననీ-తల్లిపాలు తాగి—రొమ్ముమీద గుద్దే దుర్మార్గుడిననీ నువ్వనుకుంటే అది నీ అవివేకం.

నేను పగతో నీఇల్లు చేరాను. అదృష్టవశాత్తు నీ ఇంట ఆశ్రయం లభించింది. అవకాశం కోసం ఇంతకాలంగా ఎదురు చూస్తున్నాను. చివరికి వచ్చింది. నిన్ను నమ్మిన ఆడదాన్ని వంచించిన దుర్మార్గుడివి నువ్వు. నీలాంటివాణ్ణి ఏం చేసినా పాపంలేదు..." అన్నాడతను.

"నీ మాటలు నా కర్థం కావడంలేదు. నువ్వెవరివో నాకు తెలియడంలేదు" అన్నాడు దశరథరామయ్య.

"నా పేరు సీతాపతి" అన్నాడా వ్యక్తి.

"సీతాపతివి నువ్వా?" అన్నాడు దశరథరామయ్య ఆశ్చర్యంగా. "నిన్ను గురించి చాలా కాలంగా భయపడుతున్నాను. అయితే నిన్ను చూడాలని కూడా అనుకుంటున్నాను. ఎందుకంటే నువ్వు నా మీద ఎందుకు పగబట్టావో నాకు తెలియడం లేదు."

"ఏం సంగనాచివయ్యా నువ్వు" అన్నాడు సీతాపతి.

"సంగనాచినో ఎవరినో కానీ నువ్వు చేసిన తప్పుకు దేవుడు కూడా క్షమించడు. నా కూతురు నూరేళ్ళ నిండు జీవితాన్ని బలితీసుకున్నావు" అన్నాడు దశరథరామయ్య. ఆయన కంఠం రుద్ధమై మరి మాటలు రాలేదు.

"ఇది ఇప్పటి నీ బాధ. కానీ నా కూతురుకూడా నీ చేతిలో వంచించబడి ప్రాణాలు తీసుకుంది. ఆ బాధ నన్ను సంవత్సరాలుగా గుండెలు మండిస్తోంది" అన్నాడు సీతాపతి.

"ఎవరు నీ కూతురు? ఏమిటి నేను చేసిన వంచన?"— అన్నాడు దశరథరామయ్య.

"గుండెలు మండించే ఆ కథను మళ్ళీమళ్ళీ నానోట పలికించాలనే సరదా నీ కుండవచ్చు కానీ నాకా ఓపిక లేదు" అన్నాడు సీతాపతి.

"గుండెలు మండించే ఆ కథేమిటో నాకు తెలియదు. ప్రస్తుతం నా కళ్ళముందే నా కూతురికి జరిగిన అవమానానికి నా గుండెలు మండిపోతున్నాయి" అన్నాడు దశరథరామయ్య.

"అది నాకు సంబంధంలేని విషయం" అంటూ సుబ్బారావునో తాపు తన్నాడు సీతాపతి. అనుకోని ఆ తాపుకు సుబ్బారావు ముందుకు పడ్డాడు. ముఖంలో కోపాన్ని ప్రదర్శిస్తూ "ఏమిటిది?" అంటూ సీతాపతివైపు తిరిగాడు.

"అడుగు ముందుకు వెయ్యకు. నిర్దాక్షిణ్యంగా కాల్చేయగలను. ముందుగా నువ్వెవరో చెప్పు" అన్నాడు సీతాపతి. అతని కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

ప్రశ్నకు ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ చూశాడు దశరథరామయ్య "వీడు నీ మనిషేకదా" అన్నాడు.

"వీడా వీడు నా మనిషా? నా పేరు చెప్పుకుని నిన్ను బెదిరించి తన పశువాంఛ తీర్చుకున్న పాపాత్ముడు వీడు. వీడికీ నాకూ ఏ విధమైన సంబంధమూ లేదు" అన్నాడు సీతాపతి.

## 14

ఆ గదిలో కొన్ని నిముషాలసేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఇంత రాద్ధాంతం జరుగుతున్నా వాణి వంచిన తల ఎత్తలేదు.

"చెప్పు, ఎవర్నువ్వు?" అన్నాడు సీతాపతి.

క్షణం తటపటాయించి "కొండల్రావు నా స్నేహితుడు..." అన్నాడు సుబ్బారావు.

సీతాపతి ఉలిక్కిపడ్డాడు.

సుబ్బారావు చెప్పడం ప్రారంభించాడు—"నీగురించి అతనే నాకు చెప్పాడు. అతనిద్వారా నీగురించి తెలుసుకున్నాక నువ్వు దశరథరామయ్యనుకూడా వేటాడబోతున్నావని గ్రహించాను. ఈ అవకాశాన్నుపయోగించుకోదల్చాను. నీ కారణంగా నాకు మంచి ఉప

కారం జరిగింది. మరో విధంగా అయితే నాకు లభ్యం కాని పిల్ల నా ఇంటి ఇల్లాలయింది. నా భావి జీవితానికి దశరథరామయ్య అండదండలు లభించాయి.

ఈమాత్రం ఉపకారం చేసినందుకు ప్రతిగా నీకూ నేనుపకారం చేయదల్చుకున్నాను. దశరథరామయ్య కళ్ళముందే ఆయన కూతురు వాణికి మానభంగంచేశాను. ఏమైతేనేం — కాగలకార్యం గంధర్వులే తీర్చారు. ఇందులో నేను చేసిన తప్పేముంది?''

''చాలావుంది. నా పేరును నడివీధిలోకి లాగావు. గుట్టుగా పగతీర్చుకుందా మనుకున్న నాకా అవకాశం లేకుండా చేశావు'' అన్నాడు సీతాపతి.

''సీతాపతీ, ఎందుకు నీకు నాపైన పగ?'' అన్నాడు దశరథరామయ్య.

''వద్దని చెప్పినా మళ్ళీమళ్ళీ అడుగుతున్నావు. నువ్వు మోసగించిన రమ నా కూతురు'' అన్నాడు సీతాపతి.

''రమ ఎవరో నాకు తెలియదు'' అన్నాడు దశరథ రామయ్య.

సీతాపతి ముఖం ఎర్రబడింది. ''పెళ్ళి చేసుకుంటానని వంచించావు దాన్ని. అది ఆత్మహత్యకు పాల్పడింది. దాన్నింకొకడు రక్షించాడు. మళ్ళీ దానికి ఆశలు కలిగించి వాడూ దాన్ని మోసంచేశాడు. రెండోసారి మోస పోగానే అది తనువు చాలించింది. ఆత్మహత్య చేసు కునేముందు నాకో ఉత్తరం రాసి, అందులో తన్ను మోసగించిన వాడి చిరునామాకూడా ఇచ్చింది.

అప్పట్నించీ పగతోనే జీవిస్తున్నాను. పగతీర్చు కోవడానికి అవసరమైన కర్కశత్వాన్ని నాలో పెంపొం

దించుకున్నాను. దోపిడీ దొంగగా తయారై డబ్బుకూడ బెట్టాను. నా పగకోసమే అన్నట్లుగా నీకో కూతురు పుట్టింది. అదెప్పుడు పెరిగి పెద్దదవుతుందా అని ఎదురు చూస్తున్నాను. ఇన్నాళ్ళకు నాకా అవకాశమొచ్చింది. ఒకడి మీద పగ తీర్చుకున్నాను. రెండో పగ తీర్చు కుందామనుకుంటూండగా కొండబ్రావు పొరబాటువల్ల సుబ్బారావు రంగప్రవేశం చేశాడు.''

''సీతాపతీ ఒక్క క్షణం ఆగుతావాం?'' అన్నాడు దశరథరామయ్య. ''పగ తీర్చుకోమని నీ కూతురు నీకు నా చిరునామా ఇచ్చిందా?''

''లేదు.''

''మరి ఏ కారణంగా నువ్వు నామీద పగబట్టావు?''

''నీ కారణంగా తను మోసపోయినట్లు మొదట్లో నే అది నాకు తెలియజేసింది.''

''అసలు నీ కూతుర్నెవరూ మోసం చేయలేదు. నువ్వే మోసం చేశావని నేనంటాను.'' అన్నాడు దశరథ రామయ్య.

''ఏమిటి కూసావ్'' అన్నాడు కోపంగా సీతాపతి.

''అవును, ఒకసారి రోడ్డుమీద ఎవరో చేయిపట్టుకుంటే ఊరుకున్నదని ఆమెను ఇంటివద్ద గొడ్డును బాదినట్లుగా బాదావు. ఎవడో కొంటె వెధవ ఆమెను చూసి కన్ను గీటాడని చావగొట్టావు. నీ కూతురు చాలా అందంగా ఉండేది. ఆ అందాన్ని చూసి చాలామంది యువకులు ఆకర్షితులై పోయేవారు. అది నీకు ఆమెపట్ల అనుమా నంగా పరిణమించింది. ఆ అనుమానంతో ఆమె బ్రతు

కను నరకం చేశావు నువ్వు. ఎప్పుడు నీ బారినుంచి బయట పడదామా అని అనుకునేదామె.''

''అబద్ధాలు... అన్నీ అబద్ధాలు'' అన్నాడు సీతాపతి.

''నువ్వు చెప్పిన అబద్ధాలు నేను విన్నాను. నేను చెప్పే అబద్ధాలు కూడా నువ్వు వినకూడదూ?'' అన్నాడు దశరథ రామయ్య. ఆయన కంఠంలో మొండితనం ధ్వనిస్తోంది.

# 15

రమ చాలా అందంగా ఉండేది. ఆమె తండ్రి సీతాపతికి రమ అంటే ఎంత ఇష్టమో ఆమె ప్రవర్తన పైన అంత అనుమానం.

రమను ఎవరయినా చూస్తే ఆ తప్పు ఆ మగవాడిది కాదు. చూడబడటం ఆమె తప్పు.

ఒకరోజున చావుదెబ్బలు తిన్న రమకు ఒక యువకుడి ఓదార్పు మాటలు లభించాయి. ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్న యువకుడతను. రమను తను ప్రేమిస్తున్నాననీ, ఉద్యోగం రాగానే ఆమెను పెళ్ళిచేసుకుంటాననీ అన్నాడతను.

తియ్యని మాటలకోసం తపించి పోతున్న అతని ఓదార్పు మాటలకు చలించిపోయి అతనిపట్ల ఆకర్షితురాలయింది.

అయితే అతన్ని కలుసుకోవడం ఆమెకు సమస్యగా ఉండేది. ఆ ఏర్పాటామెకు దశరథరామయ్య తనింట్లో చేశాడు. దశరథరామయ్య కప్పటికింకా పెళ్ళికాలేదు. కానీ, వారి కుటుంబానికి మంచిపేరున్నది.

దశరథరామయ్య ఇంటికి వెడుతున్నానని చెప్పి—రమ ఆ యువకుడితో తిరుగుతూండేది. దశరథరామయ్య తల్లి

దండ్రుల పట్ల సీతాపతికి మంచి గురి ఉండడంవల్ల అతనీ విషయం గురించి సీరియస్ గా తీసుకోలేదు.

రమ గర్భవతి అయింది. ఆ సంగతి తెలియగానే ఆ యువకుడు పారిపోయాడు.

మరెవరిపేరు చెప్పినా తండ్రి తనను చంపేస్తాడని భయపడి రమ, దశరథరామయ్యా పేరు చెప్పింది. సీతాపతి కోపంగా దశరథరామయ్యా ఇంటికివెళ్ళి అవమానపడి తిరిగి వచ్చాడు. అవమానం అతని కోపాన్ని పెంచింది. ఆ కోపాగ్నికి తట్టుకోలేని రమ ఇల్లువదిలింది.

ఇల్లు వదిలేముందు రమ, దశరథరామయ్యాకు జరిగినది తెలియబరుస్తూ ఉత్తరం వ్రాసి అనవసరంగా తన పేరు ఇరికించినందుకు క్షమించమని కోరింది. ఆ ఉత్తరం ఇప్పటికీ దశరథరామయ్యా దాచి ఉంచుకున్నాడు.

రమ ఇల్లువదలి మరొకడి చేతిలో పడింది. వాడామెను కల్లబొల్లి కబుర్లతో వంచించి కొంతకాలంపాటు ఉపయోగించుకుని, వేశ్యాగృహానికి అమ్మే ప్రయత్నాలు చేస్తుండగా రమ అక్కణ్నించి పారిపోయింది.

రమ తనువు చాలించాలని నిర్ణయించుకుంది.

చివరి క్షణాల్లో దశరథరామయ్యాను కలుసుకొని స్వయంగా క్షమార్పణలు చెప్పుకోవాలనుకున్నదామె.

ఆమె ఉత్తరాన్నందుకొని వెళ్ళాడు దశరథరామయ్యా. ఆమెను ఆత్మహత్యా ప్రయత్నంనుండి విరమింపజేశాడు. ఆమెనో నర్సింగ్ హోంలో చేర్పించాడు. పుట్టినబిడ్డ దక్కలేదామెకు.

ఆ తర్వాత అతనామెకో మిషన్ కొనిచ్చి స్వతంత్రంగా బ్రతకమని చెప్పాడు.

రమకు వివాహంకూడా అయింది. ఆమె యిప్పుడు పలక్షణంగా కాపురం చేసుకొంటోంది.

# 16

"రమ బ్రతికి ఉందా?" అన్నాడు సీతాపతి.

"రహస్యంగా చూసిరాగలనని వాగ్దానంచేస్తే చిరునామా ఇవ్వగలను" అన్నాడు దశరథరామయ్య.

"బ్రతికి ఉంటే ఇంతకాలం ఈ కన్నతండ్రిని ఎందుకు నిర్లక్ష్యం చేసింది?" అన్నాడు సీతాపతి. అతని కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

"ఎందుకా? మనదేశంలో కన్నతండ్రులకు కన్నబిడ్డల కంటెకూడా పరువు ఎక్కువ కాబట్టి! ఆ పరువయినా అర్థంలేనిది. ఏమీతోచక మనిషి సృష్టించుకున్నది!" అన్నాడు దశరథరామయ్య కసిగా.

సీతాపతి మాట్లాడలేదు.

"ఆలోచించు సీతాపతీ! ఈపని చేసేకంటే, చస్తే అసలు నువ్వు పుట్టనేలేదనుకుని ఓ ఏడుపేడిచి ఊరుకుందును కదుటే అని తిట్టావు నువ్వు రమను. ఇది నీ ప్రత్యేకత ఏమీకాదు. దేశంలో ఉన్న అందరు తలిదండ్రులు ఇలాగే ప్రవర్తిస్తున్నారు.

వయసులో ఉన్న పిల్లలకు క్రమశిక్షణ అవసరమే! కానీ తలిదండ్రులు క్రమశిక్షణకోసం మాత్రమే కాక, తప్పు చేసినప్పుడు రక్షణ యివ్వడానికికూడా ఉన్నారని ఎంతమంది గుర్తిస్తున్నారు? ఆడపిల్ల తప్పుచేస్తే కుమిలి కుమిలి ఏడ్వకలసి వస్తోంది.

నీపిల్ల చచ్చిపోయిందనుకుని, అందుకు ఎవరో కారకు లనుకొని, వాళ్ళను పగబట్టి వేధించాలని నువ్వనుకున్నావు

తప్పితే, నీ ఆశ్రయం లభిస్తే నీపిల్ల చావవలసిన అవసరం లేదని నీకు తట్టలేదు. రమ నాకు వ్రాసిన ఉత్తరాలు చూడలేదు నువ్వు. కావాలంటే ఇప్పుడే వాటిని చూపిస్తాను..."

"నీ మాటలు వింటూంటే తప్పంతా నాదేననిపిస్తోంది. నా పిల్లను నిరాశ్రయురాలు చేసింది నేనేనని గ్రహింపయింది. ఏది ఏమైనా వెంటనే వెళ్ళి నా రమను చూడాలి" అన్నాడు సీతాపతి.

"చూద్దువుగాని నీ రమను. కానీ ఈలోగా నా వాణికి అన్యాయం జరిగిపోయింది. దాని బ్రతుకు బండలైపోయింది. పోనీ నీకుమాత్రం ఏం మిగిలింది? దోపిడీదొంగ సీతాపతిగా పేరుగాంచిన నీకు రమతండ్రినని చెప్పుకునే అర్హత ఉందా? తెలియక రమ తప్పుచేస్తే, తెలిసి నువ్వు తప్పుచేశావు" అన్నాడు దశరథరామయ్య.

"నేను అన్నీ తప్పులే చేశానని అంగీకరిస్తున్నాను. జరిగిందానికి నేను చేయగలిగినదేమీ లేదు. పశ్చాత్తాపం కూడా వృధా. నావల్ల నీకు జరిగిన అన్యాయానికి క్షమించు. నీ కూతురికేదో అన్యాయం జరిగిపోయిందనుకోకు. నీలాంటి తండ్రి రక్షణలో ఆ అన్యాయాన్నించి తేరుకోవడం ఆమెకు కష్టంకాదు.

నేనింకేమీ ఆలోచించే స్థితిలో లేను. నా కూతురు నీకు రాసిన ఉత్తరాలు చూపించు. నా కూతురు చిరునామా ఇవ్వు. నేను వెళ్ళిపోతాను. మళ్ళీ నీ జీవితంలో ప్రవేశించను."

## 17

సీతాపతి వెళ్ళిపోయేక దశరథరామయ్య ఉత్సాహంగా సుబ్బారావుని సమీపించి భుజంతట్టి "నీకు మెనీ

మెనీ థాంక్స్. నాటకం బాగా రక్తికట్టించావు..."
అన్నాడు.

"సీతాపతిని వల్లబర్చడానికి మీదగ్గర చాలా సమా చారముంది. కానీ ఈ విధమైన నాటకాన్నెందుకెన్ను కున్నారో నాకర్థం కాలేదు" అన్నాడు సుబ్బారావు.

"అందుకు చాలా కారణాలున్నాయి" అన్నాడు దశరథరామయ్య.

"ఎంత ప్రయత్నించినా సీతాపతినుంచి ఉత్తరాలు తప్పితే, అతని ఆచూకీ తెలియడంలేదు నాకు. అతను నామీద పగబట్టాడని తెలుసు నాకు. ఆ పగ అర్థంలేని దనీ తెలుసునాకు.

కొండల్రావుద్వారా సీతాపతి పద్ధతి తెలుసుకుని నాకు చెప్పావు నువ్వు. వెంటనే నువ్వు రంగప్రవేశం చెయ్యడం అవసరమనిపించింది. సీతాపతి మనిషినంటూ అతనికి తెలియకుండా ఒకవ్యక్తి వస్తే సీతాపతిలోనూ కంగారు బయలుదేరుతుంది.

సీతాపతి మనిషొకడు మా ఇంట్లో పనివాడుగా వున్నా డని నా అనుమానం. మా ఇంట్లో యెప్పుడు యెక్కడ యెలాంటి సంభాషణలు జరిగినా వాడు పొంచివింటుండే వాడు. వాడలా పొంచి వింటున్నాడనే విషయాన్ని దృష్టిలో ఉంచుకునే నా సంభాషణలు జరుపుతూండే వాడిని. అయితే ఆ వ్యక్తే సీతాపతి అని నాకింత వరకూ తెలియదు."

"అయితే వాడికి తెలిసేలా రమ విషయంలో మీ నిర్దోషిత్వం గురించి మాట్లాడలేక పోయారేం?"

"పనిగట్టుకుని రమ ప్రసక్తి యెవరితో యెలా తీసుకు

రావాలో నాకు తెలిసేదికాదు. అదీకాక సీతాపతి ఆవేశంలో ఉన్నాడు. నా నిర్దోషిత్వం గురించి నేనెప్పుడు మాట్లాడినా రెచ్చిపోతాడు తప్పితే మారు ప్రయోజనము ఉండదు. నేను నా నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నానని సీతాపతి అనుకోరాదు. సీతాపతిని ముందుగా చల్లార్చాలి. చల్లార్చాలంటే అతను కోరిన ప్రతీకారం నాపై జరిగినట్లు అతను భావించాలి. అప్పుడే అతను ఒకమనిషిగామారి నా మాటలు వినగలుగుతాడు. అది ఒక కారణమైతే—రెండవది నీకు తెలిసినదేకదా."

"తెలిసినదే లెండి... నేనూ, శ్యామలా ప్రేమించుకున్నాం. పెళ్ళిమాటలు జరిగిపోయేక మీ అబ్బాయికి శ్యామల అంటే ఇష్టంలేదని మీకు తెలిసింది. ఏ పరిస్థితిలోనూ కృష్ణారావుగారు నాకు పిల్లనివ్వరు. అందుకని నా పెళ్ళికీ సీతాపతి వ్యవహారానికీ ముడిపెట్టడం కోసం కూడా నన్ను రంగంలోకి దింపారు."

దశరథరామయ్య చిన్నగా నవ్వి—"ఏది ఏమయినా ఈ నాటకంలో నీ పాత్రను నువ్వు సమర్థవంతంగా పోషించావు. నీ కెంతయినా ఋణపడి ఉన్నాను నేను" అన్నాడు.

"మీరు నాకు ఋణపడడమేమిటండీ, ఎవరికీ ఏమీ కాని నన్ను చిన్నతనంనుంచి పోషిస్తూ ఇంతవాణ్ని చేశారు. నాకులాగే ఎంతమందికి మీరు గుప్తదానాలు చేస్తున్నారో? మీవంటి వారికి ఏం చేసినా నాబోటి వాళ్ళు ఋణం తీర్చుకోలేరు..." అన్నాడు సుబ్బారావు.

"ఋణాల సంగతి తర్వాత మాట్లాడదాం. నువ్వు

వ్యాపారం సంగతి ఆలోచించు. అవసరమైన పెట్టుబడి నేనిస్తాను'' అన్నాడు దశరథరామయ్య.

సరేనని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

దశరథరామయ్య నెమ్మదిగా నడిచి తన గదిలోని బీరువా తెరిచాడు. అందులో కొన్ని కాగితాల మధ్య నుంచి ఒక ఫోటో తీశాడు. ఆ ఫోటోవంకే తదేకంగా చూస్తూ —

''రమా! కన్నతండ్రి పెట్టే బాధలు భరించలేక, తియ్యటి పిలుపుకోసం తపించిపోతూ అసహాయదశలో వున్న నిన్ను వంచించటానికి అడ్డుంచి అంతస్థు మన పెళ్ళికి వచ్చింది. నా వంచన ఫలితంగా నువ్వింకా ఘోరాపదలలో చిక్కుకున్నావు.

నీ కొడుకును పెంచి పెద్దచేసే బాధ్యత తీసుకున్నందుకు ప్రతిఫలంగా నేనుకోరిన ఉత్తరాలు రాసిచ్చావు నువ్వు. నువ్వు దేవతవు రమా!

నీ తండ్రి నీ దగ్గరకు వస్తున్నాడు. నిన్ను నేను వంచించ లేదనీ, నీకు బిడ్డపుట్టి పోయాడనీ నేను చెప్పిన అబద్ధాలను, నీ తండ్రివద్ద నువ్వుకూడా బలపర్చగలవన్న నమ్మకం నాకుంది. నీ కారణంగా నేను, నా కూతురు ఈరోజు అవమానం పాలుకాకుండా రక్షించబడ్డాము.

తలిదండ్రులిద్దరూ బ్రతికి వుండీ అనాధుడిగా చలామణీ అవుతున్న మన బాబు సుబ్బారావీనాడో ఇంటివా డయ్యాడు. వాడింకా గొప్పవాడౌతాడు. వాడి భవిష్యత్తుకు నేను బంగారుబాట వేస్తాను. వాడు నాకు కృతజ్ఞతలు తెలుపుకుంటూంటే అది నా బాధ్యతరా అని నేను పైకి అనలేకపోతున్నాను.

ఏది ఏమైనా ఇంతకాలంగా నేను భయపడుతున్న దురదృష్టం నన్ను వదిలిపెట్టింది. నా ఆరాధ్యదేవతగా ఎప్పటికీ నువ్వు నా గుండెల్లో వుంటావు'' అనుకున్నాడు దశరథరామయ్య.

తర్వాత ఆయన ఆ ఫోటోని బీరువాలో పెట్టేసుకున్నాడు.

దేవతల స్థానం అంతేకదా. వాళ్ళు గుళ్ళలో వుంటారు. గుండెల్లో ఉంటారు తప్పితే సరసన ఎప్పుడూ వుండరు అందుకే దశరథరామయ్య రమను దేవతను చేశాడు.

మర్నాడుదయం ఏదో సందర్భంలో ''మనకేం మన మదృష్టవంతులం'' అని దశరథరామయ్య అంటే రుక్మిణి ఆశ్చర్యపడింది.

సీతాపతి తనకు తానై పోలీసులకు దొరికిపోయాడని, ఓ వారంరోజుల తర్వాత వచ్చిన వార్త చదివి ''పాపం, దురదృష్టవంతుడు!'' అని నిట్టూర్చాడు దశరథరామయ్య.

—: ఐపోయింది :—

## సీరియల్




[పదహారవ భాగము]

"భయంకర్! ఏమయింది? ఆర్యా ఓ.కే?"—శానోర్యా కంఠం...

"డామిట్! యాక్సిలేటర్ అడుక్కుంటూ నొక్కు" అర్యాను ఒగురుస్తూ సీట్లో సర్దుకొంటూ.

మరుక్షణం జీపు దడదడా శబ్దంచేస్తూ పెద్ద పెద్ద కుదుపులతో మెయిన్ వీధిలో పరిగెత్తసాగింది.

వెనకాల పిస్టల్ కాల్పులు "ధన్.. ధన్" మంటూ వినబడ్డాయ్.

"శాన్యోరా! వేగం తగ్గించకు. రోడ్ వైపే చూస్తూ నా మాటలు విను. మనకు దుస్తులు దొరికాయ్. అయితే బట్టలు దొంగిలించడానికి వెళ్ళింది ఎవరింటికో తెల్సా?" ఆగిపోయాను ఆయాసంతో.

"ఎవరింటికి?"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్ యింటికి. మన దేశంలో ఇలాంటి పల్లెటూళ్ళలో అసలు పోలీస్ స్టేషన్‌లు ఉండవ్. క్లవర్ గయ్! వాడు నన్ను గుర్తించాడు నేను భయంకర్నని. పరిస్థితులు విషమించాయ్. ఫోన్ చేస్తాడేమో యితర స్టేషన్‌లకి?" గొణిగాను నిస్సత్తువగా, గుండె దడతో.

*  *  *

జీపు వేగంగా పరిగెడుతోంది.

స్టీరింగ్ వీల్ నా చేతిలో బిగుసుకొంది.

అప్పటికే మేం దుస్తులు మార్చుకున్నాం.

శాన్యోరా బురఖా ధరించి, ముఖానికి అడ్డుగా వున్న నెట్ వర్క్ క్లాత్ వెనక్కి తొలగించి ఎక్సయిట్‌మెంట్‌తో ఖాళీ రోడ్డును చూస్తోంది. అప్పటికే ఊరవతల ప్రాంతం చేరుకున్నాం. నేను పాదాలవరకు కప్పబడిన తెల్లని అరబ్ గౌను ధరించాను. నల్లటి రోప్‌తో తలగుడ్డకు చుట్టూ ధరించడంవల్ల ఏదో అనీజీ ఫీలవుతున్నాను.

దుస్తులు మారినంత మాత్రాన పోలీసులు గుర్తించరు అనుకోవడం పొరపాటు. నేను నడిపే జీపు రిజిస్ట్రేషన్ నంబరు ఈ దేశానిది కాదు. నెంబరుప్లేటు మార్చడానికి కావలసిన సదుపాయాలు లేవు.

అన్నిటికంటే అసలు సమస్య డబ్బు. ఆకలి మండుతోంది కడుపులో. సుడాన్ కరెన్సీ సంపాదించాలి.

ప్రొఫెసర్ పాల్‌మావ్ వందడాలర్లు యిచ్చి వున్నాడు, ఎక్స్ఛేంజి బాంకులో మార్చుకోమని. అయితే బాంకులు పనిచేసే సమయం కాదిది.

తెల్లవారేలోగా పరిస్థితులెలా మారతాయో?

హెడ్‌లైట్ల వెలుగులో వెనక్కి పరిగెడుతున్న రోడ్డు వైపు చూస్తూ జీపు వేగం పెంచాను.

దూరంగా కరెంట్ దీపాలు కనబడుతున్నాయి.

సుడాన్‌లోని ఖార్టూమ్‌లోవుంది. N.W.O. బ్రాంచ్! ఖార్టూమ్ చేరుకునేలోగా మరో రెండు ఊళ్ళు దాటాలి మాప్ ప్రకారం.

మొదటిది బెర్బర్.

రెండవది అట్‌బారా.

దగ్గరవుతున్న టౌన్ బెర్బర్ అని గుర్తించాను.

వాచ్ చూసుకున్నాను.

పది!

అంటే అబుహమీద్ గ్రామాన్నుంచి బెర్బర్ చేరడానికి సుమారు రెండు గంటలు పట్టిందన్నమాట!

మధ్యదారిలో అంతులేని వ్యవసాయ భూములు తప్ప ఊళ్ళు లేవు.

మరో మైలుదూరాన్ని మింగేసింది జీపు.

ఠక్కున ఆపేసాను వాహనాన్ని.

ప్రశ్నార్థకంగా చూసింది శాన్యోరా.

"శాన్యోరా! ఈ జీపుని అబుహమీద్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ గుర్తించి వుంటాడు. ఇది వెంట వుండటం

మనకు ప్రమాదం. కనబడేదే బెర్బర్ టౌను. కాలినడకన టౌన్‌లో ప్రవేశించి లాడ్జిలో దిగుదాం.

"ఖర్చులో?" అడిగింది ప్రశ్నార్థకంగా చూస్తూ.

బరువుగా నవ్వాను. "ఏ-'మనీ లెండర్' దగ్గరో నీ ఉంగరం, నా వాచీ అమ్మేయాలి."

"ఓ. కే." విషాదంగా నవ్వింది శాన్యోరా.

ఇద్దరం సాయంపట్టి రోడ్డు పక్క పల్లంలోకి జీపుని తోసేసాం.

మొగ్గలు వేస్తూ జీపు పల్లంలో వున్న నీటి మడుగులో పడింది.

చేతులు దులుపుకుంటూ రోడ్డెక్కాను. ఉన్నట్టుండి ఏదో అనుమానం స్ఫురించింది.

"జస్ట్ ఎ మినిట్" శాన్యోరాతో చెప్పి రోడ్డుమీంచి పల్లంలోకి జాగ్రత్తగా దిగాను.

అగ్గిపెట్టె తీసాను

మరో రెండునిమిషాల్లో పని పూర్తి చేసుకుని రోడ్డెక్కాను. పెట్రోల్ టాంకు అంటుకుని యిప్పుడు భగ భగ మండుతోంది జీపు.

ఇద్దరం బరువెక్కిన హృదయాలతో వడివడిగా బెర్బర్ టౌన్ వేపు అడుగులు వేసాం.

*        *        *

సుడాన్ జాతీయ దుస్తుల్లో ఉన్న మమ్మల్నెవరూ బెర్బర్ టౌన్‌లో అనుమానించలేదు.

అనుమానించలేదని ఎలా తెలిసిందంటే—యెవరూ వింతగా చూడలేదు గాబట్టి. శాన్యోరా ఉర్దూ బాగా మాట్లాడుతోంది.

అమీర్ ఖుస్రూ అనేచిన్న కడ్డీవ్యాపారి వద్ద వాచీ, ఉంగరం అమ్మేశాం. సరిగ్గా అప్పుడే ఓ ఆలోచన వచ్చింది. అంగీలోపల తడుముకున్నాను. లోపల పాంటు జేబులో కోబ్రానుంచి పొందిన 'ఏనుగు కనుబొమలు' తగిలాయి. ఆ సంచితీసి అమీర్ ఖుస్రూకి చూపించాను. అతని కళ్ళు మెరిసాయి. రెండువందల పౌండ్లు యిస్తానన్నాడు. వాచీ, ఉంగరం మళ్ళీ తీసేసుకుని, నూటయిరవై పౌండ్లతో బయటపడ్డాం.

అప్పటికి గంట పదకొండయింది. మా శరీరాలు చమురుకంపు కొడుతున్నాయి. స్నానం చేయాలన్న కాంక్ష—ఆకలి కోరికకంటే అధికం కాసాగింది.

'హుస్రత్ లాడ్జి' అనే చిన్న లాడ్జింగ్ హౌస్‌లో దూరాం. నిద్రపోతున్న గుమస్తా కుర్రాడిని తట్టిలేపాను. అయిదుపౌండ్లు అడ్వాన్సు చెల్లించి డబుల్ రూం తీసుకున్నాం.

తినడానికేమైనా పట్రమ్మని అతనికి నాలుగుపౌండ్లు యిచ్చాను. అతను రూం చూపించి బైటికి పరిగెత్తాడు. షాప్‌లు హోటల్స్ మూసేస్తారన్న భయంతో.

ఇద్దరం గదిలో ప్రవేశించాం. శాన్యోరా విపరీతమైన అలసటతో బెడ్ మీద వాలిపోగా నేను బట్టలు మార్చుకొని స్నానాల గదివైపు గబగబ అడుగులు వేశాను.

మరో అరగంటలో మా ఇద్దరి స్నానాలు పూర్తయ్యాయి. స్నానం సగంబలం.

సగప్రాణం లేచొచ్చింది. గుమస్తా కుర్రాడు బంగాళదుంప కూరతో, నాలుగు చపాతీలు, మరో సిగరెట్ పాకెట్ పట్టుకొచ్చాడు.

అతను వెళ్ళిన తర్వాత రొట్టెలు ఆత్రంగా తిన్నాం. మంచి నీళ్ళుతాగి అతిప్రేమగా సిగరెట్లు ముట్టించాం. తలుపులు బిగించి, ఫాన్ ఫుల్‌స్పీడ్‌లో పెట్టి బెడ్ మీద శవాల్లా వాలిపోయాం...

*　　　*　　　*

అద్దాల కిటికీలోంచి తీవ్రమైన ఎండ — ముఖంమీద ఎంతసేపట్నుంచి పడుతోందో...మత్తుగా కళ్ళు తెరిచాను.

ఇలాంటి బెడ్‌మీద పడుకొని ఎన్నిరోజులయింది? అందుకే కాబోలు యింత మొద్దునిద్ర పట్టింది. నా ఛాతీని అంటిపెట్టుకుని ఉన్న శాన్యోరా చేతిని మెల్లిగా తప్పించి, లేచి కూర్చున్నాను.

శాన్యోరా పసిపాపలా ముడుచుకొని పడుకొని ఉంది. నిద్రలో ఆమెకళ్ళు, ఆ భంగిమ యెంతో అమాయకంగా, కనబడుతూ ముద్దుగొలుపుతోంది.

హాయిగా నవ్వుతూ, తుళ్ళుతూ కాలంగడిపే పడుచు! ఎన్ని కష్టాలు పడుతోంది!

శాన్యోరాని లేపాలనిపించలేదు.

ఎన్నాళ్ళ తర్వాతో ఆమె సుఖంగా నిద్రిస్తోంది. ఇంతటి చక్కటి నిద్ర—రాబోయే ప్రమాదకరం— మళ్ళీ లభిస్తుందని నమ్మకంకూడ లేదు.

నిండైన ఆమె బుగ్గలమీద, లేతగా ముద్దుపెట్టుకుని, పైకి లేచాను.

కర్తవ్యం చకచకా గుర్తొచ్చింది. మేడదిగి గుమస్తాను కలుసుకొని—ఖార్టూమ్‌కి ట్రంకాల్ చేశాను. కనెక్షన్ రాగానే పిలవమని చెప్పి, మళ్ళీ గదికివచ్చి కాలకృత్యాలు

తీర్చుకున్నాను. బాత్ రూంలోంచి బయటికొచ్చేసరికి గంట పదకొండయింది.

బయట ఎండ తీవ్రంగావుంది. శాన్యోరా యింకా నిద్రలో నేవుంది.

ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు బిగువైన వక్షోజాలు అందంగా ఎగిసిపడ్తున్నాయి.

చిలిపికోర్క పుట్టింది.

మెల్లిగా ఆమెమీదికి వంగాను.

గుండెలమీద షర్ట్ బటన్స్ విప్పి, అటూయిటూ తప్పించాను. నగ్నంగా బయటపడ్డాయి, ఆమె బిగువయిన, బంగారు వర్ణపు స్తనాలు.

తృళ్ళిపడుతూ లేచింది శాన్యోరా.

"ఏమిటిది?" అంది తలమీద బలంగా మొట్టి.

"నువ్వలాగే పడుకో. నాపని నేను చేసుకుపోతాను" అన్నాను చిలిపిగా నవ్వుతూ.

"ఛీ, పాడు మాటలు పొద్దున్నే" అంటూ బలంగా గింజుకుని లేచికూర్చుంది.

"ఇది పొద్దున్న కాదు. అప్పుడే మధ్యాహ్నం అవుతోంది." అన్నాను ఆమెప్రక్కగా కూర్చొని సిగరెట్ ముట్టించుకుంటూ.

అంతలో తలుపు టకటకా చప్పుడయ్యింది.

"సార్!"

లేచివెళ్ళి తలుపు సగం తెరచి బైటికి తొంగిచూసాను. గుమస్తాకుర్రాడు! "సార్! ఖాట్మాండ్ ట్రంక్ కనెక్షన్ వచ్చింది," అన్నాడు.

"ఈ లాడ్జికి బోయ్, గుమాస్తా, ప్రొప్రయిటర్ అన్నీ నువ్వేనా?" అడిగాను ఉర్దూలో.

"కాదండీ, బోయ్నీ, గుమాస్తాని మాత్రమే. ప్రొప్రయిటర్ ఊళ్ళోలేడు."

"అయితే బ్రేక్‌ఫాస్ట్, కాఫీ ఏర్పాట్లు చెయ్యి. పద వొస్తున్నాను."

తలుపు దగ్గరగావేసి వెనక్కి తిరిగాను. శాన్యోరా బధకంగా బెడ్ మీద కూర్చుని ఉంది.

"శాన్యోరా! త్వరగా స్నానాదులు కానియ్. ఖార్టూమ్‌లో మనవాళ్ళకి ట్రంకాల్ బుక్ చేశాను. అది మాట్లాడి వస్తాను. నువ్వు త్వరగా రెడీకా" అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండా తలుపు తెర్చి—గబగబా మెట్లుదిగాను.

* * *

"హల్లోవ్! జెసీజ్ మిస్టర్ నైరోబీ! క్లియరింగ్ అండ్ ఫార్వర్డింగ్ ఏజెంట్స్" అన్న మాటలు అవతలి వైపునుంచి వినబడ్డాయి.

నా నవనరాల్లోను ఉత్సాహం తన్నుకొస్తోంది. ఎందుకంటే నేను కలుసుకోవాల్సిన వ్యక్తి చాలారోజుల తరువాత, నానా తిప్పలూ పడ్డతర్వాత ఈ విధంగా లభ్యమయినందుకు.

"మిస్టర్ నైరోబీ! ఎండ తీవ్రంగావుంది" అన్నాను కోడ్ వర్డ్ చెబుతూ.

రెండుక్షణాలు మౌనం వహించింది ఫోన్. బహుశా నైరోబీ ఆశ్చర్యంలో మునకలు వేస్తుంటాడు.

"యస్...యస్...వర్షం జోరుగా కురుస్తోంది. మిస్టర్ భయం...అయాం సారీ...మీరు ప్రయాణిస్తున్న ఓడ మునిగిపోయిందని ఇండియానుంచి మనసంస్థ విషాద వార్త పంపింది. కాని యిప్పుడు..."

"మిస్టర్ నైరోబీ! అదంతా ఓ పెద్దకథ. మేం బ్రతికే ఉన్నాం. ఉయ్ ఆర్ సాలిడ్లీ ఎలైవ్. వివరాలు చెప్ప డానికి టైంలేదు. నన ్ను యిక్కడి పోలీసులు యిక నుంచి మమ్మల్ని రేసుకుక్కల్లా వెంటబడతారు..."

ఇంకా ఏదో చెప్పబోతుండగా నైరోబీ నా మాటల్ని కట్ చేశాడు. "యూ యంగ్ కపుల్! సుడాన్ దేశంలో ఉండగా మీకేం ప్రమాదం రాకుండా కాపాడుకోగల్ను. ముందు అడ్రస్ చెప్పండి."

చెప్పాను.

"ఆమె క్షేమమేనా?"

"క్షేమమే"

"రైట్! మీరెక్కడికీ కదలకండి! అట్బారాలో అనుచరులకు వైర్లెస్ మెసేజ్ యిస్తాను. వాళ్ళు మిమ్మల్ని రక్షిస్తారు. నేను ఎలక్ట్రిక్ ట్రెయిన్లో బయలుదేరి అక్కడ్నించి టాక్సీలో బెర్బర్ వస్తాను. రైట్! ఫోన్ పెట్టేయండి. టైందాటి మాట్లాడితే ఆపరేటర్ లైన్లోకొచ్చే ప్రమాదముంది."

"అలాగే! మేం క్షేమంగా వచ్చామని యిండియాకు మెసేజ్ పంపండి."

"ష్యూర్! ఆల్ ది బెస్ట్!"

లైన్ కట్ అయింది.

[illegible] భారం తగ్గినట్లయి, హాయిగా గుండెల్నిండా

గాలిపీల్చి వదిలాను. సిగరెట్ ముట్టించుకొని రూంకేసి నడిచాను.

*　　　*　　　*

శానోర్యాకు ఫోన్ విషయం చెప్పిన తర్వాత ఆమెలో ఉత్సాహం యినుమడించింది.

ప్రయాణానికి రెడీ అయి నైరోబీ అనుచరులకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాం.

తీవ్రమైన ఆలోచనలతో, ఫ్రెష్ సిగరెట్ ముట్టించ బోతుండగా ఉలిక్కిపడ్డాను.

తలుపు టకటకా చప్పుడయ్యింది.

ఎవరు?

నైరోబీ అనుచరులా?

అప్పుడే ఎలా వస్తారు??

అట్ బారానుంచిరావడానికి కనీసం గంటపడుతుంది. ఫోన్‌లో మాట్లాడి అరగంటకూడా కాలేదే?

"కాన్ హై?" అన్నాను గట్టిగా, శానోర్యాకి కళ్ళతోనే సైగలు చేస్తూ. మరుక్షణం మూటాముల్లీ బెడ్ క్రిందకి తోసేసిందామె. ఈజీగా బెడ్ మీదకి వాలింది, సుడాన్ ఎక్స్‌ప్రెస్ పేపర్ చేతులోకి తీసుకుంటూ...

"నేను సార్! హోటల్ గుమాస్తాని!"

నాలో భయం తగ్గింది. ముందుకు నడిచి తలుపు ఓరగా తెరిచాను.

అంతే!

నా కాళ్ళక్రింద భూమి రెండుగా విడిపోతున్నట్లు అనిపించింది!

కాళ్ళు గడగడా వణికాయ్!

ఎదురుగా...!

అబుహమీద్ గ్రామంలో నేను బట్టలు దొంగతనం చేసిన యింటి ఓనర్ ... కాదు ఇన్‌స్పెక్టర్——అతని ప్రక్కగా మరో ఇన్‌స్పెక్టర్!

ఇద్దరి చేతుల్లోను పిస్తోళ్ళు మెరుస్తున్నాయి.

ఇద్దరివెనుకగా,సాయుధులైన ఐదుగురు కానిస్టేబుల్స్. అంతా ఎర్రటి యూనిఫారాలు ధరించారు.

"మేజర్ భయంకర్! అయామ్ ఇన్‌స్పెక్టర్ అహ్మద్ దౌలా ఆఫ్ అబుహమీద్. ఈయన బెర్బర్ టౌన్ యిన్‌స్పెక్టర్ మాలాలి" అన్నాడు నవ్వుతూ అహ్మద్‌దౌలా.

"జంటిల్మన్! మీ రెందుకు వచ్చారో నాకు తెలియదు. బహుశా పొరబడి ఉంటారు. నా పేరు భయంకర్ కాదు. ఖయ్యాం. నాభార్య సలీమాతో ఖార్టూమ్‌నుండి వ్యాపారం ప్రారంభించే ప్రయత్నాల్లో ఈవూరు వచ్చాం"దృఢంగా ఉద్రూలో పలికాను, నాలోని తడబాటును కప్పిపుచ్చుకుంటూ.

లాడికప్ప జెగిరేలా, రెండునిమిషాలపాటు పెద్దగా నవ్వాడు అహ్మద్‌దౌలా. "మిస్టర్ భయంకర్ పిట్టకథలు చెప్పొద్దు. సగం ధ్వంసం కాబడిన మీ జీపుని గుర్తించగానే మీరు ఈవూళ్ళో దిగివుంటారని ఊహించి వేట ప్రారంభించాను. అంతేకాదు, మరోసాక్ష్యం, నువ్వు ఇప్పుడు ధరించిన దుస్తులు నా ఇంట్లోనుంచి దొంగిలించినవే."

లాభంలేదు! దొరికిపోయాను.

"నీతో లోపలవున్న ఆ అమ్మాయి ఎవరు?" అడిగాడు ఈసారి తీక్షణంగాచూస్తూ ఇన్‌స్పెక్టర్ 'మాలాలి.'

"నాకాబోయే జీవిత భాగస్వామి"

"కావచ్చు, కానీ అంతకంటే మరో 'ప్రత్యేకత' ఉండాలి. లేకుంటే సాహసంతో దేశాలు పారిపొయ్యేంత ధైర్యం ఉండదు."

"అంతకంటే ఏంలేదు."

"నువ్వు చెప్పనక్కర్లేదు. మీ ఇద్దరి వర్ణనలు, వివరాలు ఈరోజే ఇండియాకు కేబుల్ లో చెబుతాం. రాత్రికల్లా మీ జీవిత చరిత్రలు తెలుస్తాయి. దయచేసి బైటికి కదలండి" కఠినంగా పల్కాడు నా చేతికి సంకెళ్ళు బిగిస్తూ.

"మిస్! లోపల మీరేం పిచ్చి ప్రయత్నాలు చెయ్యొద్దు. ఇక్కడ భయంకర్ కాలిపోతాడు. ప్లీజ్ కమాట్." అరిచాడు మాలాలి.

కాన్స్యరా లొంగిపోయింది.

మరో పావుగంటలో వాన్ నుండి క్రిందికి కాలు మోపాను.

ఎదురుగా క్రయిమ్ బ్రాంచ్ పోలీస్ స్టేషన్!

* * *

రాత్రి తొమ్మిది గంటలవుతుంది.

స్టేషన్ లోవున్న చిన్న సెల్ లో—కటకటాల వెనుక వున్నాం.

బంధింపబడి ఈ స్టేషన్ కు తీసుకురాబడిన తరువాత కాన్స్యరా, నేను ఎక్కువ మాట్లాడుకోలేదు.

ఇద్దరం ఆలోచనా గ్రస్తులమై గంభీరముద్రవహించాం. బయట ఏదో మోటారు వాహనం ఆగిన చప్పుడయింది.

టకటక బూట్లచప్పుడు...

ఇన్ స్పెక్టర్ మాలాలి! "మిస్టర్ భయంకర్! ఇటీజ్

కన్ ఫర్మ్డ్ దట్ యూ ఆరే మిలిటరీ మేజర్! మిస్ శాన్యోరా మీరు మాజీ భారత గూఢచారిణి!'' అన్నాడు కటకటాలముందు నిలబడి అదోలా నవ్వుతూ.

త్రుళ్ళిపడ్డాను.

శాన్యోరానుకూడా గుర్తించేసారు. ఇక అబద్ధం ఆడి ప్రయోజనం లేదు.

''మీకు తెల్సిపోయింది'' అన్నాను ధైర్యంగా నవ్వుతూ.

ఇన్ స్పెక్టర్ మాలాలి గడ్డం పీక్కుంటూ గర్వంగా నవ్వాడు. ''అవును ఇండియానుంచి కేబుల్ వచ్చింది. మీ ఫిజికల్ డిస్క్రిప్షన్ పంపిన వెంటనే మిలిటరీ ఇంటలిజెన్స్ నిన్నూ, సీక్రెట్ సర్వీస్ శాన్యోరాను వెంటనే గుర్తించాయి. అంతేకాదు, మీ ఆచూకీ తెల్పుకుని, మిమ్మల్ని పట్టియివ్వబోతున్నందుకు ఇండియా తన అభినందనలు తెలిపింది. అదిసరే! ఇంతకూ మీరు సుడాన్ ఎందుకు వచ్చినట్లు?''

మాలాలి నోటివెంట వెలువడ్డ చివరివాక్యం పెళుసుగా ధ్వనించింది.

''ఇప్పుడు మేమేం మాట్లాడదల్చుకోలేదు.'' అన్నాను శబ్దం కాకుండా నవ్వుతూ.

ఇన్ స్పెక్టర్ మాలాలి కోపంగా, బూటుకాలితో నేలను తన్నాడు. ''మిస్టర్ భయంకర్! నేను తల్చుకుంటే మిమ్మల్నిద్దరినీ శవాలుగా మార్చి-పారిపోతుంటే కాల్చామని ఒక్క సాకుతో తప్పించుకోవచ్చు.''

''మైడియర్ ఇన్ స్పెక్టర్! మమ్మల్ని ఏదో భయపెట్టాలని ప్రయత్నించవద్దు. అంతులేని మా 'ఎస్కేపేడ్ జర్నీ'లో ఎన్నోరకాల మానవ, మారణ, భయంకర

మన స్తత్వాలు రుచిచూసాము. అందుకే నీ అధికారం, అహంకారం నాపై అంత ఎఫెక్టు చూపవు. పులిని జయించినవాడు పామును ఎగురగొట్టగలడు.

"పోతే, మమ్మల్ని చంపే విషయం, అంత అవసర మైతే. మా ప్రాణాన్ని మేమే తీసుకుంటాం కానీ ఆ అవకాశం ఎవరో అనామకులకు యివ్వం."

మాలాలి కోపంతో రెచ్చిపోయాడు. "మిస్టర్ భయం కర్! హద్దులుమీరి మాట్లాడుతున్నావ్."

పెదవులమీద చిరునవ్వు కదిలించాను. వాతావరణం టెన్షన్‌గా వుందని గ్రహించాను. "అదే నిజమైతే అయాం సారీ ఇన్‌స్పెక్టర్. సిగరెట్టు వుందా మీదగ్గర"

మౌనంగా సిగరెట్ తీసి కటకటాల్లోంచి లోపలకు అందించాడు మాలాలి. అతను ఆఫర్ చేసిన లైటరుతో సిగరెట్ ముట్టించుకున్నాను. "థాంక్యూ వెరీమచ్ ఇన్‌స్పెక్టర్!" అన్నాను లైటర్ యిచ్చివేసి.

గట్టిగా ఓ దమ్ములాగి, సిగరెట్ కాన్స్యేరా చేతిలో పెట్టాను. ఆమె కళ్ళతోనే నవ్వి సిగరెట్ పీల్చసాగింది.

"మిస్టర్ భయంకర్! ఫరవాలేదు. మరో సిగరెట్ తీసుకోండి." మొహమాట పడుతూ పలికాడు మాలాలి.

అతనివేపు చూసి నవ్వి, "నో థాంక్యూ ఇన్‌స్పెక్టర్! ప్రేయసీ ప్రియుల మధ్య యిలాంటివి సరదాగా వుంటాయి."

"ఆల్‌రైట్! అసలు విషయం మర్చాను" అన్నాడు ఇన్‌స్పెక్టరు దగ్గి.

"ఏమిటది?"

"అధికారుల ఆర్డర్స్ ప్రకారం సాయుధులయిన పోలీసుల కాపలాతో వాన్ ద్వారా మీరు ఈ రాత్రికే ఖార్టూమ్ సెంట్రల్ జైలుకి తరలించబడతారు. మీగోడవ అక్కడి వాళ్ళు చూసుకుంటారు. మరో అరగంటలో ప్రయాణం" అంటూ వెనుదిరిగి, బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయాడు ఇన్ స్పెక్టర్ మాలాలి.

*    *    *

పోలీస్ వాన్ — బెర్బర్ టౌన్ పొలిమేరల్లో జి. టి. రోడ్డుమీద పరిగెడుతోంది.

డ్రయివింగ్ కాబిన్ కీ, మేం వున్న వాన్ వెనుక భాగానికి మధ్య ఓ చిన్న కిటికీలాంటిది ఉంది. డ్రయివర్ వెనక్కి తిరిగి ఆ ఖాళీగుండా వాన్ లో ఉన్నవాళ్ళతో మాట్లాడవచ్చు. బస్సులోలాగ, రెండు వరసలుగా సీట్లు ఉన్నాయి ఆ వాన్ లో. నేనూ, కాన్స్టేరా, సాయుధ కానిస్టేబుల్స్ మధ్య కూర్చున్నాం.

అప్పుడప్పుడు కిటికీగుండా డ్రయివర్ ప్రక్కన కూర్చున్న ఇన్ స్పెక్టర్ మాలాలి వేపూ, రోడ్డు వేపూ చూస్తున్నాను. ఖార్టూమ్ జైలు మనసులో కదుల్తోంది.

కాన్స్టేరా, నేనూ ఏమీ మాట్లాడుకోవటం లేదు. తప్పించుకు పారిపోయే ఆలోచన నాలో పుట్టింది కానీ, అది ఎంత అసాధ్యమో చుట్టూవున్న కానిస్టేబుల్స్ వల్ల నిరూపితమాతుంది.

తెగించి పారిపోవచ్చు!

అయితే శరీరంనిండా బుల్లెట్లతో...ఆ ప్రమాదం ఖచ్చితంగా ఉంది. కాన్స్టేరాకికూడా తొందరపడి ప్రతిఘటించే ప్రయత్నాలు చేయవద్దని కళ్ళతో హెచ్చరించాను.

ఉన్నట్టుండి...కీచుమన్న శబ్దం— సడన్ బ్రేకు–పెద్ద కుదుపుతో ఆగిపోయింది వాన్.

ఉలిక్కి పడి పార్టిషన్ ఖాళీగుండా రోడ్డువైపుకు చూసాను.

ఎదురుగా ఓ జీప్ ఆగివుంది.

ఆ జీప్కీ, మా వాన్ కీ మధ్యగా ఓ గడ్డంమనిషి పోలీసు ఆఫీసర్ దుస్తుల్లో ఉన్నాడు. అతని కళ్ళు అగ్ని కణాల్లా మండుతున్నాయి. పెదవుల వెనుక కోపాన్ని బిగపట్టినట్లు అనిపిస్తోంది.

వాన్ డ్రయివర్ ప్రక్కగావున్న ఇన్ స్పెక్టర్ మాలాలి తటాలున వాహనందిగి, గడ్డం పోలీస్ ఆఫీసర్ ఎదురుగా అటెన్ షన్ లో నిలబడి సెల్యూట్ చేసాడు. డ్రయివర్ ఎప్పుడో దిగిపోయి సెల్యూట్ కొట్టి భయంగా నిలబడి వున్నాడు.

"ఇన్ స్పెక్టర్! నీకెన్ని గంటలకి ఫోన్ చేశాను. ఖైదీలని తీసుకొని బయల్దేరమని?" ఉద్రేకంగా అన్నాడు పోలీస్ ఆఫీసర్ చేతిలోని స్టిక్ ని అరచేతిలో తట్టుకుంటూ.

ఇన్ స్పెక్టర్ మాలాలి భయంగా చేతులు నలుపుకుని, మళ్ళీ స్ట్రెయిట్ గా నిలబడ్డాడు. "క్షమించాలి డి.ఐ.జి. సాబ్! వాన్ కి బయలుదేరేముందే మైనర్ రిపేర్స్ ఉన్నాయి. దూరపు ప్రయాణం! ఏదయినా ఆటంకాలు వస్తాయని అవి రాత్రికిరాత్రే బాగుచేయించి ఖైదీలతో బయల్దేరాను. మాఫ్ కర్నా సర్! గంటపైగా లేటయింది"

గడ్డంమనిషి ఖాట్రూమ్ డి. ఐ. జి. అని గ్రహించాను.

"డామ్ యువర్ బ్లడీ రీజన్స్! ఆ విషయం నాకు ఫోన్ లో చెప్పాల్సింది. లేదా మోతీమొహిందీ స్టేషన్

నుండి వాన్ అడిగి తీసుకోవాల్సింది. వీళ్ళు మామూలు ఖైదీలుకారు. ఇంటరాగేట్ చేసి అనుమానం తీరిన తర్వాత ఇండియా పంపాలి. అటువంటి కాలాంతకుల్ని దగ్గర వుంచుకొని నువ్వు లేట్ చేస్తే వాళ్ళు పారిపోయారేమో నని మేమెంత హడలి చచ్చామో నీకు తెల్సా?" యింకా కోపంతో ఊగుతూనే వున్నాడు డి.ఐ.జి.

"ముఝే మాఫ్ కర్నాసాబ్! యిక యెప్పుడూ ఇలాంటి పొరపాట్లు జరగవ్" బ్రతిమాలసాగాడు యిన్స్పెక్టర్ మాలాలి.

"ఆల్ రైట్! ఆల్ రైట్! ఆ ఖైదీలకి బేడీలువేసి నా జీపులో కూర్చోపెట్టండి. మా వెంట, మీ వాళ్లోని దిట్టమైన యిద్దరు గార్డ్సని పంపండి చాలు. నేను ఈ రాత్రి ఒంటిగంటలోగా ఈ బందీల్ని ఖాట్మాన్ జైల్ సూపరింటెండెంట్ కి అప్పజెప్పాలి. తర్వాత విచారణ చేయాలి. ప్రస్తుతం మీరు వెనక్కి వెళ్ళవచ్చు. అండర్ స్టాండ్?"

"ఓ.కె. సర్...ఓ.కె. సర్...ఆప్ కా మర్జ్ హై..." అంటూ వెనక్కి తిరిగాడు ఇన్స్పెక్టర్ మాలాలి బాధ్యత వదలిందనే సంతోషం ముఖంలో కనబరుస్తూ. రెండు నిముషాల్లో శాస్త్రీ, నేను, జీపులోకి మారాం.

ఇన్స్పెక్టర్ మాలాలి, డిప్యూటీ యిన్స్పెక్టర్ జనరల్ రెండు నిముషాలు మాట్లాడుకొని విడిపోయారు.

వాన్ వెనక్కి తిరిగి, వెళ్ళిపోయింది.

ఇద్దరు గార్డ్సు, నేను, శాస్త్రీ, డి.ఐ.జి, డ్రైవరూ వున్న మా జీపు, ఖాట్మాన్ వేపు లాగిపెట్టి వదలబడ్డ బాణంలా ముందుకు దూకింది.

వాతావరణం చలిగా వుంది.

డి. ఐ. జి. సిగరెట్లు పంచాడు.

నేనూ, శాన్యోరా రెండు తీసుకొని 'థాంక్స్' చెప్పాము.

గార్డ్స్ డి.ఐ.జి. ఆఫర్ కి కంగారుపడిపోయారు.

"మేం కాల్చం సార్. వద్దు." అన్నారు బిడియపడి పోతూ, వకవైపు భయపడ్తూ.

మూడ్ మారినట్టుంది డి.ఐ.జి.కి.

"పర్వాలేదు.ముట్టించండోయ్. మొహమాట పడొద్దు. బయట చలి దంచేస్తోంది." అంటూ ప్రోత్సహించాడు నవ్వుతూ.

నిర్భయంగా సిగరెట్లు కాలుస్తున్న మా వేపు చూస్తూ, గార్డ్లు కూడా ముట్టించారు.

రెండు నిముషాలు గడిచాయ్.

సిగరెట్ పీక బైటికి పడేస్తూ వులిక్కిపడి ప్రక్కకు చూశాను.

"భయంకర్!" అంది ఆశ్చర్యంతో శాన్యోరా ఆ విషయాన్ని ముందే గ్రహించి.

ఇద్దరు గార్డ్లూ స్పృహకోల్పోయి మెడలు వాల్చేసి ...మరి మేం...ఎందుకు స్పృహ తప్పిపోలేదు.??

"సర్" పిల్చాను కంగారుగా.

డ్రైవర్ ప్రక్కగా వున్న డి.ఐ.జి. తల వెనక్కి తిప్పాడు ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా చూస్తూ.

విషయం చెప్పాను, కొంపదీసి మేం కాల్చవలసిన సిగరెట్లు వాళ్ళు తాగలేదుకదా అన్న అనుమానంతో.

"మీరెందుకు స్పృహతప్పి పడిపోవాలి?" అన్నాడు నవ్వుతూ డి.ఐ.జి.

"మీ మాటలు నా కర్థంకావటంలేదు." గొణిగింది కాన్స్యోరో.

"ఇకనుంచీ అర్థం అవుతాయ్."

"అంటే?" అన్నాను వింతగా చూస్తూ.

"మిస్టర్ భయంకర్ అండ్ మిస్ కాన్స్యోరా! నేను ఇన్‌స్పెక్టర్ జనరల్‌ని కాదు. మీరు యింతకుముందు ఫోన్ చేసిన న్యూవరల్డ్ ఆర్గనైజేషన్ సేవకుడ్ని. అయామ్ మిస్టర్ నైరోబీ. అసలు వేషాన్ని యిప్పుడు చూసే అవకాశంలేదు. ఆ డ్రైవర్ కూడా నా అనుచరుడే." అన్నాడు డ్రైవర్‌ని జీపు ఆపమని సైగ చేస్తూ.

కాన్స్యోరా నేను ఆశ్చర్యానందాలతో వుక్కిరిబిక్కిరయిపోతూ, అతనివేపు మెరిసేకళ్ళతో చూశాము.

జీపు ఆగింది. "ఖుద్దుస్! ఆ గార్డ్స్‌ని రోడ్డుకు రెండువేపులా పారెయ్," ఆజ్ఞాపించాడు డ్రైవర్ని, నైరోబీ.

కాన్స్యోరా, నేను తటాలున అతన్ని అలాగే కౌగలించుకున్నాం. "మిస్టర్ నైరోబీ! వుయ్ ఆర్ వెరీగ్లాడ్. ఈ క్షణంలో మీరెంతో ఆత్మీయులుగా అనిపిస్తోంది మనసుకు. చావుబ్రతుకుల మధ్య బ్రతుకుతూ, కొద్ది రోజులు అసలు ప్రాణాలతో సుడాన్ చేరి మిమ్మల్ని ప్రాణాలతో చూస్తామని కలలో కూడా అనుకోలేదు." అన్నాను ఆనందబాష్పాలతో.

"ఎస్ బ్రదర్ నైరోబీ!" అంది తడిసికిన చెక్కిళ్ళతో కాన్స్యోరా.

నైరోబీ, ఆమె తల ఆప్యాయంగా నిమిరాడు.

కఫుల్! మీరే నన్ను క్షమిం
టపడి, దారితప్పి ఎటో పోతే
మకో లేకపోయాం. యిన్నాళ్లూ
న్సిల్ అయిపోయినదేమోనన్న
!, మీరు వచ్చారు. సుడాన్‌లో
ం లేదని ముందే చెప్పానుగా.
ండు రోజులు మీరు పూర్తి
అప్పటికి మీరు మానసికంగా
రు. దెన్ యువిల్ మూవ్ టు
బయలుదేరదాం."
కా చివరా, ఈ చివరం చీకట్లో
ప్రపంటూ వచ్చి స్టీరింగ్ ముందు

ఈల వేస్తూ యింగ్లీష్ పాట

*　　　*

శాఖాధిపతి నైరోబీ శాన్యో
బెడ్ మీంచి కదలనివ్వలేదు.
అద్దంలో ముఖం చూసుకో
శరీరాన్ని రంగొచ్చినట్లనిపిం
పట్టున వుండటం, నైరోబీ
బలవర్థకాహారం, ఫాస్ట్ రిలీ
కావచ్చు.
చేసి బట్టలు ధరించగానే ఆ
షన్డ్ రూమ్‌లోనికి నైరోబీ

"మేజర్ భయంకర్! మీరు రేపే అరబిక్ ఎడారికి ప్రయాణమవ్వాలి. యిప్పటికే అవాంఛనీయ సంఘటనల వల్ల ఈ ఎస్సయిన్‌మెంట్ ఎంతో ఆలస్యమైంది. కాని, వ్యక్తిగత కారణాలు సానుభూతి పొందగల్గినవే అయినప్పటికీ, ఆదర్శభావాలతో ఏర్పరచబడిన ఈ మరో ప్రపంచ సంస్థ కార్యకలాపాలకు అవి అడ్డురాకూడదు. ఏమంటారు?" అన్నాడు నైరోబీ, ఈజీఛైయిర్‌లో ఆశీనుడవుతూ.

"మిస్టర్ నైరోబీ! మీరు చేసిన హెల్త్ ట్రీట్‌మెంట్ గొప్పది. రెండు దినాల్లోనూ మానసిక, భౌతిక శక్తులు కూడగట్టుకున్నాం. రేపు కాదు. మీరు ఆదేశిస్తే ఈ రోజే అరబిక్ ఎడారిలో ప్రవేశించి—చైనీ ప్రొఫెసర్ హోయాంగ్ హోను యిక్కడికి తీసుకువచ్చే ప్రయత్నాలు చేస్తాం."

"ఇటీజ్ ట్రూ మిస్టర్—నైరోబీ!" అంది ఉత్సాహంగా కాన్యోరా.

"థాంక్స్ మిస్టర్ భయంకర్! ఇక ప్రయాణ ప్రణాళిక చెపుతాను. మీరు జీపులో ఎడారిలో ప్రవేశించి, ప్రయాణిస్తూ పోతే, మన ఆబ్జెక్ట్ అయినటువంటి ప్రయోగాలు జరిగే చైనీస్ మిలిటరీ స్థావరాన్ని చేరుకోవడానికి కనీసం 15 రోజులు పడుతుంది. అందుకే మరో ఏర్పాటు చేసాను.

"రేపు అర్ధరాత్రి దాటిన తర్వాత ఓ హెలీకాప్టర్ మిమ్మల్ని చైనీస్ లేబరేటరీ స్థావరానికి సుమారు నూట ఇరవై మైళ్ళదూరంలో దింపేస్తుంది. అయితే మిమ్మల్ని దింపబోయేది కేవలం ఇసుకగుట్టల మీదకాదు. అక్కడ

ఎడారిదొంగల స్థావరం ఒకటివుంది. వారికి, మాకు స్నేహంవుంది. నేను ఇవ్వబోయే నల్లమందు పార్సిల్ మరో ఉత్తరం ఎడారి దొంగల నాయకుడికి మీరు ఇవ్వాలి.

"వాళ్లు మీకు ఆతిధ్యం ఇస్తారు. ట్రక్కుగాని, జీపుగాని నాయకుడు సప్లై చేస్తాడు. దానితో మీరు చైనీస్ స్థావరాన్ని ఛేదించుకుని రావాలి. మీకు ఇవ్వబోయే పవర్‌ఫుల్ వైర్‌లెస్ సెట్స్‌ద్వారా నువ్వూ, శాన్యోరా ఎప్పుడయినా, ఎక్కడినుంచి అయినా మాట్లాడవచ్చు.

"సైంటిస్ట్ "హాయంగ్ హా"ని తోడ్కొని మీరు మళ్ళీ ఎడారిదొంగల శిబిరానికి చేరుకొంటే చాలు. అక్కడనుంచి మీరు వెంటనే సుడాన్‌కి సులువుగా మాచే రప్పించబడతారు. ఈరోజునుంచి సరిగ్గా మూడు రోజుల తర్వాత ఈ దేశాన్నుంచి ఓ ప్రఖ్యాత క్లబ్ డ్యాన్సర్, ఆమెతండ్రి, ఓ క్లబ్ ప్రొప్రయిటర్ ఇండియాలో నృత్యప్రదర్శన నిర్వహించడానికి వెళుతున్నారు.

"మీ అస్సయిన్‌మెంట్ సక్సెస్ అయితేవారి వేషాల్లో మీరు ఇండియాలో ప్రవేశించి,—మాయమై మనసంస్థ సభ్యులను కలుసుకుంటారు. సో, మూడురోజుల్లోగా మీరు కార్యం సఫలం చేసుకుని రావాల్సివుంది. ఎనీ క్వశ్చన్స్?..." అన్నారు ఆగి.

"మిస్టర్ నైరోబీ! డైరెక్టుగా మేం చైనీస్ స్థావర పరిసరాల్లో ల్యాండ్ అవ్వచ్చుగా! ఎడారి దొంగల సహాయం పొందడం ఎందుకు?" అడిగింది శాన్యోరా.

ఆమెవైపు కోపంగా చూసాను నేను.

"సిల్లీ క్వశ్చన్ శాన్యోరా! చైనీస్ స్థావరానికి రాడార్ ఎక్విప్‌మెంటు వుండవచ్చు. అలాంటప్పుడు హెలీకాప్టర్ ఎలా దగ్గరగా ల్యాండ్ అవుతుంది?" అన్నాను.

నాలిక కరుచుకుందామె.

"ఓ... అయాం సారీ!"

"మేజర్ భయంకర్ చెప్పింది నిజమే మిస్ శాన్యోరా! అయితే చాలామందికి చైనీస్ లేబరేటరీ ఏదో వాతావరణ పరిశోధన కేంద్రంగానే తెలుసు. చైనీస్ శాస్త్రజ్ఞుడు కృత్రిమ వర్షాలు కురిపించే ప్రయోగాలు చేస్తున్నట్లు ఈ సుడాన్ ప్రభుత్వానికి మరికొంతమంది గూఢచారులకు మాత్రమే తెలుసు.

"దీనివల్ల ఆ సైంటిస్టుకు అంత ప్రమాదం లేదని అనుకొని, అతిజాగ్రత్తగా వుండటం లేదని మా సర్వేద్వారా తెలిసింది. ఈ కారణాలవల్ల శత్రువులు ముందు జాగ్రత్తగా ఓ సామాన్య రాడార్‌ని మాత్రమే అమర్చుకొన్నారు. అది మీరుదిగే ప్రాంతాన్ని లొకేట్ చెయ్యలేదు."

"ఎడారిలోని చైనీయులు ఎడారి దొంగలను గుర్తించి అణచివేయలేదేం?"

"లేదు. యెందుకంటే ఈ ఎడారిదొంగలు మెరుపుదాడులు చేసి మాయమౌతుంటారు. ఒకచోట స్థిరంగా నివసించే అలవాటు వీరికి లేదు."

"వెల్ మిస్టర్ నైరోబీ! నాక్కావలసిన ఆయుధాలు సిద్ధం చేయండి. రేపే ప్రయాణమౌతాం."

"అలాగే, మరో విశేషం. పోలీసుదళాల మధ్య నుంచి మీరు పారిపోయినవార్త ఊరులో అట్టుడికి పోతోంది. బహుశా మిమ్మల్ని వెదకడానికి ఇండియన్ ఏజంట్స్ ఎవరయినా, యెప్పుడయినా రావచ్చు. అందు చేత మీరు రేపే ఆశయంకోసం బయలుదేరడం అన్ని విధాలా మంచిదనిపిస్తుంది."

* * *

రాత్రి మూడు గంటలు దాటింది.

"ఇంకా ఎంత టైము తీసుకుంటుంది?" అడిగాను హెలీకాప్టర్ పైలట్ని.

"మరో అరగంటలో యెడారిదొంగల ముఠా స్థావరాన్ని చేరుకోబోతున్నాం" అన్నాడతను నవ్వి.

వైర్ లెస్ సెట్టు, రెండు మెషిన్ గన్ లు, ఒక రేడిమో డిటెక్టర్, అరచేయి పొడవులో వున్న ఓ సైన్ ఎమ్.ఎమ్. వాల్టర్ పెరాబుల్లమ్ రివాల్వర్, మరో ఇటాలియన్ రెబెట్టా—ఇవి మా ఆయుధాలు.

ఫస్ట్ ఎయిడ్ కిట్, మినీ టార్చిలైటు, పవర్ ఫుల్ షార్ట్ ఫోకస్ బైనాక్యులర్స్, వాకీటాకీ, కేమఫ్లేజ్ ఓవరాల్స్, ఇంకా యెడారిలో ప్రయాణానికుపయోగపడే యాంకిల్ బూట్లు, విండ్ షీటర్ గాగుల్స్ మొదలయిన పరికరాలుకూడా మాతో హెలీకాప్టర్లో ప్రయాణిస్తున్నాయ్.

శాన్యోరా కేబిన్ లోంచి, కిందుగా వెనక్కి పరిగెడుతున్న యెడారి యిసుకదిబ్బలవేపు గంభీరముద్ర వహించి మౌనంగా పరికిస్తుంది.

చైనీయుల సాధరాన్ని ఊహలతో మనోఫలకంపై చిత్రించుకొంటున్నాను.

పన్నాల్సిన వ్యూహం—అస్పష్టంగావుండి మెదడులో కదులుతోంది.

మరో పావుగంటలో హెలీకాప్టర్ ఒకచోట ల్యాండ్ అయింది.

నాగుండెలు ఎందుకో గుబగుబ కొట్టుకోసాగాయ్.

శానోర్యరా, నేను బయటకుదిగి టార్చిలైట్లు వెలిగించి, పరిసరాలు పరికించసాగాం.

పైలట్ సామానులు హెలీకాప్టర్ నుండి దింపి, తన వెంట నడవండంటూ చేతిలోని టార్చిలైటుతో ముందుకు కదిలాడు.

ఎడారిమీదుగా సన్ననిగాలి కదుల్తోంది, ఇసుకను పొరలు పొరలుగా రేపుతూ.

ఎదురుగా రంగురంగుల గుడారాలు వృత్తాకారంగా వేయబడి వున్నాయి. అన్ని గుడారాలకు మధ్యగాకొన్ని ఒంటెలు రాటలకు కట్టివేయబడి వున్నాయి. ఓ కాగడా మొత్తం స్థలానికంతటికీ సన్నని కాంతినిస్తూంది.

పైలట్, నేనూ, శానోర్యరా ఒకరి వెనుక ఒకరం నడుస్తున్నాం. అడుగు నేలమీద మోపినప్పుడు ఇసుకలో కూరుకొని రెండో అడుగు వేయడం కష్టమౌతుంది.

అంతులేని ఈ ఎడారి ఇసుకలో, అర్ధరాత్రి వేళ ఇలా నడుస్తూండవలసి వస్తుందని నేనెప్పుడూ ఊహించ లేదు.

ఉన్నట్లుండి, చేతిలో ఒక రైఫిల్ ధరించిన ఓ పదిహేనేళ్ళ కుర్రాడు మాముందు మెరుపులా ప్రత్యక్ష మయ్యాడు.

"అక్కడే ఆగండి! ఎవరు మీరు?" అడిగాడు రైఫిల్ మావైపు ఎయిమ్ చేస్తూ.

పైలట్ వెనక్కి తిరిగి నాకు ఏవో సైగలు చేసాడు.

మరు క్షణం నా చేతిలో వున్న కార్డుబోర్డు పెట్టెవిప్పి, ఆ కర్రాడికి చూపించాను. అది సుమారు ఏభైవేల పౌండ్లు ఖరీదుచేసే నల్లమందు.

"ఓహ్. అర్థమైంది ఎవరి తాలూకో...రండి" అన్నాడతను సంతోషంతో ఎగిరి గంతువేస్తూ. అతన్ని ఫాలో అయేం.

*                    *                    *

"స్వాగతం. దయచేయండి" అన్నాడు నాయకుడు పరుపుమీద చెయ్యి తాటిస్తూ.

ముగ్గురం మౌనంగా మెత్తని పరుపులమీద ఆసీనులయ్యాం.

పరిచయాలు జరిగాయి.

నాయకుడి పేరు సులేమాన్. నల్లమందు పాకెట్ అందుకుని మురిసిపోయాడు నాయకుడు. నైరోబీ లేఖ చదివి గంభీరంగా తల ఊపాడు. చల్లని పానీయాలు సేవించి మరో అరగంట విషయాలు చర్చించుకున్నాం.

"మీ సేవకులం ఇకనుంచి మేమంతా...." అన్నాడు నవ్వుతూ సులేమాన్.

"ఇక నిద్రపోండి. మరో రెండు గంటల్లో తెల్లవారుతుంది" అని సలహా ఇచ్చాడు.

"మిస్టర్ భయంకర్! నేను వెళతాను. మీ వైర్‌లెస్ కాల్‌కోసం ఆతృతతో ఎదురు చూస్తూ వుంటాను. మీ మెస్సేజ్ వచ్చిన కొద్ది నిముషాల్లో హెలీకాప్టర్ ఇక్కడ వుంటుంది" శుభాకాంక్షలు చెప్పి, వెళ్ళిపోయాడు పైలట్.

రాత్రి— ఇక కొద్ది గంటల్లో రూపం మార్చుకోబో తుండగా నేను, కాన్స్యోరా మాకు నియమించబడ్డ ప్రత్యేక గుడారంలో నిద్రకుపక్రమించాం.

*  *  *

మధ్యాహ్నం పన్నెండు గంటలవుతోంది.
జీప్ ని అతి నేర్పుగా నడుపుతున్నాను.

ఎదురుగా అంతులేని ఎడారి ఇసుక సముద్రంలా వుంది. ఉదయాన్నించీ డ్రైవింగ్ చేసి, అలసిపోయిన కాన్స్యోరా వాటర్ బ్యాగ్ లో నీళ్ళతో ముందు ముఖాన్ని కడుక్కుని తర్వాత నోరు తడుపుకుని విశ్రాంతిగా నిట్టూర్పు విడిచింది.

వెనుక సీట్లో ఎడారిదొంగల నాయకుడు సులేమాన్— బుగ్గమీసాలు దువ్వుకొంటూ ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అతనికటూ ఇటూ ఇరవై సంవత్సరాల వయస్సుగల దృఢకాయులైన ఇద్దరు అనుచరులు ఆసీనులై వున్నారు. అందరం విండ్ షీటర్ గాగుల్స్, యాంకిల్ బూట్స్ ధరించి వున్నాం.

"మేజర్! జీప్ ని కుడివేపుకు త్రిప్పి ఆ ఇసుక గుట్టల ప్రక్కగా పోనీ" అంది కాన్స్యోరా వళ్ళోని డెజర్ట్ మేప్ ను, దిక్సూచినీ చూస్తూ.

జీప్ ని కుడివైపు పల్లానికి త్రిప్పి ముందుకు దూకించాను.
సూర్యుని వేడి కిరణాలకు వాతావరణం నిప్పులు చెరుగుతోంది.

ఎటు చూసినా నిశ్చలత్వంతప్ప వేరేమీ కనిపించటం లేదు. ఎండమావులు ఊరిస్తూ ఎక్కడచూసినా కనబడుతున్నాయి.

నడినెత్తిన మండుతున్నాడు సూర్యుడు. వేడి ఆకాశం అద్దంలా మెరుస్తోంది. అప్పుడప్పుడూ ఎడారి ఇసుక మీద విపరీతమైన వేడి గాలులు నలుదిశలా పరుగులు తీస్తున్నాయ్.

వాటి ధాటికి దుమ్మూ, ధూళి అంతులేకుండా ఎగురుతూ ఒకచోట ఇసుక గుట్టలు పేర్చుతూంటే, మరోచోట తరిగిస్తూ రంగు రంగులుగా, తమాషాగా తిరుగుతున్నాయ్.

ఎండ వేడికి తట్టుకో నేలా జీప్ ప్రక్కల, తారు పూసిన గోనె బట్టలు వేలాడదీయబడ్డాయి. వాటి క్రింద కూలింగ్ గ్లాసులు బిగించబడి వున్నాయ్.

జీప్ వెనకాల పొడవాటి త్రాళ్ళతో బంధించబడిన రెండు తెల్లని అరేబియన్ అశ్వాలు వెనగ్గా పరిగెడు తున్నాయ్.

అత్యవసర పరిస్థితుల్లో ఉపయోగార్థం వాటిని వెంట పెట్టుకొని వెళ్తున్నాం.

మధ్యాహ్నం రెండు గంటలదాకా జీప్ ని డ్రైవ్ చేసి రెస్ట్ కోసం ప్రయాణాన్ని ఆపివేశాం.

అయిదుగురం జీపు దిగాం.

శాన్డ్రా__ వెంట తెచ్చిన గోధుమ రొట్టెలు పంచి పెట్టింది. అది తిని, బీర్ కడుపునిండా త్రాగాం. మళ్ళీ ముఖాలకూ పెదాలకూ చల్లని క్రీమ్ దట్టంగా పూసు కున్నాం.

సులేమాన్ శిష్యులు జీప్ వెనకాల కట్టబడిన గుర్రాలకు ఆహారం తీసుకు వెళుతూండగా సులేమాన్ ప్రశ్నించారు.

"సాబ్! ఎన్ని గంటలకు చేరుకుంటాం చైనీయుల క్యాంప్ను?"

షేర్ నానుకొని నిలబడి నవ్వాను.

"ఏం? రైఫిల్ కి పని చెప్పాలని ఆతృతగా ఉందా?"

"బ్రహ్మాండంగా, ఊహించారు. నెలకు పదిహేను రోజుల పోరాటం, మిగతా పదిహేనురోజులూ మందూ, మగువా కావాలి. ఆ మూడూ లేకపోతే పిచ్చెక్కిపోతుంది" అన్నారు సులేమాన్ ఖాళీ బీర్ బాటిల్ పైకెత్తి ఆఖరు చుక్కలతో నాలుక తడుపుకుంటూ.

అంతలో జీప్ వెనకాలనుంచి సులేమాన్ అనుచరులు పెద్దగా కేకలు పెట్టారు.

"సాబ్! ఎవరిదో ఓ ట్రక్కు ఇటువేపే వస్తోంది." అదిరిపడ్డాను.

ధన్...ధన్ మన్న కాల్పులు అరఫర్లాంగు దూరంలో వస్తున్న ట్రక్కులోంచి వినపడ్డాయి.

"కాన్స్యరా! సులేమాన్! క్విక్" అరుస్తూ వారికి సైగలు చేసాను.

మరుక్షణం ఇద్దరూ ఆయుధాలతో వెనక్కి పరుగెత్తి మాయమయ్యారు.

సులేమాన్ అనుచరులు రైఫిల్స్ తీసుకుని పరుగుతో నా దగ్గరకు వచ్చారు.

"మీ యిద్దర్లో ఒకడు జీపు కిందకి దూరండి!" అన్నాను తటాలున స్టేరింగ్ వీల్ కిందపడి వున్న మెషిన్ గన్ అందుకుంటూ.

రెండో అనుచరుడూ, నేను—జీపును అడ్డంగా పెట్టుకొని కాల్పులు ప్రారంభించాం.

అవతలివైపు నుంచి ట్రక్కు దగ్గరగా వచ్చేసింది. ట్రక్కు కాబిన్‌లోంచి ఓ కన్నంగుండా మెషీన్ గన్ బారెల్ బైటికిచూస్తూ దడదడా మ్రోగుతోంది.

చటుక్కున పైకిలేచి ట్రక్కు అద్దాన్ని గురిచూసి కాల్చాను.

మృత్యు గొలుసులా మ్రోగింది నా చేతిలోని సబ్ — మెషీన్ గన్.

ఆశ్చర్యం!!

ట్రక్కు ముందుభాగానవున్న విండ్ మిర్రర్ పగల్లేదు!!

పవర్ ఫుల్ బుల్లెట్ ప్రూఫ్ గ్లాస్ అయ్యుండాలి.

ట్రక్కు వెనకాలభాగం కనబడటం లేదు.

యింతకీ ఎవరు వాళ్లు?

చైనీయులా?

జీపు క్రిందనుంచి సులేమాన్ అనుచరుడు నిర్విరామంగా ఫైర్ చేస్తున్నాడు. తలెత్తి ముందుకు చూసాను.

ట్రక్కు డ్రైవింగ్ కాబిన్‌లో ముగ్గురు నడివయసు వ్యక్తులు ఉండటం గమనించాను. అదే క్షణంలో వాళ్లు, నన్ను చూసారు.

టైర్లు షూట్ చేద్దామని అటువేపు చూసాను.

ప్చ్! లాభంలేదు. టైర్లమీద వాలుగా ఓ లోహపు షీల్డ్ అమర్చబడి వుంది. అది బుల్లెట్ల బారి నుండి టైర్లను రక్షిస్తుంది.

"ఓహో మిస్టర్ భయంకర్! గ్లాడ్‌టు సీయూ! నీ ముఖం — పేపర్లద్వారా మాకు చిరపరిచితమే? వృధా ప్రయత్నం చెయ్యవద్దు. మేము ఈ ట్రక్కులో వుండగా నీ మెషిన్‌గన్ తూటాలు మమ్మల్నేమీ చేయలేవు" ట్రక్కు

టాప్ మీద వున్న చిన్న మైక్ ద్వారా వినబడ్డాయా మాటలు.

మెషిన్ గన్ చిరాగ్గా నేలకేసి కొట్టాను.

"హూ ది హెల్ ఆర్ యూ?"

"పాకిస్తాన్ నుంచి వస్తున్నాం. నిన్నీ ప్రాంతంలో చూడటం ఆశ్చర్యంగా వుంది. నువ్వుకూడా సైంటిస్ట్ హోయాంగ్ హో కోసం వచ్చావని తెలుస్తోంది."

"సైంటిస్ట్ హోయాంగ్ హో?! అతనెవరు?" అన్నాను గట్టిగా—

పకపకా నవ్వు వినబడింది, ట్రక్కుపై నున్న మైకు లోంచి.

"మిస్టర్ భయంకర్! పిచ్చిగా మాట్లాడకు! ఇండియన్ ప్రభుత్వం నీ గురించి వలలు పన్నింది. అంటే—ఏమిటా కోసం బయల్దేరావ్ సైంటిస్ట్ హోయాంగ్ హోను తీసుకు రావడానికి—?"

"ఆ వివరాలన్నీ నీ కనవసరం."

"కాదు. అవసరం. నీకో ఛాన్సు ఇస్తున్నాం. మాతో చేతులుకలుపు. నీ సహాకారంతో హోయాంగ్ హోను తీసుకుపోతాం. అతను తుఫానుల్ని, పిడుగుల్నీ సృష్టిస్తాడు. దేశదేశాల రాజధానులు అతను సృష్టించిన భయంకర వరాలకు మునిగిపోతాయి. తర్వాత లొంగిపోతాయి. అప్పుడు పాకిస్తాన్ దేశదేశాలకు ఆధిపత్యం వహిస్తుంది. తప్పకుండా నీ సహాయాన్ని మర్చిపోడం జరగదు. నీవు కోరిన ప్రతిఫలం యివ్వబడుతుంది. ఏమంటావ్?"

జీపును అలాగే అడ్డంగా వుంచుకొని మోకాళ్ళమీద కూర్చున్నాను—బయటి ట్రక్కులో వాళ్ళకి కనబడకుండా.

ఈ రెండు నిముషాలూ, కబుర్లలో పెట్టాలి ట్రక్కులోని పాకిస్తాన్ ముఠా వాళ్ళని.

"జంటిల్మెన్! చైనీస్ సావరాన్ని గురించి నాకు చాల విషయాలు తెలుసు. నేను నిజంగా, సైంటిస్ట్ హోయాంగ్ హోని ఇండియా తీసుకుపోడానికి ఓ ముఠా తరఫున వచ్చాను. అయితే యిప్పుడు ప్రాణరక్షణకోసం మీతో చేతులు కలిపితే 'ఒడ్డుచేరిన తర్వాత' నన్ను మోసం చెయ్యరనేమిటి గ్యారంటీ?"

"మిస్టర్ భయంకర్! నమ్మక తప్పదు. మీ స్నేహాన్ని సహాయాన్ని కోరకపోయే మనుషులమైతే మిమ్మల్ని మొదటిక్షణంలోనే కాల్చివేసే వాళ్ళం. ఆజీపు నన్ను ఎంతోసేపు అడ్డుకోలేదు."

"నో, నేనొప్పువడంలేదు." అరిచాను బిగ్గరగా. నా తిక్క సమాధానికి వెర్రెక్కిపోయారు ట్రక్కులోని పాకిస్తానీస్.

"మిస్టర్ భయంకర్! ఓసారిలా చూడు."

మైక్ లోంచి తిరిగి వినబడ్డాయ్.

దాహం వేయటంతో రెండు గ్లూకోస్ టాబ్లెట్లు నోట్లో వేసుకొని నప్పరిస్తూ ఓరగా ట్రక్కు వేపు చూస్తున్నాను.

ఆశ్చర్యం!

ట్రక్కు మధ్యభాగంలో ఓకన్నం ఏర్పడింది.

అందులోంచి అదోరకమైన గన్ బారెల్ బైటికి వచ్చింది.

"మిస్టర్ భయంకర్! ఓ బటన్ నొక్కితే యిది బయటకు వచ్చింది. మరో బటన్ నొక్కితే బయటకు వచ్చేది తూటాకాదు.

ఫ్లేర్ !

మంట...

సో... దీన్ని ఫ్లేర్‌గన్ అంటారు.

ఒక్క ఫైర్‌బాల్, ఎగిరి నీ జీప్ మీద పడితే సర్వ నాశనమౌతుంది. నీకు మూడుక్షణాలు మాత్రమే గడువు యిస్తున్నాం. వేగంగా ఆలోచించు.''

''వన్...''

''టూ...''

''.........''

''త్రీ...''

ఢ డేల్‌మంటూ పేలింది అత్యాధునికమైన పాకిస్తానీయుల ''ట్రక్కు!...''

చటుక్కున నా ప్రక్క అనుచరుడ్ని ఇసుకమీదకు పడదోసి వాడిమీద నేను నిలువుగా పడి నెత్తిమీద చేతుల్తో కవర్ చేసాను.

ఫట్... ఫట్... మన్న ధ్వనులు! తునాతునకలయింది ట్రక్కు!

ఆకాశంలో కెగిరిన యినుపముక్కలు కొన్ని నావీపు మీద పడ్డాయి.

రెండు నిముషాల తర్వాత బట్టలకంటిన దుమ్ముదులుపుకుంటూ పైకిలేచాను.

''వెల్‌డన్ శాన్యోరా! యూ డిడ్ ఎ మార్వలస్ జాబ్'' అన్నాను మెషిన్‌గన్ ఊపుకుంటూ, ఓ గుట్టదిగుతూ వస్తున్న శాన్యోరాని అభినందిస్తూ.

''థాంక్యూ మేజర్! కాని సులేమాన్ పరిస్థితి చూడు'' అంది పెదవుల వెనుక నవ్వు ఆపుకుంటూ.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## "హోం డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది.

సభ్యత్వం కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషా

## "వర్షం వచ్చింది"

(ప్రథమ బహుమతి రు 15/-లు పొందిన రచన)

బయట ఉధృతంగా వర్షం కురుస్తోంది.

ఇంగ్లీష్ లెక్చరర్ అటెండెన్స్ తీసుకుంటున్నాడు. తన నెంబర్ లెక్చరర్ నోటినుండి బయట పడగానే సుబ్రావ్ లేచి, "హియర్ సర్." అన్నాడు.

ఆశ్చర్యపోయాడు లెక్చరర్. "ఎప్పుడూ రాని నువ్వు కాలేజీకి వచ్చినందుకే కాబోలు, వర్షం కూడా మొదలైనట్టుంది" అన్నాడు నవ్వుతూ.

"క్షమించండి సార్। కాలేజీ ముందునుంచి వెళ్తుంటే వర్షం వచ్చింది. చేసేది లేక తలదాచుకుందామని ఇలా వచ్చాను" అన్నాడు సుబ్రావ్ నవ్వకుండా.

—బొల్లాప్రగడ సుబ్రహ్మణ్యం, మద్రాసు-24.

## "దొంగ — తుమ్ము"

(ద్వితీయ బహుమతి రు 10/-లు పొందిన రచన)

భార్యాభర్తలు కనుమరుగయ్యేంత వరకు చూసి, కాంపౌండ్‌వాల్ పై నుండి అవతలకి దూకాను. ఇంటి వెనుకకు చేరుకుని నీళ్ళపైపు సహాయంతో పైకి చేరుకున్నాను.

పై నుండి లోపలిహాలుకు మెట్లున్నాయి. మెట్లద్వారా హాలులోకి దారితీసాను.

లోపల చీకటిగా వుంది.

సమయం సాయంత్రం ఏడు కావస్తోంది.

ఈ ఇంటికి చుట్టుప్రక్కల చాలాదూరం వరకు ఇళ్లులేక నిర్మానుష్యంగా వుంటుంది.

లైటువేసి ఒక్కొక్క రూము పరీక్షించాను నాక్కావలసిన సామాన్లు ఎక్కడెక్కడున్నాయోనని.

ముందు కాలీకడుపు నింపుకోవాలి. ప్రొద్దున్నుండీ ఉపవాసమే.

వాళ్లు ఇపుడపుడే రారని నాకు తెల్సు. ఎందుకంటే బజారుకు కాలినడకన పోయివచ్చేసరికి రెండు గంటల కన్న తక్కువ టైముపట్టదు.

తొందర పడకుండ తృప్తిగా భోంచేసాను. వంటగదిలోకెళ్ళి.

తరువాత ఒక ఖాళీసూట్ కేసు తీసుకొని, టైంపీసు, ట్రాన్సిస్టరు, బీరువానుండి బంగారునగలు, ఉన్న కొద్దిపాటి డబ్బు, కొన్ని ఖరీదైన బట్టలు చేర్చి, సూట్ కేసు మూసాను.

సూట్ కేసు తీసుకొని అలా హాలులోకి వచ్చానో లేదో, కొద్దిదూరం నుండి ఎవరో మాట్లాడుకుంటున్న శబ్దం వినవచ్చింది.

ఒక్కసారి షాక్ తగిలినట్లయింది. ఎవరయివుంటారు? వాళ్ళు ఇంత త్వరగా రావటం సాధ్యపడదు అనుకుంటూ, కిటికీరెక్క కొద్దిగా తెరిచి చూసాను. గేటుదగ్గర భార్యాభర్తలు.

భర్త అంటున్నాడు. "నీ మతిమరుపువల్ల అంతదూరం పోయినవాళ్ళం తిరిగి రావలసివచ్చింది. నేనిక్కడే నిల బడతా గాని. త్వరగాపోయి డబ్బు తీసుకురా" అంటూ ఆమె చేతిలోని సంచిని లాక్కున్నాడు.

'అది సంగతి. డబ్బు మరిచిపోయారు. ఇప్పుడు ఎలా తప్పించుకోవాలి? వచ్చిన దారిగుండా ఈ సూట్ కేస్‌తో పోవటం కష్టం' అనుకుంటుండగా ఒక ఆలోచన తట్టింది.

గబగబ జేబులోనుండి క్లోరోఫాం బాటిల్ తీసి, కర్చీఫ్‌పై కొద్దిగా చల్లి, దాన్ని తిరిగి జేబులో వేసు కున్నాను. గోడకు ఆనుకుని నిలబడ్డాను, ఆమెగురించి ఎదురు చూస్తూ.

తలుపులు తెరుచుకున్నాయి. ఆమె లోపలికి వచ్చి, లైటుస్విచ్చు గురించి గోడవైపుకు తిరిగింది.

అంతే! ఒకచేత్తో నోరు మూస్తూ, రెండవచేతిలోని కర్చీఫ్‌తో ముక్కుపై వేసి అదిమిపట్టాను. ఆమె చేతులు నా చేతులను పీకివేయడానికి విఫల ప్రయత్నం చేస్తున్నాయి. కాని కొద్దిసేపట్లోనే చేతులు కిందకి జారిపోయాయి. నెమ్మ దిగా ఆమెను క్రింద పడుకోబెట్టాను.

'అమ్మయ్య ఒకరి సంగతి అయిపోయింది. ఇక అతని పనిపట్టాలి రాగానే' అనుకుంటూ కిటికీలో నుండి అవతలకి చూసాను.

నా అంచనా కరెక్టే అయింది. అతను లోపల ఇంత వరకు లైటు ఎందుకు వెలగలేదు అనుకుంటున్నాడు కాబోలు వస్తున్నాడు.

అవతలకి చూస్తున్న నాకు, ముక్కులో ఏదో దురద పెట్టినట్టు, తుమ్ము రాబోతున్నంతగా అనిపించింది. అమ్మో ఇప్పుడు తుమ్మితే అతనికి అనుమానమొస్తుంది.

అపుడు లోపలికి రాదు. ఆ తరువాత....ఆ తరువాత.... అనుకునేసరికి భయమేసి. తుమ్ముని ఆపడానికని చేతిలో ముక్కుని అటుఇటు నలుపుతున్నాను.

అంతే. కండ్లు మూసుకుపోతున్నాయి. అపుడు చూసుకున్నాను. ముక్కుని నలుపుతున్న చేతివంక. ఆచేతిలో క్లోరోఫాం తడిపిన కర్చీఫ్। కళ్ళు తెరిచేసరికి ఎవరిని చూడాలో అనుకుంటూ శరీరం నా స్వాధీనం తప్పగా కిందికి జారిపోయాను—

—జి. పి. రెడ్డి, హైదరాబాదు-36.

## "రా ము గో ల"

రాము అప్పుడే మ్యాట్నీ 'యమగోల' సినిమా చూసి వస్తున్నాడు. అతని బుర్రలో తన అభిమాన నటుని 'యముని' డైలాగ్స్ తిరుగుతున్నాయి.

బస్టాప్‌లో ఆగాడు.

అంతలో, ఒక వనిత అతణ్ణి రాసుకుంటూ పోటోయింది.

రాముకు పిచ్చికోపం వచ్చింది. ఆ వనితవైపు చూస్తూ "ఏయ్-రాముండ" అంటూ యముని డైలాగును అనుసరిస్తూ మీసంమీద చెయ్యివేసాడు.

అంతే। ఫట్‌మంది చెంప. ఆ యువతి ఎందుకు కొట్టిందో తెలియక, బిక్కమొహం వేశాడు పాపం రాము।

—బి. బాస్కరరావు, బెల్లంపల్లి.

